

# చతుర ప్రపంచం




## అందమైన సాయంకాలం

**1983** డిసెంబరు 12వ తేదీన న్యూయార్క్ మెట్రోపాలిటిన్ మ్యూజియంలో పెద్ద ఎత్తున ఓ డిన్నర్ ఏర్పాటు చేయబడింది. దానికి ముఖ్య అతిథి ప్రఖ్యాత ఫ్రెంచి డ్రస్‌డిజైనర్ లారెన్. ఆ సందర్భంగా ఆయన గత 25 సంవత్సరాల తన 'డ్రస్ డిజైన్ల' నమూనాలను అక్కడ ప్రదర్శించనున్నాడు. ఈ ప్రదర్శనకి, ఆ విందుకి కలిపి టికెట్ ధర ఆ రోజుల్లోనే 500 డాలర్లు. అయినా టిక్కెట్లన్నీ క్షణాల్లో అమ్ముడైపోయాయి. లారెన్ ప్రపంచం మొత్తంమీద అన్ని దేశాల మహిళలకు, కాలానుగుణంగా మారుతున్న ఫ్యాషన్లకు అనుగుణంగా డ్రస్ డిజయినింగ్ చేయగల కళాకారుడుగా పేరున్నవాడు.

1971 వరకు 'బ్లూబ్లేజర్' అనేది కేవలం పురుషులు మాత్రమే ధరించే డ్రెస్. కొన్ని మార్పులు, చేర్పులతో లారెన్ దానిని ఆడవాళ్లు కూడా ధరించేవిధంగా ఆకర్షణీయంగా మార్చాడు. దాంతో యూరప్, అమెరికా, కెనడా మొదలయిన చాలాదేశాల మహిళల వస్త్రధారణలో పెనుమార్పు రాసాగింది.

పూర్వం నల్లదుస్తులు భర్త చనిపోయిన స్త్రీలే ధరించేవారు. పురుషులు కూడా విషాద సూచకంగానే వాడేవారు. అయితే లారెన్ నల్లరంగు వస్త్రాలతో అద్భుతమైన డిజైన్లను తయారుచేసి స్త్రీలందరినీ ఆకట్టుకునేలా చేశాడు. దాంతో ఆ రంగుడ్రస్ ఓ గౌరవప్రదమైనదిగా రూపాంతరం చెందింది.

ప్యారిస్‌లో 19వ శతాబ్దపు ఒక అతిపెద్ద భవనంలో రెండేళ్లకొకసారి 140 మంది టైలర్ల సహాయంతో ఒక ఎగ్జిబిషన్‌ని నిర్వ

హిస్తాడు లారెన్. ఆ టైలర్లు లారెన్ డిజైన్ చేసిన రకరకాల దుస్తుల్ని కుట్టి ప్రదర్శి స్తారు. అందులో గౌన్లు, క్యాప్‌లు, సూట్లు, చివరికి బూట్లు సైతం ఎన్నెన్నో రకాలు ప్రదర్శించబడేవి.

ఒక మామూలు బ్లాక్‌వూల్ ఓవర్‌కోటు తయారుచేయడానికి 150 గంటలు పడు తుంది. దాని ఖరీదు 4,400 డాలర్లు. ప్రపంచం అంతటినుండి అతనికెన్నో కోట్లు ఖరీదు చేసే ఆర్డర్లు వస్తాయి. అయినా



అతడు చిత్తశుద్ధితో, దీక్షతో ఓ డిజైన్ రూపొందించడంలో పెట్టే ఖర్చు ఒక్కోసారి ఆదాయంకన్నా ఎక్కువే వుంటుంది. అయితే హైఫ్యాషన్ డిజైన్స్ ద్వారా పేరు మాత్రమే ఆశించే లారెన్ 'మాస్ గార్మెంట్స్' బిజినెస్ మీద బాగా లాభాలు సంపాది స్తాడు. రీవ్‌గాషే బ్రాండ్‌తో మార్కెట్ అయ్యే అతని దుస్తులకు సంవత్సరానికి 30 కోట్ల ఫ్రాంక్‌ల టర్నోవర్ వుంది. ఇదికాక అతని వద్ద లైసెన్స్ తీసుకుని ఆ డిజైన్లతో వ్యాపారం చేసే ఇతర కంపెనీలనుంచి కమి షన్ కూడా బాగానే ముడుతుంది. అతని కింద 20,000 మంది పనిచేస్తున్నారు. ప్రస్తుతం అతని వయస్సు 61. 1936లో అల్జీరియాలో ఓరియన్ సిటీలో పుట్టాడు లారెన్. 17 సంవత్సరాల వయసులో ఓసారి వులెన్ డ్రస్ డిజయినింగ్ కాంపిటీ షన్‌లో పాల్గొన్నాడు. ఇతడు రూపొందిం చిన 'బ్లాక్ కాక్‌టయిల్ డ్రస్' ఫస్ట్ ప్రైజు కొట్టింది. దాంతో అతడు ఆ దిశగా తన భవిష్యత్తును నిర్మించుకున్నాడు. ఈ డిజై నింగ్‌లో కొత్త మెళకువలు, పద్ధతులకోసం ప్యారిస్ వెళ్ళాడు లారెన్. అప్పటి ఫ్యాషన్ మ్యాగజైన్ 'హోగ్'కి ఎడిటర్‌గా వున్న మిఖే ల్‌బ్రనాఫ్ అతన్ని ప్రఖ్యాత డ్రస్ డిజయి నర్ క్రిస్టియాడ్యూయర్‌కి పరిచయం చేశాడు. ఆవిడ అతన్ని మెచ్చుకుని తన డ్రస్ డిజయినింగ్ కంపెనీలో ఉద్యోగమి చ్చింది, అతని వయస్సు పందొమ్మిదే అయినా.

1957లో క్రిస్టియా హఠాత్తుగా మరణిం చింది. అప్పటికి సీతాకాలపు డ్రస్‌లను తమ కంపెనీ తరపున మార్కెట్‌లో ప్రెజెంట్ చెయ్యడానికి 3 నెలలు మాత్రమే వ్యవధి వుంది. కంపెనీ డైరెక్టర్లందరూ ఖంగారుప డుతున్న సమయంలో దాన్ని ఛాలెంజ్‌గా తీసుకున్నాడు 21 ఏళ్ల లారెన్. ఆ ప్రదర్శన గొప్పగా విజయవంతమవటంతో అతడి కలె క్షన్స్‌కి 'ట్రపీజ్' అని పేరు పెట్టాడు లారెన్. కొన్ని అపజయాల్ని చవిచూసినా లారెన్ ఓ అమెరికన్ స్పాన్సరర్ సాయంతో 'వై.యస్.యల్' పేరుతో ఓ ఫ్యాషన్ బిజి నెస్ ప్రారంభించాడు. లారెన్ పేరు నలు మూలలా వినిపించడంతో చాలామంది తమ కంపెనీలలో ఉద్యోగాలు వదిలి 'వై.యస్.ఎల్.' కంపెనీలో చేరారు. 1962లో అతడు పెట్టిన ఎగ్జిబిషన్‌లో అతడి 'పీజాకెట్' హిట్ అయింది. ఇప్పటికీ దాని పేరు అలాగే నిలబడింది.

లారెన్ అంటాడు "నా జీవితంలో అంద మైన సాయంకాలం వుందంటే అది నా డిజైన్ల ప్రదర్శన నాటిదే. మళ్ళీ మర్నాటి నుంచీ కొత్త డిజైన్లకోసం మధన ప్రారంభ మవుతుంది"







# ఆల్ రౌండర్

వాసిమ్ అక్రమ్ పేరు వినిపించకపోవచ్చు గానీ పాకిస్థాన్ క్రికెట్ టీమ్‌లో ఒకప్పుడు ఆల్‌రౌండర్‌గా మంచిపేరు తెచ్చుకున్నాడు. పాకిస్థాన్‌కు చెందిన అక్రమ్ ఈ ఫీల్డులో కేవలం తన స్వయంకృషితో పైకొచ్చాడు. ఎందుకంటే అతడి తండ్రిగానీ, బంధువులు గానీ ఎవరూ ఆఫీల్డులో లేరు సరికదా, వాసిమ్‌ని క్రికెట్ ఆడటానికి ప్రోత్సహించే వారు కూడా కాదు. ఒక్క వాసిమ్ తల్లి మాత్రం అతని తరపున మాట్లాడేది. ముఖ్యంగా వాసిమ్ అక్రమ్ తండ్రి మహమ్మద్ అక్రమ్‌కి కొడుకు క్రికెట్ ఆడటం ఎంతమాత్రం ఇష్టముండేదికాదు.

ఓసారి మహమ్మద్ అక్రమ్ తనకూతురుని చదువుమీద శ్రద్ధ చూపట్లేదని తిట్టినప్పుడు దానికి సమాధానంగా ఆ అమ్మాయి "నువ్వెప్పుడూ నన్నే తిడతావు గానీ అస్తమానూ క్రికెట్టాడుతున్న వాసిమ్‌నేమీ అనవు. నీకంతా పక్షపాతమే" అంది.

ఆమాట వినగానే కోపం నషాళానికంటి అప్పటికప్పుడు వాసిమ్ కోసం అతడు చదువుతున్న కాలేజీకి పరుగెత్తాడాయన. అంత క్రితమే క్రికెట్ ఆడివచ్చి క్లాసులోకెళ్ళబోతున్న వాసిమ్‌ను స్నేహితులందరి ముందూ చెడామడా తిట్టేశాడాయన. కానీ అదే తండ్రి అటుపైన ఇండియన్ టీమ్‌నే కాక ఎన్నో దేశాల క్రికెట్ టీమ్స్‌ని తన నేర్పుతో భయపెట్టిన వాసింను చూసి గర్వపడ్డాడు.

1966, సెప్టెంబర్ 7న లాహోర్‌లో పుట్టాడు వాసిమ్. అతడు తన ఫస్ట్ టెస్ట్‌మ్యాచ్‌లోనే 7 వికెట్లు పడగొట్టి ప్రత్యర్థులకి 50 పరుగులు మాత్రం ఇచ్చాడు. అతనికి ఇమ్రాన్ ఖాన్ అంటే ఆరాధనాభావం వుండేది. ఇమ్రాన్ కూడా వాసిమ్‌ని బాగా మెచ్చుకున్నాడు. 1984లో న్యూజిలాండ్ టీమ్‌తో ఆడే అవకాశం వచ్చినప్పుడు వాసిమ్ అందులో చూపెట్టిన ప్రతిభ అనన్యసామాన్యం. మొదటి ఇన్నింగ్స్‌లో 5 వికెట్లు తీసుకుని 56 పరుగులు మాత్రం ఇచ్చాడు న్యూజిలాండర్స్‌కి. రెండవ ఇన్నింగ్స్‌లో 72 పరుగులిచ్చి 5 వికెట్లు తీసుకున్నాడు. "బెన్సన్ అండ్ హెడ్జెస్' క్రికెట్ టూర్నమెంటులో ఆస్ట్రేలియాతో పోటీపడి ఆడినప్పుడు 5 వికెట్లు తీసుకుని కేవలం 21 పరుగులు మాత్రం ఇచ్చాడు. వాసిమ్ మంచి బౌలరే కాక బ్యాట్స్‌మాన్ కూడా. అయినా ఆమధ్య జబల్‌పూర్‌లో ఇండియా పాకిస్థాన్‌ల మధ్య జరిగిన మ్యాచ్‌లో ఇండియా ఓడిపోవడానికి ముఖ్యకారణం పాకిస్థాన్ టీమ్‌లో వాసిమ్ వుండటమే అంటారు చాలామంది. ★



# 'కాన్వెంట్' పై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన కృష్ణజ నవల 'కాన్వెంట్'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## 'అసమగ్ర చిత్రం'

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

'కాన్వెంట్'లో రచయిత్రి ఎన్నుకున్న ఇతి వృత్తం ఒకరకంగా కత్తిమీద సాములాంటిదే. అయితే ఎక్కడా విసుగు కలగకుండా సమస్యను కూలంకషంగా చర్చించడంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు.

ఈ పోటీ ప్రపంచంలో మంచి చదువుకావాలంటే పెద్దపెద్ద స్కూళ్లల్లో చేర్పించక తప్పదని వేలకు వేలు డొనేషన్లు, ఫీజులు కట్టేందుకు తమ సరదాలు చంపుకునే ఎంతో మంది మధ్యతరగతి తల్లితండ్రులకు ప్రతీకలు సారథి, లక్ష్మిలు.

ఉన్నవారి మధ్య చదువుకుంటూ వాళ్లలా తను ఖర్చు పెట్టలేక, వాళ్లలాగ తనకు ఇంట్లో స్వాతంత్ర్యం లేదని అనుక్షణం బాధపడుతూ చివరకు అబద్ధాలు, దొంగతనం లాంటి వాటికి దిగజారిన పసిమనసు అనిల్... తాము చేసేది తప్పని ఎవరూ చెప్పేవారు లేక చెడు అలవాట్లకు బానిస అయిపోతూ, పెద్దవారిని అనుకరిస్తున్నామని ఆనందపడే సుభాష్, నవీన్, వేణు... డబ్బు సంపాదన ధ్యేయంగా పెట్టుకుని పిల్లలను పట్టించుకోడా





నికి తీరికలేని వాళ్ల తల్లితండ్రులు సమాజంలో మనకు అడుగడునా కన్పిస్తూనే ఉంటారు.

అయితే రచయిత్రి పిల్లలు చెడిపోయే విధానాన్ని హైలైట్ చేసి సమస్య గురించి చర్చించి వదిలేశారు తప్ప పరిష్కారం చూపలేకపోవడంతో నవల అసమగ్ర చిత్రంగా గోచరిస్తుంది. పరిష్కారం చూపడం కూడా రచయిత్రి బాధ్యతే.

నవీన్‌హత్య, పాపరేప్ సంఘటనలలో పిల్లలందరికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బాధ్యత ఉన్నా వారికి ఏవిధమైన శిక్షపడక పోవడంవల్ల వారిలోను, తల్లితండ్రులలోను కూడా ఎటువంటి మార్పు రాలేదు. ఇద్దరిలో మార్పు వచ్చినట్టుగా ముగింపు ఉంటే బాగుండేది.

అలాగే చదువు కావాలంటే కావాల్సింది హంగు, ఆర్భాటం కాదన్న విషయాన్ని మరో చిన్న స్కూలు, పట్టించుకునే టీచర్లు లాంటి నేపథ్యంలో చిత్రిస్తే పెద్ద స్కూళ్లమీద వున్న మోజు తగ్గి తల్లితండ్రులకు కనువిప్పు కలిగేది.

ఏదిఏమైనా 'రచనవల్ల సమాజంలో మంచి జరుగుతుంది' అన్న విషయాన్ని రచయిత్రి మరోసారి నిరూపించారు. పరిష్కారం చూపక పోవడం లోటయినా సమస్య గురించి వివరించారు కనుక పరిష్కారం వెతకడం పెద్ద కష్టంకాదు అనిపిస్తుంది. పరిష్కారం చూపకపోవడం వల్ల కాన్వెంట్ అసమగ్ర చిత్రంగా గోచరిస్తుంది.

-కె.శైలబాల
విజయవాడ- 520011

## 'చదువెందుకు?'

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

కృష్ణజగారు ఒక మంచి టాపిక్‌ను తీసుకొని మంచి చెడ్డలను తెలియజేస్తూ తను తటస్తంగా వుండి ముగింపును పాఠకులకు ఒదిలివేశారు.

'కాన్వెంట్' నవల పెద్దలందరూ చదివి తీరాల్సిన నవల. ముఖ్యంగా కాన్వెంట్ విద్యకోసం తమ పిల్లలను తెల్లవారి లేచిన దగ్గరనుంచి పరుగులు పెట్టిస్తూ, కాన్వెంట్ ఇచ్చే ర్యాంక్‌ల కోసం పిల్లలను అధిక శ్రమకు గురిచేస్తూ ఫలానా కాన్వెంటులో తమ పిల్లలు చదువుకొంటున్నారని గొప్పలను చెప్పుకొంటూ, ఇతరులను కూడా అలాగే తమ పిల్లలను కాన్వెంటులో చదివించడానికి ప్రోత్సహించేవారు తప్పకుండా చదవాలీ నవల.

ఇక్కడ ముఖ్యంగా చెప్పుకోవాల్సిన విషయం పిల్లల చదువు వాళ్ల విజ్ఞానం కోసమా? లేక తమ ఆధిక్యాన్ని చాటుకోవడానికా? ఇది పెద్దలు ఆలోచించాలి. పసివాళ్లు తమకు ఫలానాది కావాలని అడగరు. పెద్దలే వాళ్ల పసి మనసులమీద తమ ఇష్టాయిష్టాలు రుద్దుతారు. పిల్లలకు ఇస్త్రీ యూనిఫాంలు తొడిగి వాళ్ల మెడలకు ఒక టై బిగించి వీపున గుదిబండలా ఒక పుస్తకాల సంచిని తగిలించి వాళ్లు ఉరుకులు పరుగుల మీద వుంటే వాళ్లతోపాటు పడుతూలేస్తూ తామేదో త్యాగం చేస్తున్నట్లు ఫీలవుతారు. అలాంటి తల్లి పాత్రే ఈ నవలలోని లక్ష్మిది.

కాన్వెంట్‌కి వెళ్లిన మొదటి రోజుల్లో పిల్లలు ప్రతి విషయం తొందరగా నేర్చుకొంటారు. అది కాన్వెంటు గొప్పతనం కాదు. పిల్లలకు సహజంగా వుండే జ్ఞాపకశక్తి అందుకు కారణం. అయితే తల్లిదండ్రులు ఆ విషయం మరచిపోతారు. అదంతా కాన్వెంట్ గొప్పతనంగా భావించి పొంగిపోతారు. కాలం గడుస్తుంటే వీపున సంచి బరువు పెరుగుతుంటే పిల్లల్లో శ్రద్ధ, ఆసక్తి ఇతర రంగాలకు మళ్లుతాయి. అటువంటి సమయంలోనే అటు విద్యాలయంలో, ఇటు ఇంటి వద్ద సరైన గైడెన్సు అవసరం. ఈ నవలలో

దుఃఖాంతం ఏమిటంటే ఈ పాయింటు దగ్గరే అటు టీచర్లు, ఇటు లక్ష్మి, సారథులు ఫెయిల్ అయ్యారు. టీచర్లు కేవలం హెూం వర్క్ చెక్ చేయడం వరకూ తమడ్యూటీ చేస్తే లక్ష్మి పిల్లవాడు పుస్తకాల ముందు కూర్చున్నాడా లేదా అన్నది మాత్రమే చూస్తే సారథి అసలు ఏమీ పట్టనట్టుగా ప్రవర్తించడం ద్వారా తమ బాధ్యతా రాహిత్యాన్ని నిర్వహించారు. అనిల్ చెడ్డ మార్గాలు పట్టడానికి కారణం అయ్యారు.

మంచీ చెడూ ఎప్పుడూ వుంటాయి. వాటినించి తమ పిల్లలు ఎటుపక్కకు మొగ్గుతున్నారు అన్నది గమనించి సక్రమ మార్గాన పెట్టవలసిన బాధ్యత తల్లితండ్రులది, టీచర్లది, ఇంటిలోవున్న ఇతర విద్యావంతులైన పెద్దలది. అలా పెద్దలందరూ బాధ్యతగా ప్రవర్తించిననాడు వీధిబడి అయినా, కాన్వెంటు అయినా ఒక్కటే. సంస్థను తప్పుపట్టి లాభంలేదు. సమాజాన్ని సక్రమ మార్గాన నడవమనే సందేశం అంతర్గతంగా అందించడం ద్వారా రచయిత్రి తమ బాధ్యతను నెరవేర్చారు. దాన్ని అనుసరించవలసిన ఆ డ్యూటీ ఇప్పుడు తల్లితండ్రులది.

మంచి నవల అందించిన చతురకు అభినందనలు.

-కాళహస్తి నాగేశ్వరరావు
సంగాయగూడెం

## 'కనువిప్పు'

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'కాన్వెంట్'లో మధ్య తరగతి ప్రజల మనస్థత్వం ఎలాంటిదో రచయిత్రి స్పష్టంగా చెప్పగలిగారు. ఎన్నో ఆశల్ని చంపుకొని చాలీచాలని ఆదాయంతో కాలం గడిపేస్తూ తమ పిల్లలను ఆకాశ సౌధాలమీద కూర్చోబెట్టాలని చూసే ప్రతి తల్లితండ్రులు తప్పక చదవవలసిన నవల. ఇంతా చేస్తే తమ పిల్లలు చివరకు ఒక గూండాగా లేక ఒక పనికి రాని వ్యక్తిగా తయారయితే ఆ తల్లితండ్రుల బాధ చెప్పనలవికాదు. అందుకు ఉదాహరణగా ఇందులోని లక్ష్మి, సారథిలను చెప్పుకోవచ్చు. ఇంట్లో తల్లి, తండ్రి పెంపకం కన్నా బయట పరిస్థితులు, పిల్లలమీద ఎలాంటి చెడు ప్రభావం చూపిస్తాయో చక్కగా చెప్పారు. అయితే ముగింపు మాత్రం అతికినట్లుంది. కేవలం డబ్బు గురించి అంత పెద్ద పేరుగల కాన్వెంట్ ప్రిన్సిపాల్ రేప్ చేసిన పిల్లలను క్షమించి వదిలెయ్యడం సినిమా ముగింపులా ఉంది. కనీసం వాళ్లకు టి.సి ఇచ్చి పంపించినట్లు ముగించినా బాగుండేది. రేపు మర్డరు చేసినా ఓ యాభైవేలు ఇవ్వండి నేను కవర్ చెయ్యగలను అని ఏ బాధ్యతగల ప్రిన్సిపాల్ చెప్పరు. ఎందుకంటే ఈ రోజు రాజు, సుభాష్, అనిల్, ప్రకాష్‌ను వదిలెయ్యడంవల్ల వాళ్లలాంటి వాళ్లు మరో బ్యాచ్ తయారయిపోతారు. వాళ్లను శిక్షిస్తే కనీసం మిగతావాళ్లు అలాంటి పనిచేసే ధైర్యం చెయ్యరు. ఏదైనా నవల ముగింపు మాత్రం చికెన్ కర్రీలో ఉప్పులేనట్లుంది.

-కె.రాజమణి
లక్కవరం-531075

## 'మమ్మీ డాడీ సంస్కృతి'

*(నాలుగువ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

పెద్దల మాడరన్ సొసైటీ లక్షణాలు లేతమనసులను హత్య, రేప్‌వంటి ఘోరాలకు పురికొల్పుతుంటే వాటికి రంగస్థలమైన కాన్వెంట్‌లోకి రాకూడని మనిషిగా వచ్చిన అనిల్‌కు సహవాస దోషమెలా సంక్రమించిందో నవంబర్ నెల చతుర నవల 'కాన్వెంట్'లో కృష్ణజ చక్కగా వివరించారు. మమ్మీ-డాడీ సంస్కృతి మధ్యతరగతి జీవితాల్నెలా మాయచేస్తుందో కళ్లకు కట్టినట్లుగా చెప్పుకొచ్చిన రచయిత్రి అభినందనీయురా




లు. మారాజుల బిడ్డలు చదువుకునే స్కూళ్లో పావలాకూడా పాకెట్‌మనీగా లేని క్రింది తరగతుల పిల్లల మానసిక పరిస్థితికి అనిల్ పాత్ర అద్దంపడుతుంది.

నమ్రత, సిన్సియారిటీకి పేరైన అనిల్‌ను కలవారి కాన్వెంట్ ఎంత చాల్‌బాజీని చేసిందో చూస్తే బాధ కలుగుతుంది.

అయితే అనిల్ భవిష్యత్ఏమైంది? అతను మారాడా? లేదా? మారితే ఏ మేరకు అనే వివరాలు చూచాయగానైనా తెల్పకుండా నవల ముగింపుకు చేరడంలో పరిపూర్ణత లోపించింది. మాతృత్వం మూర్తీభవించిన అమాయక ఇల్లాలుగా లక్ష్మి పాత్రని తీర్చిదిద్దిన రచయిత్రి సారధి పాత్రకి న్యాయం చేయలేకపోయారు. బ్యాంకులో పనిచేస్తున్న ఆయన సంవత్సరంపాటు తనకొడుకు ప్రోగ్రెస్‌ని, ప్రోగ్రెస్ రిపోర్టుని చూడకపోవటం, పట్టించుకోకపోవడం అసంభవం.

ఏది ఎట్లున్నా తగిన ఆదాయం లేకున్నా తమ పిల్లల భవిష్యత్ భద్రత కోసం అని భ్రమిస్తూ కాన్వెంట్‌లవైపు పరుగులు తీసే తల్లిదండ్రుల్ని ఈ నవల ఒకటికి రెండు సార్లు ఆలోచింపజేస్తుందనటంలో సందేహంలేదు.

-ఎనగందుల వెంకటేశ్వర్లు
రాజపల్లి

## 'హైటెక్ కాన్వెంట్స్'

**(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)**

'కాన్వెంట్' నవల నదీ ప్రవాహంలా మొదట చిన్నగా ప్రారంభమై కథాగమనంలో విస్తృతి నింపుకొని, తల్లిదండ్రుల మదిలో అర్థవంతమైన ప్రశ్నలు రేకెత్తించి 'విశ్వశ్రేయం కావ్యం' అన్న నానుడిని సార్థకం చేసుకొంది. ఫాల్స్ ప్రిస్టేజిని గాలిగా పీలుస్తూ పులిని చూసి నక్క వాతలు పెట్టుకొన్న తీరులో మంత్రులు, బడా వ్యాపారవేత్తలు, ఉన్నతాధికారుల పోకడలో తమ బిడ్డలను చదివింపదలచిన మధ్యతరగతి దంపతులకు లక్ష్మి, సారథుల హృదయవేదన చెంప పెట్టు.

నవనాగరికత ముసుగులో అభేద్యమైన ప్రహరీగోడల మధ్య, హైటెక్ కాన్వెంటులలో, క్లాసు రూములలో, స్టాఫ్ రూములలో జరుగుతున్న సంఘటనలను కన్నులకు కట్టినట్లుగా వివరించారు రచయిత్రి. ఈ నవలలోని సంభాషణలు, సంఘటనలు, సన్నివేశాలు కల్పితాల్లాలేవు. ఖచ్చితంగా జరుగుతున్నవే! ఇలాంటి సమాజంలో బతుకుతున్న మనలను ఉద్దేశించి రాసినవే. లక్ష్మి, అనిల్, సుభాష్, టీచర్లు, తల్లిదండ్రులు అందరూ సజీవ పాత్రధారులే! అసలైన సూత్రధారులు వాటి మధ్య పరిపుష్ఠమైన సంఘటనలే!

పాఠశాల స్థాయిలో విద్యార్థులు క్లాసులెగ్గొట్టడం, అబద్ధాలు, దొంగతనం, నీలిచిత్రాలు, ముష్టియుద్ధాలు, హత్యలు, మానభంగాలు... పక్షవాతానికి గురైన నేటి సమాజంలోని ఒక పార్శ్వానికి చిన్న ఉదాహరణలు. అపరిపక్వమైన ప్రేమలు, ఆసిడ్ చల్లుకోవడం, సిగరెట్లు, మత్తుమందులు, ఈవ్‌టీజింగ్ రచయిత్రి సృజించని ఇతరకోణాలు. పతనమవుతున్న విలువలు, ఆత్మవంచనలకు ప్రతీకలు డాక్టర్ మూర్తి జంట! లుప్తమవుతున్న ప్రొఫెషనల్ ఎథిక్స్‌కు లాయర్, రెడ్డిగార్లు సాక్షీభూతాలు, మిషనరీస్ మతవ్యాప్తి కొరకు మెకాలే విద్యావిధానంలో ప్రారంభమైన కాన్వెంట్ పద్ధతిలోని లోపాలను ఆరగట్టి ఎండేసిన ఈ నవల నేటి సోకాల్డ్ విద్యావేత్తలందరూతప్పక చదవవలసినది. 'గురుర్బ్రహ్మ' అన్న వేదోక్తిని, 'వ్యయేకృతే వర్థతే విద్యా' అన్న సుభాషితాన్ని అపహాస్యం చేస్తున్న నేటి విద్యా వ్యవస్థను చూసి ఆనాటి కులపతుల ఆత్మలెంతగా ఘోషించుచున్నవో కదా!

అమంగళం ప్రతిహతమగుగాక!

-బి.ఉషాదేవి
దొడ్డబళ్లాపూర్

# చతుర

సంపుటి: 20 సంచిక: 12 జనవరి: 1998

అదొక మారుమూల పల్లెటూరు.
దేవాలయాల్లోకి ఉన్నతకులస్థులనే తప్ప నిమ్నకులస్థులని అడుగు పెట్టనివ్వని పరిస్థితి ఇంకా అక్కడ చెల్లుతూనేవుంది.
ఊరి మునసబుకి, గుడిపూజారికి భయపడే అమాయకులెందరో వున్న ఆ ఊళ్ళో... అనుకోని సంఘటన ఒకటి జరిగిపోయింది.
తమ ఇంట్లోనే పాలేరుగా పనిచేసే ఓ దళిత యువకుడికి గుడి పూజారిగారమ్మాయి మనసిచ్చింది. అది మనువు దాకా వచ్చేసరికి ఊర్లో ఆ విషయం గుప్పుమంది.
ఆ అమ్మాయిని వివాహం చేసుకుంటే తన బ్రతుకు ఎలాంటి విపత్తులో కూరుకుపోతుందో తెలిసికూడా సాహసం చేసిన ఆ యువకుడి కేమయింది?
ఆ ఊరి విషయాల్లో ప్రముఖ పాత్ర వహించసాగిన ఆ యువకుడు ఊరిపెద్దల్నే గడగడలాడించిన వైనం ఏమిటి?
ఆసక్తికరంగా సాగిన సింహప్రసాద్ గ్రామీణ జీవన యధార్థ చిత్రణ "వేయి సూర్యుళ్ళు" ఈనెల చతుర సమగ్ర నవల.



"ఆ లమ్డీకొడుకు జుట్టు పట్టుకుని ఇలా ఈడ్చుకు రండ్రా" పులిలా గర్జించాడు అనంతయ్య.

ఆయన ఆ ఊరుకి మకుటంవున్న మహారాజు. గ్రామసర్పంచ్. హంగుబలం, అర్థబలం భారీగా కలవాడు. మనిషి కూడా చెయ్యెత్తున భారీగా వుంటాడు. ఆయన ఆస్తిపాస్తులూ భారీవే. ఊళ్లో సగం ఆయన్దే అంటే అతిశయోక్తికాదు.

అలాంటి ఆయన ఇపుడు రౌద్రాకారం దాల్చి వూగిపోతున్నాడు.

ఆయన కోపాగ్ని కీలల్లోంచి తప్పించుకు పారిపోతున్న అభాగ్యుడు రామదాసు.

సంధించి విడిచిన బాణంలా పరుగెడుతున్నాడు వాడు. ఏడుస్తూ రొప్పుతూ పడుతూ లేస్తూ పరుగెడుతున్నాడు.

"సంపేత్తన్నారు బాబోయ్! రచ్చించండి తండ్రోయ్!" అని అరుస్తూ అర్థిస్తూ ప్రాణాలు అరచేత బెట్టుకుని ఒకటే పరుగు.

అతడి వెంట వేటకుక్కల్లా పడ్డారు అనంతయ్య అనుచరులలో ఇద్దరు.

జనం విస్తుబోయి చూస్తున్నారు. వారికేమీ అర్థం కావటంలేదు. కానేదో ఘోరమే జరిగి వుంటుందనుకున్నారు.

అదేమయ్యుంటుందోనన్న ఆసక్తి ఎక్కువై ఆరాలు తీయడం మొదలెట్టారు.

కొందరు అడిగేశారు కూడా.

"ఏంట్రా రాందాసు గాడ్నెందుకు తరుముతున్నార్రా? "

"మా కామందుగోరి అమ్మాయిగోర్ని పేమిత్తున్నానన్నాడంట. ఆడి రెక్కలు ఇరిసి కట్టుకుతీసుకు రమ్మన్నారు. ఆడికియాల మూడింది. భూమ్మీద నూకలు సెల్లినట్టే.."

ఊరువిస్తుబోయింది.



ఏమిటీ?

ఓ హరిజనుడు అగ్రకులస్తుల అమ్మాయిని ప్రేమించాడా?

ఊరి మోతుబరి కూతురితో ప్రేమించానని చెబుతాడా? చెప్పగలడా?

ఎంత ధైర్యం!

ఎన్ని గుండెలు!

బ్రహ్మంగారు చెప్పిన కలికాలం అంతమయ్యే రోజు వచ్చేసినట్టేవుంది!

అయ్యో! అయ్యో! ఎంత ఘోరం!

ఇవాళ ప్రేమించానన్నాడు! రేపు చెయ్యి పట్టుకుంటాడు! ఎల్లుండి పెళ్లాడతానంటాడు!

రకరకాల వ్యాఖ్యానాలు! ప్రతీకార భావనలు!

ఎవ్వరూ సాయం రారని అర్థమైపోయింది రామదాసుకి. పెద్ద కులాల వారికి పెద్ద మనసుంటుందనుకోవడం పొరబాటనుకున్నాడు.

మాలపల్లెలోకి వురికాడు. తనవాళ్లైనా రక్షణ కవచంగా నిలవకపోతారా అన్న ఆశతో.

అక్కడా జనం మూగారు. సంగతి విన్నారు. కాని రక్షించడానికెవరూ ముందుకి రాలేదు.

నిర్లిప్తంగా వుండిపోయారు కొందరు. మొఖం చాటేశారు కొందరు. ఎదురు అతడ్నే నిందించారు మరికొందరు.

"సెడే కాలానికి కుక్కమూతి పిందె ఏసినట్టు నీకిదేం పోయేకాలంరా? "

"అన్నం పెట్టిన సేతినే కొరుకుతావేంట్రా తప్పుడు నా కొడకా? "

"కామందునెదురు తిరిగితే వూళ్లో ఉప్పు పుట్టుద్దేంట్రా? ఆర్ని ఎదిరించి బతగ్గలవేంట్రా కుర్రనాయాలా? "

హతాశుడయ్యాడు రామదాసు. కన్నీళ్లు ముంచుకొస్తున్నాయి.

అయినా పరుగెడుతూనే వున్నాడు. ప్రాధే యపడుతూనే వున్నాడు. ఏడుస్తూనే వున్నాడు.

అతడ్ని అనంతయ్య అనుచరులు తరుముతూనే వున్నారు.

రామదాసు రెండు పదులవాడు. ఆజానుబాహుడు. అందగాడు. చురుకైనవాడు. సూదంటురాయిలాంటివాడు. మొఖంమీద చిరునవ్వు, ఒంటిమీద శుభ్రమైన బట్టా ప్రత్యేకతలుగా కలవాడు.

పెద్ద వారిళ్లలో భూస్వాముల కమతాల్లో పనిచేసేవాడు.

కొందరాడవాళ్లతడి మీద మోజుపడ్డారు. చీకటి సంబంధాలకి అర్రులు చాచారు. అతడు లొంగలేదు. ఆశపళ్లేదు. దాంతో రకరకాల వంకల్తో తిట్టారు. వేధించారు. శపించారు.

వాటిని చిర్నవ్వుతో దులిపేసుకునేవాడు. తన పనితనంతో అందర్నీ మెప్పించేవాడు.

అలాటి రామదాసు అనంతయ్యగారమ్మాయిని చూసి దంగైపోయాడు. ఆమెనుంచి ప్రతిస్పందనలేకపోయినా ఆరాధించడం మొదలెట్టాడు. ఆమెకోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధపడ్డాడు.

అది గ్రహించిన ఆమె రకరకాల పనులు చెప్పేది. వుడికించేది. నవ్వేది. రెచ్చగొట్టేది. అంతలోనే తిట్టేది. తీసిపారేసేది!

అయినా వెనుకంజవెయ్యలేదతడు.

ఇవాళ తెగించి తన గుండెల్లోని మాటని చెప్పేశాడామెకి.

ఆమెని ప్రేమిస్తున్నానన్నాడు. అంతే. అంతకుమించి ఏమీ అన్లేదు.

ఆమె అహం దెబ్బతింది. అభిజాత్యం గాయపడింది.

బుస్సున లేచి కస్సున చూసి విసవిసావెళ్లి తండ్రికి చెప్పింది.

ఆయన వుగ్రుడయ్యాడు.

ఫలితం రామదాసు చావుపరుగు!

ఊరంతా చుట్టేస్తున్నాడు రామదాసు. కొద్దోగొప్పో సానుభూతి చూపిస్తున్న వారు కూడా రక్షించడానికి ముందుకి రావట్లేదు.

మనకెందుకు లెమ్మనుకున్నారు. అనంతయ్యతో విరోధం వస్తుందని భయపడ్డారు.

అగ్రకులాల వారి తడాఖా చూపించాల్సిందేనన్నారు కొందరు.

అధమ జాతివాడికింత తెగువా అని మండిపడ్డారు ఇంకొందరు.

రామదాసు కాలికి రాయి తగిలింది. తూలి ముందుకి పడ్డాడు.

అతడు లేచేంతలో యమభటుల్లా వచ్చి అతడిరెక్కలు గట్టిగా పట్టేసుకున్నారు. వారి వుడుంపట్టునుంచి తప్పించుకోవాలని చూశాడు. సాధ్యం కాలేదు.

బతిమాలాడు. ఏడ్చాడు. గోలపెట్టాడు.

ఊహూ... వదల్లేదు!

ఈడ్చుకుంటూ రచ్చబండ దగ్గరకి తీసుకుపోయారు.

పోగైన జనం ఏం జరుగుతుందోనని భయం భయంగా చూస్తున్నారు.

పెడరెక్కలు విరిచి చెట్టుకు కట్టేశారతడ్ని.

అనంతయ్య వచ్చారు. మాడ్చేసేలా చూశారు. చెప్పు కాలితో తన్నారు. తిట్టారు. ఒగిర్చారు. కంటిచూపుతో ఆజ్ఞలిచ్చారు.

ఆయన అనుచరులు రామదాసుని బాదారు. గొడ్డుని బాదినట్లు బాదారు. దయాదాక్షిణ్యం లేనట్టు చావగొట్టారు.

రామదాసు నెత్తుటిముద్దయ్యాడు. బాధ తాళలేక కేకలు పెట్టాడు.

'అయ్యో' అనుకున్నారు చూస్తున్న కొందరు. కాని పైకేమీ అనలేదు. అనంతయ్య కోపం అణుమాత్రం తగ్గలేదు.

ఊళ్లో ఎందరో అమ్మాయిలున్నారు.



వారిలో ఎవర్నైనా ప్రేమించి వుండొచ్చు కాని రామదాసు అలా చేయలేదు.

ఏరికోరి తన కూతుర్ని ప్రేమించాడు.

ఆ మాట కడుపులోనే దాచుకున్నాడా అంటే అదీలేదు. గొప్పగా నేనే మొనగాడ్న న్నట్టు చెప్పేడు.

సాక్షాత్తు తన కూతుర్తోనే చెప్పేడు.

ఎంత ధైర్యముంటే ఎంతకి తెగిస్తే ఎంత విర్రవీగితే అలా చెప్తాడు?

ఇంత జరిగేక సహించి వూరుకుంటే తన పరువేమిటి, మర్యాదేమిటి, విలువేమిటి, గొప్పతనమేమిటి?

సహించకూడదు. మౌనం వహించరాదు. అసలలాంటివాణ్ణి బతకనీ కూడదు!

అహంకారంతో రెచ్చిపోయారు అనంతయ్య.

"కిరసనాయిలు తెండ్రా. నిలువునా కాల్చి చంపండ్రా దొంగ మాదొచ్చేదుని" ఛీంకరించారు.

ఎవరో కిరసనాయిలు డబ్బా తెచ్చారు. వద్దొద్దని దణ్ణాలు పెట్టాడు రామదాసు. క్షమించండంటూ కేకలు పెట్టాడు. ఏడ్చాడు.

విన్పించుకోలేదెవరూ. చెవిటి, గుడ్డి వాళ్లలా మిన్నకుండిపోయారు.

రామదాసు నెత్తిమీద కిరసనాయిలు దిమ్మరించారు.

భయం భయంగా చూస్తోంది జనత.

"చూస్తారేంరా నిప్పెట్టండి. చంపి పాతరెయ్యండి" అగ్గిపుల్ల గీశారు.

క్షణాల్లో జ్వాలలు లేచి రామదాసు శరీరాన్ని నలువైపుల్నుంచీ చుట్టేశాయి. అతను ఆర్తనాదాలు చేశాడు. హాహాకారాలు చేశాడు.





అంతా వెనక్కి నక్కి జరిగారు.

మరికొద్ది నిమిషాలకి కుప్పకూలిపోయాడు. కేకలు ఆగిపోయాయి. శరీరం కాలుతున్న వాసన మెల్లగా చుట్టెయ్యసాగింది.

ఆ అమానుషకాండకి సాక్షిగా నిల్వలేక సూర్యుడు కొండల్లో దాక్కున్నాడు.

మర్నాడు యస్సై, పోలీసులూ బిలబిలమంటూ దిగారు వూళ్లోకి.

ఊరిని రచ్చబండ దగ్గరకి పిలిచి ఏం జరిగిందని ప్రశ్నించారు.

తెలీదన్నారు జనం.

రామదాసు ఎలా చచ్చిపోయాడని అడిగారు.

"నిప్పంటుకుని" చెప్పేరు.

నిప్పెవరు అంటించారని అడిగారు.

తెలీదు, చూళ్లేదన్నారు.

ఈ తతంగమంతా చిద్విలాసంగా చూస్తున్నారు అనంతయ్య.

"ఎవరూ చూడకపోతే ముందుకొచ్చేవరూ సాక్ష్యం చెప్పకపోతే మేం చేసేదేముండదు. అనంతయ్య గారింట్లో దొంగతనం చేసి పారిపోతూ దాయిలగుంటమీద పడగా నిప్పంటుకుని ప్రమాదవశాత్తూ మరణించాడన్న వాదనతో ఏకీభవించి కేసుని మూసెయ్యాల్సొస్తుంది. చెప్పండి. ఏం జరిగిందో ఎవరూ నిజంగా చూళ్లేదా? " యస్సై ప్రశ్నించాడు.

"నేను సూశాను" ఏడేళ్ల కుర్రాడు ముందుకొచ్చి అన్నాడు.

జనం అదిరిపడి చూశారు. వులిక్కిపడ్డ అనంతయ్య నిప్పులు రాలుస్తూ చూశారు.

ఆ కుర్రాడి తండ్రి గబుక్కున ముందుకొచ్చి కుర్రాడి నోరుమూసేసి బయటికి తీసుకుపోయాడు. ఆ కుర్రాడు తండ్రి చేతిని కరచి పారిపోతూ "కామందే సంపిండోచ్" అని అరుస్తూ పరుగెట్టాడు.

ఆ కుర్రాడి పేరు సూర్యం!



పెద్ద మునసబుగారు తమింటి అరుగు మీద గంభీరముద్రదాల్చి కూర్చున్నారు.

వారికో పక్కన ఆ వూరి నలుగురు పెద్దలూ, మరోపక్క కొందరు బ్రాహ్మలూ కూర్చున్నారు. వారిలో బ్రాహ్మల పెద్దా, గ్రామంలోని పెద్ద తలకాయల్లో ఒకరూ అయిన కృష్ణమాచార్యులు కూడా వున్నారు.

అరుక్కి కొంచెం ఎడంగా ఎర్రెంకడు చేతులు కట్టుకుని నిలబడ్డాడు. అతడి పక్కనే మాలవారికి చెందిన ఓ నలుగురున్నారు.

వారికి ఓ పదడుగుల దూరంలో వేప చెట్టు మొదట్లో కూర్చునున్నారు సూర్యమూ, అతడి స్నేహితులూనూ.

వాతావరణం వేడిగా వుద్రిక్తంగా వుంది.

"ఇంతకీ ఏమంటావోయ్ ఆచార్లూ" పెద్ద మునసబుగారన్నారు.

"అదేమిటి, అలా మొదటికొస్తారేమిటి? జరిగిందంతా మీకు చెప్పి మీ నిర్ణయంకోసం ఎదురు చూస్తున్నాంకదా! ఇందులో మళ్లీ నేను ప్రత్యేకంగా చెప్పాల్సిందేముంది? "

"అనాదిగా వస్తోన్న ఆచారాన్ని అతిక్రమించి అధమ జాతికి చెందిన వీళ్లు పరమ పవిత్రమైన దేవాలయంలో అడుగుపెట్టారు.

ఇంతవరకూ ఇలాటిది మన వూళ్లో జరగలేదన్న సంగతి వూరందరికీ తెలుసు.

"దేవాలయాన్ని కాదుగదా ఆఖరికి గుడిగోడనిగాని, ఆ గోడమీంచి బయటికొచ్చిన కరివేరుచెట్టు పువ్వునిగాని వీళ్ల తాకకుండా, అపవిత్రం చెయ్యకుండా ఇన్నాళ్లూ కాపాడుతూ వచ్చాం.

"అలాటిదివాళ ఈ అప్రాచ్యులు దేవాలయ ప్రాంగణంలో అడుగుపెట్టారు.

"అపవిత్రం చేశారు.

"బయటికి పొమ్మన్న నాతో తర్కానికి దిగారు.

"ఇవాళ మీరేదో కఠినచర్య తీసుకోపోతే ఈ వూరు భ్రష్టుపట్టిపోవడం ఖాయం!"

కాస్త వుద్రేకంగా అన్నారు కృష్ణమాచార్యులు.

"ఏరా ఎర్రెంకా. నువ్వేమంటావురా" పెద్ద మునసబుగారు అడిగారు.

"నానేవంటాను బాబయ్యా! తవరికి తెలందేవుంది. తవరెలా సెబితే అలా ఇనుకుంటాం"

"ఆ సంగతికాదు. నీ కొడుకు చేసిన పని గురించేమంటావ్? "

"ఏటన్ను మున్సీబుగోరూ! ఆడు నా మాటిన్నుగాని ఆడుసేసింది తప్పే. ముమ్మాటికీ తప్పే. ఒప్పేసుకుంటున్నాను. ఎప్పుడూ గేటివతల నిలబడి పలారం అందుకోడవే గాని లోపలికెళ్లి ఎరుగుదునా బాబూ! ఇప్పుడు కానిరోజులొచ్చి పడ్డయ్. కుర్రనాయాళ్లు ఆళ్లు సెప్పినట్టు మమ్మల్ని ఇనమంటన్నారుగాని మా మాట సెవినెక్కించుకోడంలేదు బాబయ్యా"

"ఆ ఎందుకినరూ! చెట్టుకి కట్టేసి తాటలొలిస్తే సరి!"

"ఆచార్లూ! నువ్వుండవయ్యా. నేను మాట్లాడుతున్నాగా. అయితే ఎర్రెంకా నీ

కొడుకు చేసింది తప్పనీ అటువంటి పని చెయ్యకూడదనీ ఒప్పుకుంటున్నావ్. అంతేనా? "

"అంతే బావూ! లేకపోతే మావెక్కడా? గుళ్లెక్కడా? గుళ్లూ గోపురాలూ తవర్లాటి పెద్దలిగ్గానీ కడజాతోళ్లం మాక్కాదు బాబయ్యా. మాం లోపలికెళ్లకూడదుగాక ఎల్లకూడదు. మానుదుట అలా రాసేడు దేవుడు" అంటూ లెంపలేసుకున్నాడు ఎర్రెంకడు.

"వూ... నీ కొడుకుని పిలు"

"ఒరేయ్ సూరిగే. మున్సీబుగోరు పిలుత్తున్నార్రా. కాంచేపు నిలబడితే కాళ్లు పీక్కుపోతాయేంట్రా మారాజుల్లా కూచున్నారూ? పెద్దోరంటే గౌరం వుండక్కర్లా? "

"పోనీలెద్దూ! మేమూ కూర్చునే వున్నాంగా" లోలోపల రగిలిపోతున్నా పైకి మాత్రం శాంత స్వభావులుగా కన్పిస్తూ అన్నారు పెద్ద మునసబుగారు.

సూర్యం లేచి వచ్చి కాస్త నిర్లక్ష్యంగా నిలబడ్డాడు.

అతడో ఇరవై ఏళ్ల స్ఫురద్రూపి. చూడగానే ఆకట్టుకోగల నవ్వూ, కళైన మొఖం, కండలు తిరిగిన శరీరం అతడి వయస్సునీ ఆ వయస్సు తాలూకు వడీవేడీ తెలియజేస్తుంటాయి.

అతడి కండపుష్టినీ, అతడు నిలుచున్న తీరునీ చూసి అరుగుమీద కూర్చున్న పెద్దలంతా కంపరంగా చూశారు. "మాలవాడికింత కండ కావరమా? " అని అక్కసుగా చూశారు.

"ఏరా ఇంతవరకూ అందరూ చెప్పింది విన్నావుగా. మరి నువ్వేమంటావు? " కించిత్తు గాభరాగానే అడిగారు పెద్ద మునసబుగారు.

అందుక్కారణం లేకపోలేదు.

చాలా సంవత్సరాలుగా ఆ వూరికి పెద్దదిక్కుగా మకుటంలేని మహారాజుగా వుంటూ వూరిని ఏక చ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్నారాయన. ఆయన మునసబు గిరీని పెద్దకొడుకు అందుకున్నాడు. ఆ తర్వాత తడు అదే వూరికి వి.ఏ.ఓ. అయ్యాడు. చిన్న కొడుకు సర్పంచి అయ్యాడు. దాంతో అధికారం పెద్ద మునసబునే అంటిపెట్టుకునుండిపోయింది.

ఇప్పుడిప్పుడే కుర్రకారు ఆయనకి వ్యతిరేకంగా గొంతు విప్పుతున్నారు. ఏదో కదలిక పుట్టిస్తున్నారు. అది ప్రభంజనంగా మారుతుందేమోనని ఆయన భయం. అందుకే ఆయన అందరికీ మంచిగా వుంటూనే తనకి ఎదురు లేకుండా చేసుకోవాలని చూస్తున్నారు. తన బొందిలో ప్రాణం పోయేవరకూ పెద్దరికపు పీఠాన్ని వదులుకోకూడదన్నది ఆయన స్థిరలక్ష్యం!

"మీరు అన్నీ తెలిసిన పెద్దలుగనుక మిమ్మల్నో మాట అడగాలనుకుంటున్నాను. అసలు మేం గుడిలోకి ఎందుకు ప్రవేశించకూడదు? " అన్నాడు సూర్యం.

"అధమజాతి వాళ్లుగనుక!" అంటూ రకీమని జవాబిచ్చారు కృష్ణమాచార్యులు.

"అలా అని ఎక్కడ రాసుంది? "

"అది మీ పుట్టుకలోనేవుంది"

"అంటే మేం అపరిశుభ్రంగా పుట్టాం, మీరంతా పవిత్రంగా పుట్టారంటారు? "

"అక్షరాలా అంతే. మాది తులసీజలమంత పవిత్ర రక్తం"

"మీ రక్తంకన్నా కాయకష్టంచేసే మా రక్తమే పరిశుభ్రమైందని ఏ డాక్టర్నడిగినా చెబుతాడు"

"అడగాల్సిన అగత్యం మాకులేదు. మేం బ్రహ్మ ముఖంనుండి పుట్టిన బ్రాహ్మలం. మీరు పాదాలనుండి పుట్టిన అపవిత్రులు. అందుకే మీకు దేవాలయ ప్రవేశార్హత లేదు

గాక లేదు"

"అయితే మీరు మీ అమ్మానాన్నలకి పుట్ట లేదన్నమాట" సూర్యం పక్కనేవున్న అతడి స్నేహితుడు జాన్ అన్నాడు.

సూర్యమూ, అతడి స్నేహితులూ నవ్వేరు.

పెద్దలు వులిక్కిపడ్డారు.

పెద్ద మునసబుగారు విస్ఫారితనేత్రాలతో చూశారు.

కృష్ణమాచార్యులు అవమానంగా చూశారు. ఆగ్రహంతో బుసలుకొట్టారు.

"ఛీ అప్రాచ్యుడా! భగవల్లీలలు తెలుసుకో లేని మూర్ఖుడివి కనుకే నీచజాతిలో పుట్టావ్" అన్నారాయన.

"మీ జాతి మీకెంతగొప్పో మా జాతి మాకూ అంతే. మీరు మమ్మల్ని హీనంగా చూసినా కడజాతి అని నిందించినా మేం తక్కువైపోం. మాది శ్రమించేజాతి. సంపద సృష్టించే కులం. మీరేమన్నా మేం మాత్రం శ్రామికులం. మీరు తినే తిండిని పండిం చిందీ, బండ్లలో మీ ఇంటికి తెచ్చి మీ గాదులు నింపేదీ మేమే. మీరుంటోన్న ఇంటినీ, పూజిస్తోన్న గుడినీ కట్టిందీ మేమే"

"ఛీ నీతో మాట్లాట్టమే మహాపాతకం!"

"కొన్ని కులాల వారిని అంటరాని వారుగా చూడటం చట్టం దృష్టిలోనేకాదు మానవతా దృష్టిలో కూడా నేరమే. ఇక గుడిలోకీ, బడిలోకీ రాకూడదని ఆంక్ష విధిం చడం మరింత పెద్ద నేరం. దేవుడి దృష్టిలో అంతా సమానమే అయినప్పుడు, అందరిదీ భక్తే అయినప్పుడు కులాల పేరుతో కొంద రికి ఆలయ ప్రవేశం నిషేధించడం అన్యాయం. పాపం. నేరం కూడా. ఇంకో సంగతి. ఆ దేవాలయ నిర్మాణానికి రాళ్లెత్తిన వాళ్లలో మా వాళ్లూ వున్నారు. గుడి నిర్మా ణానికి చందాలిచ్చిన వాళ్లలో అన్ని కులాల వాళ్లూ వున్నారు. బహుశా దేవుడి విగ్ర హాన్ని మలిచింది కూడా మాలాటి తక్కువ కులం వాడే అయినా ఆశ్చర్యపోనక్కర్లేదు. కాని గుడి నిర్మాణం పూర్తయ్యేక వాళ్లెవళ్లకీ ఆ గుడిలో ప్రవేశార్హత లేదనడం అమా నుషం! ఘోరం! పాతకం!!"

సూర్యం మాటలకంతా విస్తుబోయారు. ఒక మాల యువకుడు తమ ముందు నిలిచి మాట్లాట్టమే ఒక వింత అయితే అంత వివరణాత్మకంగా, సూటిగా జవాబి వ్వడం నిజంగా విడ్డూరమే. అతడేదో వానా కాలపు చదువు వెలగబెట్టేడనుకున్నారుగాని మరీ లాపాయింట్లు లాగే అఖండుడనుకో లేదు. అతడికేమని జవాబివ్వాలో కూడా తోచక నీళ్లు నములుతూ పెద్ద మునసబుగారి వంక చూశారు పెద్దలంతా.

వాళ్లంతా మాట వరుసకి మాత్రమే పెద్ద లనీ అసలు పెద్దరికమంతా పెద్ద మునస బుగారిదేనన్న సంగతి వాళ్లకీ తెలుసు. వూరికీ తెలుసు!

విషయం చిక్కుముళ్లు పడుతోందనుకు న్నారు పెద్ద మునసబుగారు. సూర్యం మాటలు గుండెల్లో గుబులు రేపుతోంటే బింకంగా చూశారు. సూర్యం మాటల్ని కొట్టి పారెయ్యడానికి లేదు. అతడు చెప్పినట్టు వేంకటేశ్వరస్వామి దేవాలయ నిర్మాణానికి అన్ని కులాలవారూ, మతాలవారూ చందాలి చ్చారు. ఆఖర్నో రోజున కూలీలంతా శ్రమ దానం చేశారు కూడా. మరటువంటప్పుడు ఆ గుడిలో ప్రవేశించడానికి కొందరికి హక్కులేదని చెప్పడం దుస్సాహసమే అవు తుంది. ఒకవేళ తను చెప్పినా వింటారని లేదు. పైపెచ్చు ఎదిరించొచ్చు! తన అధికా రాన్ని సవాలు చెయ్యొచ్చు! అది వూళ్లో ముసలాన్ని పుట్టించొచ్చు! అంచేత కథని అంత దూరం వెళ్లనివ్వడం తనకి శ్రేయస్క రంకాదు.

"సరే నువ్వెళ్లరా" అన్నారు సూర్యంతో.

అంతా అవాక్కయ్యారు. సూర్యం, అతడి మిత్రులూ ఆయనవంక ఆశ్చర్యంగా అపనమ్మకంగా చూసి మెల్లగా వెళ్లిపోయారు.

"అదేవిటి మునసబుగారూ ఏమీ తేల్చకుండా పంపించేశారేమిటీ" గాభరాగా అన్నారు కృష్ణమాచార్యులు.

"కర్ర విరక్కూడదు. కాని పాము చావాలి. మీరేమంటారు?" పెద్దలవైపు చూశారు.

"బేషుగ్గా చెప్పేరు" అభినందించారు కృష్ణమాచార్యులు.

"ఎర్రెంకా" మునసబుగారు పిలిచారు.

"చెప్పండి బాపూ"

"కుర్రాళ్లది వుడుకునెత్తురు. ఏదేదో వాగుతూంటారు. వుపన్యాసం ఇవ్వడం వస్తే చాలు గొప్పవాళ్లై పోయాననుకుంటారు. లోకమంటే ఏమిటో, ధర్మమంటే ఏమిటో, వుచ్చనీచాలంటే ఏమిటో తల పండిన మనకి తెలుస్తాయిగాని కుర్రవానికి తెలీదు కదా!

"ఫలానా కులస్తులు ఫలానా పనిచేసుకుని పొట్టపోషించుకోవటమన్నది నువ్వూ, నేనూ పుట్టకముందునుంచీ వస్తోన్న పద్ధతి.

"అలాగే సమాజరక్షణకి ఎన్నో పద్ధతులూ కట్టుబాట్లూ ఏర్పరిచారు పూర్వులూ.

"వాటిని తు.చ. తప్పకుండా అమలు పర్చాల్సిన వాళ్ళమేగాని ఎందుకు ఏమిటని ప్రశ్నించేంత గొప్ప వాళ్ళంకాదు మనం.

"అంచేత మన వేదాలు, పురాణాలు, మహర్షులు ఘోషించినట్టుగా నడచుకోవడమే మీకూ మాకూ కూడా మంచిది.

"కాదూ కూడదూ అని దేవాలయంలో ప్రవేశించారనుకో దేవుడికి ఆగ్రహం రావొచ్చు మీవాడ తగలబడిపోవచ్చు లేదా కలరా చుట్టుముట్టి అందర్నీ పొట్టనబెట్టుకోవచ్చు ఇంకా ఏమైనా జరగొచ్చు ఎన్నైనా జరగొచ్చు

"అంచేత నువ్వూ మీ పెద్దలూ కలిసి కుర్రాళ్ళకి నచ్చచెప్పండి. నేలవిడిచి సాము చెయ్యొద్దనండి. కొండల్తో ఢీ కొంటే పచ్చడయ్యేవి మన బ్రతుకులే అని చెప్పండి. ఎక్కడుండాల్సిన వాళ్ళు అక్కడుండటమే మీకూ మీ వాడకీ క్షేమమని చెప్పండి. మీ మాటలు వారి బుర్రల కెక్కవనుకో వురిబోసుకు ఛస్తామని బెదిరించండి. ఒట్లు వేయించండి. ఎలాగోలా లొంగదియ్యండి. గీటు దాటనివ్వకుండా చూడండి. మీరు ఒప్పించగలరు. నాకు తెలుసు కదా. ఒప్పించలేకపోయారనుకో ఆ తర్వాతేం జరిగినా నా బాధ్యతలేదు. నా సంగతి మీకు బాగా తెలుసు కదా. రామదాసు కథ మళ్ళీ జరిగినా జరగొచ్చు"

ఎర్రెంకడికి ఆయన మాటలేం అర్థంకాలేదు. అంతా అయోమయంగా అన్పించింది.

కాని ఒక్కటి మాత్రం స్పష్టంగా తెలిసింది. కుర్రాళ్ళ ముక్కుకి తాడెయ్యకపోతే ఆయన ఎంతకైనా తెగిస్తారు! ఏమైనా చేస్తారు!

నిలువునా కాలిపోతున్న రామదాసు రూపం కళ్ళముందు కదిలింది.

వెన్నులో భయం పాములా జరజర ప్రాకుతోంటే సన్నగా వణికాడు. "అలాగే బాబయ్యా. ఆళ్ళ మెడలు ఒంచే పూచీ నాది బాబయ్యా. తమరు కోపం సేసుకోకండి. దండాలండి" అనెళ్ళిపోయాడు తనవాళ్ళతో కలిసి పరుగులాంటి నడకతో.

"మొత్తానికి మునసబుగారన్పించారు" అని అభినందించి, "ఆలయ ప్రాంగణంలో ప్రవేశించి అంతా అపవిత్రం చేసేశారు" గనుక గోమయంతో శుద్ధిచేయించమన్నారా" అని అడిగారు కృష్ణమాచార్యులు?





"అవశ్యం. తప్పకుండా చేయించండి" అంటూ లేచారు మునసబుగారు.

★ ★ ★

తెల్లవారుజామునే లేచాడు సూర్యం.

కిర్రు చెప్పులు తొడుక్కుని చేతికర్ర అందుకుని పొలం బయల్దేరాడు.

మూడొంతుల వూరింకా నిద్రపోతోంది.

కోళ్ళు అదేపనిగా 'కొక్కొరోకో' అని కూస్తున్నాయి. నిద్ర లేవండి మత్తువదలండని కాబోలు ఆ కూతకర్థం అనుకుంటూ నడుస్తున్నాడు.

ఒకటి రెండు కుక్కలు అతణ్ని చూసి కొంచెం వెనక్కి తగ్గి అతడు దాటెళ్ళిపోయేక మొరగసాగాయి. అతడు వాటి మొరుగుళ్ళు పట్టించుకోలేదు.

బ్రాహ్మణుల అగ్రహారం వెనుకనున్న చెరువుగట్టు మీంచి వెళ్తోంటే "అమ్మో!" అన్న అరుపు రేవులోంచి విన్పించింది.

సూర్యం అటు పరుగెత్తాడు.

ఓ పద్దెనిమిదేళ్ళ అమ్మాయి రేవులో కాలు జారి పడింది. తుంటికి గట్టిగా దెబ్బతగలడంతో లేవలేకపోతోంది. నీళ్ళబిందె చెరువులోకి జారి మొగ్గేసింది.

అతడు గబగబా ఆమె దగ్గరికెళ్ళబోతోంటే, "అయ్యో- పాకుడు- జారుతుంది" అందామె అంతబాధలోనూ.

జోళ్ళు తీసేసి వెళ్ళి జబ్బ పట్టుకులేవదీయడానికి చేయి జాపుతూ అంతలోనే ఆగిపోయాడు.

ఆ పలుచని చీకట్లో ఒకరి మొఖాలొకరు చూసుకునుండి పోయారు కొన్ని క్షణాల పాటు.

అతడి సందేహాన్ని గమనించి అందుకోమని సైగచేస్తూ చేయిచాచింది.

మరొక్కక్షణం తాత్సారం చెయ్యకుండా ఆమె చేయి అందుకుని లేవనెత్తాడు. మరో చేత్తో బిందె అందుకుని మెల్లగా ఆమెని నడిపించాడు.

ఒక కాలిమీద నడుస్తూ తన బరువు అతడిమీద వెయ్యాల్సొచ్చినందుకు సిగ్గుపడుతూనే తలవంచుకు నడుస్తోంది అలివేలు కృష్ణమాచార్యులవారి అమ్మాయి.

అగ్రహారంలోని బ్రాహ్మలంతా ఆ చెరువు నుంచే నీళ్ళు తెచ్చుకుంటారు. వెలుగొస్తే అంతా చూస్తారని ఇంకా చీకటుండగానే కూతురితో నీళ్ళు తెప్పిస్తూంటుంది ఆచార్లుగారి భార్య పుష్పవల్లి.

శీతాకాలమైనా మరోకాలమైనా సరే ఆమె మడిగట్టుకుని నీళ్ళు తేవాల్సిందే. తడిబట్టలు ఒంటిని చుట్టబెట్టేస్తూ అసౌకర్యం కలిగిస్తోంటే చలి తన మానాన తను కొరికేస్తూంటే నీళ్ళు చేరవెయ్యాలన్పించదు అలివేలుకి. ఆమెకి మడీదడీ అన్నీ చాదస్తంగా అన్పిస్తూంటాయి. అయినప్పటికీ తల్లిదండ్రుల ఆచారాల్ని అయిష్టంగానే ఆచరిస్తూంటుంది.

ఆమెని వారి పెరటి గుమ్మం దగ్గరకి తీసుకెళ్ళి ఆమెనొదిలి దూరంగా జరిగాడు సూర్యం. ఆమె గుమ్మాల్ని పట్టుకుని నిలబడి తల్లిని పిలిచింది.

పుష్పవల్లి బయటికొచ్చి కూతురి ప్రక్కన సూర్యాన్ని చూసి బుగ్గలు నొక్కుకుంది. "అయ్యో అయ్యో అదేవిటే వాడితో... వాణ్ని ముట్టుకున్నావేమిటే ఖర్మ" అంటూ కంగారు పడింది.

తల్లి మాటలు పట్టించుకోకుండా, "రేవులో కాలుజారిపడ్డానే కాలు బెణికింది. నడవలేకపోతున్నాను. కొంచెం సాయంరా అమ్మా" అంది.

"నేనా?! మడిగట్టుకున్నానే. నువ్వా మాలోణ్ని ముట్టుకున్నావాయె. మళ్ళీ తలారా స్నానం చెయ్యొద్దూ. ఏం పిల్లలో ఏం పాడో ఒక అంటూ చూడరు ఒక

సొంటూ చూడరు. మీ నాన్న చూశారంటే నరికి పోగులెట్టేస్తారు"

అలివేలు అతికష్టంమీద నిలబడుతోందని గ్రహించిన సూర్యం "స్నానాల దొడ్డెక్కడ" అనడిగాడు.

తాటాకుల్తో కట్టిన పడిని చూపించిందామె.

అతడామెనక్కడికి నడిపించుకెళ్ళి అక్కడున్న రాయిమీద కూర్చోబెట్టాడు.

ఆ దృశ్యం చూసి నెత్తీనోరూ కొట్టుకుంది పుష్పవల్లి.

"ఓరి నీ అసాధ్యం కూల! నడునడు... బయటికి నడు ముందు. అమ్మాయిని ముట్టుకోవడమే గాక పెరట్లోకి కూడా వస్తావా పాపిష్టివాడా. అంతా మాలకూడు చేసేద్దామని కంకణం కట్టుకున్నావా ఏం. అయ్యో అయ్యో ఎంత చొరవ! ఎంత ధైర్యం! వీడమ్మ కడుపుకాల!"

ఆమె తిట్లు పట్టించుకోకుండా బయట వున్న బిందెని కూడా తెచ్చి లోపలపెట్టి వెళ్ళబోతూ అలివేలు వంక చూశాడు.

ఆమె అతడ్నే చూస్తోంది స్నిగ్ధంగా నవ్వుతూ!

ఆమె చూపులో ఆ చిరునగవులో ఎన్నో అర్థాలు మరెన్నో సందేశాలు కన్పించాయి, విన్పించాయి.

అతడి గుండె ఝల్లుమంది. తనువేదో వింత భావనకిలోనై పులకరించింది. మదిలో మధుర సువాసనలు గుప్పుమన్నాయి.

గాలిలో తేలిపోతున్నట్టుగా నడుస్తున్నాడు సూర్యం.

★ ★ ★

"రావోయ్ సూర్యం రా. నీ సంగతే మాట్లాడుకుంటున్నాం" అంటూ ఆహ్వానించారు కిష్టయ్య మాస్టారు.

ఆయన అఆలు దిద్దించే బడిపంతులే కాదు, అ అంటే అభ్యుదయం, ఆ అంటే ఆదర్శం అని రాబోవు తరందూతలకి నూరిపోసే మార్గదర్శి కూడా.

పది పన్నెండేళ్ళ క్రితం ఆ వూరొచ్చారు కిష్టయ్య మాస్టారు. వచ్చిన మర్నాడే ఆ వూరిని తన వూరనుకున్నారు.

ఆయన పంతులిగా వచ్చిన మాలపల్లె లోని బడికి అప్పట్లో అరడజను మందికన్నా ఎక్కువ మంది పిల్లలు వచ్చేవారు కాదు. వాళ్ళైనా రోజూ వచ్చేవారు కాదు. మాలపల్లెలో బడివుందని లెక్కల్లో రాసుకోడానికి తప్ప మరో ప్రయోజనం వుండేది కాదు.

ఆ పరిస్థితిని మార్చడానికాయన నడుం బిగించారు. మాలపల్లెలో మాదిగల గూడెంలో చాకలి, మంగలి, ఎరుకల, యానాది తదితరుల పేటల్లో గడపగడపా తిరిగారు. వారివారి పిల్లల్ని బడికి పంపించమని నచ్చజెప్పేరు. వారితో కలిసి తిరిగారు. పేరుపెట్టి పిలిచారు. పిల్లల సుందర భవిష్యత్తుకి చదువెంత ముఖ్యమో ఆప్యాయంగా వివరించి చెప్పేరు. వారి స్థితిగతుల్ని సానుభూతితో అర్థంచేసుకుని వారికి అర్థమయ్యే రీతిలో బోధించారు.

కూలీనాలీ చేసుకునే జనం ఆడామగా కలిసి కష్టించినా నాలుగువేళ్ళే నోట్లోకి పోవు. పైగా కూలిరేటు తక్కువ, పని గంటలు ఎక్కువ. దానికితోడు కూలిడబ్బులకి అంగట్లోని సరుకులు అందుబాటులో వుండవాయె. అందుకనే తమ పిల్లల జీవితాల్ని ఆరేడేళ్ళ ప్రాయంలోనే చిన్నపాలేరుగా గొడ్లకాపరిగా కామందుల దగ్గర 'తాకట్టు' పెట్టి ఉప్పు ఖర్చో పప్పు ఖర్చో మిగుల్చుకోవాలని చూస్తారంతా. ఆ పిల్లల్ని బడికిపంపితే వాళ్ళు ప్రయోజకులై అంతో ఇంతో సంపాదించడానికి కనీసం ఇరవైఏళ్ళైనా పడుతుందని భావిస్తారు.

అందులోని నిజాన్ని గ్రహించి ఈనాటి తాత్కాలిక ప్రయోజనంకన్నా రేపటి శాశ్వత ప్రయోజనం మిన్న అని వివరించి ఒప్పించారు మాస్టారు. ఎందరికో అక్షరజ్ఞానాన్ని నూరిపోశారు.

వారిలోకెల్ల అన్నిటా చురుగ్గా వుండే సూర్యం అంటే మాస్టారికి ప్రత్యేకాభిమానం. ఎలాగైనాసరే అతడిని వున్నత విద్యావంతుడిగా తీర్చిదిద్దాలని ఎంతో ప్రయత్నించారు. అతడి చదువుకీ దుస్తులకీ ఆర్థిక సహాయం కూడా చేశారు.

చదువూ గిదువూ వద్దంటూ ఒంటికాలిమీద లేచిన ఎర్రెంకడిని ఒప్పించి హైస్కూల్లో చదువుకి పట్నం పంపించారు. హాస్టల్లో చేర్చారు. తొమ్మిదో తరగతి చదువుతూండగా టైఫాయిడ్ పాలయ్యాడు. అదే సమయంలో నిధుల దుర్వినియోగం జరుగుతున్నందున హాస్టల్ మూసేశారు. మరి గత్యంతరంలేక చదువుకి స్వస్తి చెప్పివచ్చేశాడు.

అందుకు నొచ్చుకున్నా వూరిబాగుకోసం వెనుకబడ్డ తరగతులవారి అభివృద్ధికోసం కృషి చేస్తాడు లెమ్మని సరిపెట్టుకున్నారు మాస్టారు.

సూర్యం కూడా వీలున్నప్పుడల్లా మాస్టారింటికెళ్తుంటాడు. ఆయన ద్వారా దేశ విషయాలు తెలుసుకుంటాడు.. సామాజికాంశాలు అధ్యయనం చేస్తాడు. గ్రామ విషయాలు చర్చిస్తాడు. ఆయననుంచి స్ఫూర్తి పొందుతాడు.

"వూర్నించి ఎప్పుడొచ్చారు మాస్టారూ. పెళ్ళి బాగా జరిగిందా పిన్నిగారూ" పలకరించాడు సూర్యం.

"బాగానే జరిగింది గాని ఏమిట్రా ఈ పదిరోజుల్లోనే అలా చిక్కిపోయావ్. మనిషిని అక్కడున్నానన్నమాటేగాని నా మనసంతా ఇక్కడే అనుకో" అరిసెలూ సున్నివుండలు ప్లేటులో పెట్టిస్తూ అంది మాస్టారి భార్య.

ఆవిడ మాస్టారికి తగ్గదొడ్డ ఇల్లాలు. ఆయన సాహచర్యంవల్ల కులమతాల్ని గాక మంచినీ మనిషినీ గౌరవించడం నేర్చుకుంది. పిల్లల్నందర్నీ తన పిల్లలుగా భావిస్తూ పిల్లలు లేనిలోటు మర్చిపోయింది. వాళ్ళు కూడా ఆమెని 'పిన్నిగారూ' అని పిలుస్తూ ఆత్మీయంగా మసలుకొంటూంటారు.

"అన్నట్టు మొన్నేదో గొడవ జరిగిందంటే మిటి? పెద్దల దాకా వెళ్ళిందిట కదా. అసలేం జరిగింది సూర్యం" మాస్టారడిగారు.

"మావూరి గుడి నిర్మాణానికి అన్ని కులాలవారూ సహాయ సంపదలు అందించారు మాస్టారూ. అంచేత గుళ్ళోకి వెళ్ళే హక్కు మనకీ వుందని కుర్రాళ్ళు పట్టుబట్టేరు. నేనూ జానూ మరో ఇద్దరం గేటుదాటి లోపలికి వెళ్ళాం. కృష్ణమాచార్యులుగారు నానా దుర్భాషలాడి మమ్మల్ని బయటికి పంపించేశారు. ఆ తర్వాత పెద్దలకి ఫిర్యాదు చెయ్యడంతో మమ్మల్ని పిలిచారు. మా వాదన వినిపించాం. మమ్మల్నేమీ అనలేక తమ ప్రతాపం మా ముసలివాళ్ళమీద చూపించారు పెద్ద మునసబుగారు"

"వాళ్ళకి మన ఆయువుపట్టు ఎక్కడుందో బాగా తెలుసు. ఇంతకీ ఏవన్నార్ట"

"మమ్మల్ని లొంగదీయమనీ మళ్ళీ గుడి వూసెత్తకుండా చెయ్యమనీ ఒకరకంగా బెదిరించారట. పెద్దల మాట వినకపోతే కూలికి పిలవరనీ అప్పులివ్వరనీ అసలు వూళ్ళోనే వుండనివ్వరనీ గంతులేస్తున్నారు మా కులపు ముసలోళ్ళు. ఏమైనా అంటే ఛస్తామని బెదిరిస్తున్నారు!"

"పాపం వాళ్ళేంజేస్తార్లే. పూర్వంనుంచీ వాళ్ళలో ఎన్నో రకాల భయాలు నూరిపో

శారు మరి. కాని సూర్యం మన హక్కుల కోసం పోరాడటం అభినందనీయమేగాని మన శక్తినీ యుక్తినీ గుళ్ళకోసం మతం కోసం వృధా చెయ్యడం మంచిది కాదు. మతం మత్తునుంచి జనాన్ని రక్షించాల్సింది పోయి ఇలా నల్లమందు మాత్రలు మింగి స్తానంటే ఎలా చెప్పు? అలాగని మన బాణం మతంమీద దేవుడిమీదా ఎక్కుపె డితే జనం మనల్ని దుస్సాహసికులుగా భావించి మనకి దూరంగా జరిగే ప్రమాద ముంది. అంచేత మత విషయాలు పక్కన బెట్టి వర్గదృక్పథంతో ప్రజల్ని సమీకరిం చాలి. ప్రతి అన్యాయాన్నీ ఎదిరించేలా చైత న్యవంతుల్ని చెయ్యాలి. ఈ కుళ్ళిన కుష్ఠువ్య వస్థని సమూలంగా మార్చి నవసమాజ నిర్మాణానికి పునాది రాయి వెయ్యాలి. అప్పుడు మతమౌఢ్యమూ ఛాందస భావాలూ వాటికవే నీరుగారిపోతాయి"

"నిజమే మాస్టారూ. మేమంతదూరం ఆలోచించలేదు"

"అలాగని నిరుత్సాహపడొద్దు. మీరు చేసిందీ తప్పు కాదు. పెత్తందార్ల గుప్పిటిపై తొలిదెబ్బతీశారు. మేం మీతో సమాన మంటూ మెరుపు దాడి చేశారు. మళ్ళీ అందర్నీ కూడగట్టి ఆలయప్రవేశం చెయ్యగ లిగితే వూరి పెద్దరికంమీద మనం విజయం సాధించినట్టే"

"అయితే మా ముసలివాళ్ళలో భయాలు తగ్గుముఖం పట్టేక మళ్ళీ మా తడాఖా చూపిస్తాం మాస్టారూ"

"మీ శక్తిమీద నాకు నమ్మకం వుంది. గుడిసెల్లేని వాళ్ళకి ప్రభుత్వం ఇళ్ళు కట్టిస్తా నంది కదా. శ్మశానం పక్కనున్న స్థలం కేటాయిస్తానంటే మనం ఒప్పుకోలేదు. ఆ సంగతి తిరగతోడాలి. మరోచోట ఇళ్ళు కట్టించి ఇచ్చేట్లు మనం కృషిచెయ్యాలి. అలాగే మురికికాలువ పక్కనున్న పోరంబో కులమీద పెద్దల దృష్టిపడిందని తెలిసింది. రొయ్యల చెరువు లొచ్చేక ఆ భూమిబంగా రంగా మారిపోయింది కదా. దానిని పేద వారికీ బెస్తవారికీ కలిపి ఇస్తే చెరువు తవ్వి సమిష్టివ్యవసాయం చేయించొచ్చు. అందు నిమిత్తం యమ్మార్వోనీ, యమ్మెల్యేనీ కల వాలి. పిటీషన్లతో పనైతే మంచిదే. లేకపోతే బలవంతంగానైనా ఆక్రమించుకోవాలి"

"లేకపోతే ఆ పని మనవూరి పెద్దలు చేసేస్తారు"

"బాగా చెప్పేవు"

"పెద్ద మునసబుగారు రొయ్యల చెరువు తవ్వుతూ వంగల దిబ్బని సగంవరకూ కలి పేసుకున్నారు మాస్టారూ"

"అధికారులూ అనధికారులూ ఆయన్లాటి వారికి వత్తాసుగా నిలబడి వున్నంతకాలం వాళ్ళెన్నైనా ఆక్రమిస్తారు, ఎన్ని అక్రమాల కైనా పాల్పడతారు"

"పంచాయితీ బోర్డుమీటింగులో ఆ సంగ తేంటో తేల్చమని మా బోర్డుమెంబరుకి చెప్పేను"

"అతడ్ని మాట్లాడనివ్వగలిగితే మంచిదే మరి. చూద్దాం"

మరికొంచెంసేపు ఆ విషయాలు మాట్లా డుకున్నాక సూర్యం అడిగాడు, "సారథి దగ్గ ర్నుంచేమైనా వుత్తరాలొచ్చాయా మాస్టారూ"

"వచ్చిందోయ్. మేం వూర్నించొచ్చేసరికి లోపల పడేసుంది"

"బావున్నారా"

"ఆ- బాగానే వున్నాట్ట. ఈమధ్య ప్రేమలో పడ్డాట్ట కూడా. వర్ణాంతర వివాహ మనీ మా ఆశీర్వచనాలు కావాలనీ రాశాడు"

"నిజమా మాస్టారూ? "

"నిజమేనోయ్. పెళ్ళిచేసుకోగానే వచ్చి మనందర్నీ కలుస్తానని రాశాడు"

"మొత్తానికి మీ శిష్యుడనిపించాడు"

"అవునవును. సరైన నిర్ణయం తీసుకోవడంలో, సకాలంలో అమలుపరచడంలో అతడికతడే సాటి"

"కాని మాస్టారూ. సారథి తండ్రి వీరభద్రయ్యగారు..."

"ఒప్పుకోరు. పెద్ద కులస్తులమని భావించే ఆయన తన కొడుకు హీనకులస్తురాల్ని చేసుకుంటే ఎలా అంగీకరిస్తారు? అంగీకరించరు. పైపెచ్చు రభస చేస్తారు. ఇంట్లో చీలికలు రావొచ్చు కులస్తులు వెలివెయ్యొచ్చు అయినా అన్నిటికీ సిద్ధపడి అడ్డంకుల్ని ఎదిరించగల మనస్థైర్యంతో ముందడుగు వేస్తున్నాడు సారథి. వాడు అసలైన హీరో"

సూర్యం గుండెలు ఆనందంతో వుప్పొంగాయ్.

★ ★ ★

"రంగన్నా! నీకో ముఖ్యమైన సంగతి చెప్పాలని పిలిచానోయ్" ముక్కుపొడుం డబ్బాలోంచి ముక్కుపొడి తీస్తూ అన్నారు కృష్ణమాచార్యులు.

"చెప్పండిసామి మీ మాటెప్పుడు కాదన్నాను. కౌలుధాన్యం పెంచమని మాత్రం అనకండి సామి పిల్లలుగలవాడ్ని"

"అబ్బెబ్బే..." నవ్వేశారు. ఆ పిమ్మట వరుసగా తుమ్మేశారు.

"సంగతేమిటంటే- అహ నువ్వు వ్యవసాయం సవ్యంగా చెయ్యట్లేదనిగాని, కౌలు ధాన్యం సరిగ్గా ఇవ్వట్లేదనిగాని నా వుద్దేశ్యం కాదు. నీ శక్తిమేరకు నువ్వు బాగానే పండించావ్. పొలాన్ని కన్నబిడ్డగా చూసుకున్నావ్. కాదనను. కాని ఏమిటంటే కూలి ఖర్చులు బాగా పెరిగాయి. ఎరువుల ధరలు ఆకాశానికెక్కాయి. శిస్తూ డ్రైనేజి సెస్సూ, నీటి తీరువా, ఆ పన్నూ, ఈ పన్నూ అంటూ పళ్ళూడగొడుతోంది ప్రభుత్వం. అంచేత ఇహ వ్యవసాయం కట్టిపెట్టేద్దామన్న నిర్ణయానికొచ్చాను"

"కొంపతీసి అమ్మేస్తారా ఏమిటిసామి- ఆ పొలాన్ని నమ్ముకున్నోడ్ని. పొలాన్ని మెరక చేశాను. పెంట తోలాను. చెమటనీ రక్తాన్నీ పారించి మరీ పండిస్తున్నాను" ఏడుపు స్వరంతో అన్నాడు రంగన్న.

"నా నోట్లో మాట బయటికి చెప్పకుండానే ఆ శోకాలేవిట్రా"

"తప్పైపోయింది సామీ" లెంపలేసుకుని చేతులు కట్టుకున్నాడు.

"ఆ ఆరెకరాల పొలాన్నీ చెరువుగా మార్చేద్దామనుకుంటున్నాన్రా"

రంగన్న గుండెల్లో రాయిపడింది. ఈమధ్య అంతా పంట భూముల్ని చెరువులుగా మార్చేస్తున్నారు. ఎందుకూ పనికిరాని చవుడు భూములు బంగారమైపోయాయి. వాటి ధర లక్షల కెగబ్రాకింది. రొయ్యలు లాభాలని దోసిళ్ళతో తెచ్చి పోస్తుందని ప్రతివారి ఆశానూ!

"చెరువు తవ్వేక నాకు లీజుకివ్వండి సామి మీ పేరు జెప్పి రెండు ముద్దలు తింటాం"

"పాలేర్ని పెట్టుకుని స్వంతంగా చేద్దామనుకుంటున్నాన్రా. రొయ్యల్ని పండించడమంటే మాటలు కాదురా. పెట్టుబడి లక్షల్లో కావాలి. అందుకే బ్యాంకు అప్పుకోసం ప్రయత్నిస్తున్నాను"

మరేమీ మాట్లాడలేక తలగోక్కున్నాడు రంగన్న. కళ్ళల్లోంచి కన్నీళ్ళు కారిపోతోంటే తుడుచుకోవడం మరచి బొమ్మలా నిలుచుండి పోయాడు.

"మంచిది రంగన్నా. సాయంత్రంవస్తే పద్దులన్నీ చూసి ఇచ్చిపుచ్చుకోటాలు సరిపెట్టేసుకుందాం"

భారంగా కదిలెళ్ళి పోయాడతడు.

అతడింత తేలిగ్గా పొలాన్ని వదిలేస్తాడని వూహించలేదు కృష్ణమాచార్యులు. సమస్య ఇట్టే పరిష్కారమై పోయేసరికి మహదానం దపడిపోతూ ఇంట్లోకెళ్ళారు.

తలుపు చాటున నిలబడి వారి సంభాష ణంతా విన్నది పుష్పవల్లి. ఒళ్ళంతా ముచ్చె మటలు పోస్తోంటే ఒకటే హైరాన పడిపో తోంది. ఆయన లోపలికి వచ్చీరాగానే "ఇలా చేశారేవిటండీ" అనడిగింది.

"ఏం చేశానే? నిజానికింతవరకూ చెయ్య లేదు ఇక చెయ్యబోతున్నాను వ్యవసాయం!" తూగుడుబల్ల మీద కూర్చుని వూగుతూ విసనకర్రతో విసురుకుంటూ నవ్వేరు.

ఆ నవ్వుకి చిర్రెత్తుకొచ్చిందావిడకి "సంబడం చాలుగాని మరి అర్చకత్వం ఏం జేస్తారు? "

"అదీ చేస్తానే"

"బావుంది బావుంది. బాపన వ్యవసాయ మన్నమాట మర్చిపోయారా? "

"మామూలు వ్యవసాయం కాదు రొయ్యల సాగు"

"మళ్ళీ అదొహటి. రొయ్యలంటే ఏవిటో తెలీదు. అదనూ పదునూ తెలీదు. ఏం తింటాయో ఎంత తింటాయో తెలీదు. అయినా తగుదునమ్మా అని స్వయంగా పండిస్తానంటే ఏమనుకోవాలి? !" బుగ్గలు నొక్కుకుంది.

"ఏమీ అనుకోవద్దు. కళ్ళెట్టి చూడు అంతే. నేనేం తెలివితక్కువవాడ్ని కాదే పిచ్చిదానా. చాలా ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను. బ్రాహ్మలేమిటీ రొయ్యల్ని పండించడమేమిటీ అని పనికిరాని వెధవలు నవ్వితే నవ్వొచ్చు గాక. ఈరోజున రొయ్యలంటే రూపాయల మూటలే. ఇతర దేశాలకి ఎగుమతి అవు తోన్న సముద్ర బంగారమే. కిలో రొయ్యలు నాలుగొందల రూపాయలదాకా వుంటుంది తెలుసా? మన ఆరెకరాలకీ వరి పంట ద్వారా ఏడాదికి ముప్ఫై ముప్ఫై అయిదు వేలొస్తోంది. రొయ్యల చెరువు తవ్వితే ఏడా దికి రెండు మూడు లక్షలు ఘల్లుఘల్లుమని శబ్దం చేసుకుంటూ మనింటికి నడిచొస్తాయే"

"నిజమా!"

"నీ తోడు! నాలుగు పంటలు తీసేసరికి నీ ఒంటినిండా బంగారమే ఔతుంది. అమ్మాయి పెళ్ళి ఏ ఇంజినీర్తోనో అంతా ఔరా అనుకునేలా చేసేస్తాను. అప్పుడిహ అర్చకత్వమూ అక్కర్లేదు పెద్దమునసబు దగ్గర చేతులు కట్టుకుని నిలబడడమూ అక్కర్లేదు. కాలుమీద కాలేసుకుని ఇలా వూగుతూ కూర్చోవచ్చు"

"ఆ ఏడుకొండలవాడు కరుణించి అంతా మీరు చెప్పినట్టే జరిగితే దేవుడికి కళ్యాణం చేయిద్దామండీ"

"తప్పకుండానూ. ఇంకో సంగతి. రొయ్యల్ని పండించడం గురించి నాకు ఓన మాలు తెలీక పోయినా అన్నీ తెలిసిన చురుకైన కుర్రాడ్ని పాలేరుగా కుదిర్చేశానే. ఇహ చిన్నపాలేర్ని మాన్పించేస్తాను. అటు చెరువునీ ఇటు గేదెల్నీ అతగాడే చూస్తాడు"

"కుర్రాడు నమ్మకస్తుడేనా"

"దివ్యంగానూ. ఎర్రెంకడి కొడుకు సూర్యమే"

"ఏవిటీ-! గుళ్ళో కొచ్చి నానాగొడవా చేసి నోడా? "

"వాడేలే. వాడ్నెప్పుడో గంగిరెద్దుని చేసే శాంగా"

"అదికాదండీ. గుళ్ళో గొడవచేసినోడు రేపు మనింట్లో చెయ్యడనేవిటండీ"

"అటువంటి వాడుకాదులే. గుడి అంద రిదీ గనుక అక్కడికొచ్చాడుగాని పనివిష యంలో, శ్రద్ధవిషయంలో, నమ్మకం విష యంలో, చురుకుపాలు విషయంలో వంక

పెట్టడానికి లేదనుకో. అసలు వాడ్ని చూశాకే చెరువు తవ్వాలన్న ఆలోచన వచ్చిందే"

"ఎందుకో నాకు మనస్కరించటం లేదండీ. మనతో దెబ్బలాడినోడ్ని..."

ఆవిడ ఇంకా ఏదో అనబోతోంటే మధ్యలో అందుకున్నారు కృష్ణమాచార్యులు- "ఓసి పిచ్చిదానా! దేనిదారి దానిదేనే. దేని కది విడి విడిగా చూడాలిగాని కలిపేసి కంగారుపడకూడదు. వాడివల్ల మనకి లాభం వుంటుందనుకున్నప్పుడు మారుమాట్లాడకుండా వుపయోగించుకోవడమే తెలివైన పని. ఆ ఒక్క గుడి విషయంలో తప్ప మరే విషయంలోనూ అతడికీ మనకీ తగాదాలేం లేవుకదా. మరింకెందుకు సంకోచించడంచెప్పు? ముందే చెప్పినట్టు రొయ్యల్ని పండించడంలోని మెలకువలన్నీ అతగాడికి బాగా తెలుసు. నమ్మి లక్షలిచ్చినా లక్షణంగా వుపయోగిస్తాడు తప్ప స్వార్థానికుపయోగించుకోడు. పని దొంగకాదు. అసలలాటి విశ్వసనీయ వ్యక్తి మనకి లభించడం మన అదృష్టమనుకో. అందుకే మిగతావారికన్నా ముందే ఎర్రెంకడితో మాట్లాడి కుదిర్చేశాను. మంచిరోజు చూసి కొబ్బరికాయకొట్టి చెరువు తవ్వకం ప్రారంభించెయ్యబోతున్నానే"

"సరేలెండి. నా మాట మీచెవికెప్పుడు ఎక్కింది గనుక! వాడు మంచివాడూ దొంగతనాలు చెయ్యడూ అని కూర్చోండి ఎప్పుడో మీ కళ్ళు గప్పి ముఖ్యంగా ఇంటినే దోచుకుపోతాడు!"

"మొత్తానికి భలే దానివేనే" గట్టిగా నవ్వేశారాయన.

"అయితే ఆ యువకుడి పేరు సూర్యం అన్నమాట. నిజంగా సూర్యుడే. లేకపోతే బ్రాహ్మలమ్మాయి అయిన తనకవాళ చేయి అందిస్తాడా! తరతరాల సాంప్రదాయాన్ని కాలరాచి గుళ్ళో అడుగుపెడతాడా! అంత శక్తీ ధీశక్తీ సూర్యుడికి తప్ప ఇంకెవరికుంటుంది? అలాటివాడు తమింటి పాలేరుగా రాబోతున్నాడు. అంటే అతడ్తో తన పరిచయం పెరగబోతోంది. పుష్పించబోతోంది!"

అలివేలు వూహాస్రవంతి నిరాటంకంగా సాగిపోతోంది!



శివస్వామి ఆ వూరికెల్లా మోతుబరి రైతు. అంతేకాదు ఆ ప్రాంతంలో పేరు మోసిన వడ్డీ వ్యాపారికూడా.

ఇల్లు, పొలాలు, నగలు నాణ్యాలు- విలువున్న ప్రతిదానిమీదా అప్పు ఇస్తారాయన. అవతలివాడి అవసరాన్ని బట్టి వడ్డీరేటు వుంటుంది. ఆయన దగ్గర అప్పు చెయ్యని రైతులుగాని కూలీలుగాని ఆ వూళ్ళో దాదాపు లేరనే చెప్పాలి. అంతేకాదు. ఒక్కసారి ఆయన దగ్గర అప్పు చేసినవాడు శ్లేష్మంలో పడ్డ ఈగలా కొట్టుకుంటూ వుండాల్సిందే తప్ప ఆ వుచ్చులోంచి తేలిగ్గా బయటపళ్ళేడు.

వూరంతా తన అప్పు ఉప్పు తిందన్న భరోసాతో ఒకప్పుడు పెద్ద మునసబుగారితో పెద్దరికం కోసం తలపడ్డారు. కాని ఆయన యంత్రాంగానికి తలొంచక తప్పిం

ఏకాదు. అప్పట్నుంచీ ఆయనంటే ఎంతో అక్కసు, కోపం. కనీసం తన కొడుకు నారాయణ అయినా మునసబుని దెబ్బ తీస్తాడేమోనని చూశారుగాని ఆ ఆశా అడియాశ అయిపోయింది. అతణ్ణి చేరదీసి దువ్వి ఓ పెద్దని చేసి, తన చేతికింద పెట్టేసుకున్నారు పెద్ద మునసబుగారు.

శివస్వామి దగ్గర అప్పు చేసిన వారిలో ఎర్రెంకడూ వున్నాడు. అప్పుడెప్పుడో పెళ్ళానికి పెద్దాపరేషన్ చేసినప్పుడు అప్పు చేశాడు. అప్పట్నుంచీ ప్రతి ఏడాదీ ఎంతో కొంత చెల్లు వేస్తున్నాడు. అతడూ అతడి భార్యా వూడ్పుల్లో, కోతల్లో తక్కువ కూలీకి పనిచేస్తున్నారు. పండగలకీ, పబ్బాలకీ అతడి భార్య వూరికే వెల్లవేయటం, ఇల్లు అలకటం, పిండిదంచడంలాంటి పనులు చేస్తూనేవుంది. ఆఖరికి నిన్నమొన్నటిదాకా సూర్యం కూడా తక్కువ జీతానికి ఆయనదగ్గర పాలేరుగా పనిచేశాడు.

అయినప్పటికీ అప్పు తీరలేదు. పైపెచ్చు సూర్యం తన దగ్గర మానేసి కృష్ణమాచార్యులు దగ్గర ఎక్కువ జీతానికి పాలేరుగా కుదిరినందుకు కోపంగా వుంది. రోషంగా వుంది.

"ఎర్రెంకణ్ణి ఈడ్చుకు రండ్రా" పిప్పళ్ళబస్తాలా వుండే శివస్వామి ఒగురుస్తూ చెమట్లు కక్కుతూ అరిచారు.

కబురు విని వణికిపోయాడు ఎర్రెంకడు. ఏం చేయాలో పాలుపోలేదు. సమయానికి సూర్యం కూడా లేడు.

మరి గత్యంతరంలేక బలికెళ్ళే మేకపిల్లలా వెళ్ళి శివస్వామి కాళ్ళమీద పడ్డాడు.

"నీ కొడుకు చేత మా కొలువు మాన్పిస్తావుట్రా మాదచ్చోద్" అంటూ ఒక్క తన్ను తన్నాడు. అతడెళ్ళి అంత దూరాన పడ్డాడు.

లేచి గుండెలు బాదుకుంటూ వచ్చి "సెమించండి మా ప్రభో" అని ఏడుస్తూ మొరపెట్టుకున్నాడు.

"కక్కరా. నా బాకీ సొంతం కక్కి మీ ఇష్టమొచ్చిన చోటుకి పొండి నువ్వూ నీ కొడుకూనూ."

"తొరగా అప్పు తీర్చాలనే ఆచార్లుగోరు ఎక్కువ జీతమిత్తానంటే ఆరి దగ్గర పెట్టేను బాబయ్యా"

"నోర్ముయ్యిరా దొంగనాయాలా. నాకు చెప్పకుండా నా అనుమతి లేకుండా మరో చోట పెట్టడానికి నీకెన్ని గుండెల్రా. అలా తేభ్యం మొహాలేసుకుని చూస్తారేంట్రా. లమ్డీకొడుకుని బండికి కట్టెయ్యండి. ఎవడు అడ్డొస్తాడో నేను చూస్తాను" రంకెవేశారు ఒళ్లంతా కదలిపోతోంటే.

కొందరు పనివాళ్ళొచ్చి బండి చక్రానికి కట్టేశారు ఎర్రెంకడ్ని. వార్త తెలిసి ఎర్రెంకడి పెళ్ళాం లబోదిబోమంటూ వచ్చింది. మొగుడ్ని వదిలిపెట్టమని నెత్తీనోరూ కొట్టుకుంది.

శివస్వామి వినలేదు. కరగలేదు. సూర్యంలాంటి మంచిపనివాణ్ణి వదులుకోవడానికి సిద్ధంగా లేడాయన. నిజానికతడెళ్ళిపోతే ఈమధ్యే తవ్విన రొయ్యల చెరువుల్ని సరిగ్గా చూసేవాళ్ళూ లేరు. అందుకే ఆయనకంత పంతంగా వుంది.

"నీ ఏడ్పులు నాకెందుకే. రూపాయలన్నా పట్టుకురా. నీ కొడుకునన్నా మళ్ళీ నా దగ్గర పెట్టు"

"ఆచార్లుగోరికి మాటిచ్చేను బాబయ్యా. ఈ పాలికి సెమించండి"

"మాటిచ్చాట్ట. అబ్బో సత్యహరిశ్చంద్రుడు దిగివచ్చాడు చూడండి. ఒరేయ్ నారాయణా- కొరడా అందుకోరా. ఈ వూళ్ళో ఇంకెప్పుడూ ఎవడూ నాకెదురు తిరక్కుండా వీడికి తగిన శాస్తి చేద్దాం"

నారాయణ ఆయన చెవిలో నీళ్లు నములుతూ ఏదో చెప్పబోయాడుగాని ఆయన

విన్పించుకోలేదు. "ఆడంగి వెధవలా వణుకు తావేంరా. వెళ్ళు. వెళ్ళి కొరడా అందుకో. ఇవాళ వాడి ఒంటినుంచి రక్తం కారాలి" హుంకరించారు.

అంతా ప్రేక్షకుల్లా చూస్తున్నందున వెనకా డితే అప్రతిష్ట పాలవుతామన్పించింది నారా యణకి. కొరడా తీసుకుని ఎర్రెంకడి దగ్గరి కెళ్లాడు. చేతులు జోడించాడతడు. ఘొల్లుమందతడి పెళ్ళాం.

"సూర్యాన్ని మళ్ళీ మా దగ్గర పాలేరుగా పెట్టడానికొప్పుకోరా" అనునయంగా అన్నాడు నారాయణ.

"ఆచార్లుగోరికి మాటిచ్చేనండి. మావోణ్ణి నమ్మి ఆరుసెరువు తవ్వబోతున్నారండి..."

"పోనీ అప్పు తీర్చెయ్"

"కాసింత గడువియ్యండి బాబయ్యా తీర్చే త్తాను. అప్పటికీ తీరకపోతే నా సెర్మం ఒలిచి సెప్పులుకుట్టిత్తాను..."

"వాడితో మంతనాలేవిట్రా ఝుళిపించు కొరడా" శివస్వామి అరిచారు.

చెళ్ చెళ్ మని రెండుసార్లు కొట్టాడు. మూడోసారి కొట్టబోతోంటే సూర్యం అడ్డొచ్చి కొరడా పట్టుకుని ఆపాడు. అతడి సాహసా నికంతా నివ్వెరపోయారు.

"ఏవిటీ దౌర్జన్యం? " గర్జించాడు.

"అప్పు తీర్చనందుకిది శిక్షరా" శివస్వామి అరిచారు.

"శిక్షించడానికి మీరెవరు? మీకేం అధి కారం వుంది? వెంటనే మా నాన్నకి కట్టిన కట్లు విప్పుతారా లేక నన్నూ దౌర్జన్యానికి దిగమంటారా" కొరడా చుడుతూ అన్నాడు సూర్యం.

నారాయణ పరుగున వెళ్ళి అరుగు ఎక్కి తండ్రి పక్కకెళ్ళిపోయాడు.

"నా అప్పు ఎగ్గొడదామనుకుంటున్నారా లంజకొడకల్లారా"

"నోరు సంబాళించుకుని మాట్లాడండి. తిట్లు మాకూ వచ్చు ఇన్నేళ్లుగా తీరుస్తున్నా అరవచాకిరీ చేస్తున్నా మీ అప్పు తీరలేదంటే అది అప్పేకాదు. మేం తీర్చనే అక్కర్లేదు" ఆవేశపడ్డాడు సూర్యం.

"నీ బాబు వేలిముద్ర వేసిన ప్రామిసరీనో ట్లున్నాయి చూడరా. వీటిని కోర్టులో పడేస్తే నువ్వూ మీ నాన్నా జైలుకూడు తినాలి జాగ్రత్త"

"మేం తింటామో, మీరు తింటారో అదీ చూద్దాం. మేం మీకు పైసా ఇవ్వక్కర్లేదు. మీదిక్కున్న చోటికిపోయి చెప్పుకోండి. మీరేదో చేసేస్తారని భయపట్టానికి మేం గాజులు తొడిగించుకుని కూర్చోలేదు జాగ్రత్త"

"ఒరేయ్ వెంకన్నా పాపారావ్... మీరంతా ఎక్కడ చచ్చేర్రా. వాడి పెడరె క్కలు విరిచికట్టెయ్యండ్రా..." రంకె వేశారు శివస్వామి.

ఎవరూ కదల్లేదు.

"రామదాసు కాలంకాదిది. గుర్తుంచు కోండి" ఆయన్నో పురుగులా చూసి తలెగరే శాడు సూర్యం. తండ్రి కట్లు విప్పి నిర్భ యంగా తీసుకెళ్ళిపోయాడు.

ఉద్రేకంతో వూగిపోతూ తిట్లవర్షం కురిపి స్తోంటే గుండెపోటొచ్చింది. గుండె పట్టుకుని కూలబడిపోయారు శివస్వామి!

★ ★ ★

అవాళ తొలి ఏకాదశి.

పాలేర్లకి గడువురోజు. అవాళే కొత్తగా జీతానికి కుదిరే తొలిరోజుకూడా. అందుకే అవాళ పండుగ జేసుకుంటారు రైతులూ పాలేర్లూ కూడా. కొత్త పాలేర్లు అవాళ మంచిరోజని చెప్పి కొత్త పనిలోకి వెళ్ళి నామకా చిన్న చిన్న పనులు చేస్తారు. ఆ తర్వాత సినిమాలకో, నాటకాలకో వెళ్తూం టారు.

కృష్ణమాచార్యులవారి పాలేరుగా కుదిరిన సూర్యం ఆయనింటికెళ్ళాడు. పశువులశాలని శుభ్రం చేశాడు. గేదెల్ని కడిగి గడ్డివేశాడు.

కృష్ణమాచార్యులూ, ఆయన భార్యా అతడి కెన్నో సూచనల్లాంటి ఆంక్షలు విధించారు. సలహాల్లాంటి ఆదేశాలు జారీచేశారు.

పుష్పవల్లి ప్రత్యేకంగా ఎన్నో జాగ్రత్తలు చెప్పింది. అతడెట్లా మసలాల్సిందీ, ఏవేం ముట్టకూడనిదీ అంటూ సొంటూ ఎలా వుండాల్సిందీ, ఎంత దూరంలో నిలవాల్సిందీ గుక్కతిప్పుకోకుండా వివరించింది.

అంతా విని నవ్వుకున్నాడు సూర్యం.

చెరువు తవ్వకానికి ముహూర్తం పెట్టేననీ తవ్వేవాళ్ళని మాట్లాట్టానికి ఆ మర్నాడు అతడ్నెళ్ళమనీ చెప్పారు కృష్ణమాచార్యులు.

"ఇవాళ పండక్కదా. ఖుషీచెయ్" అంటూ ఇరవై రూపాయలిచ్చారు.

ఆ సాయంత్రం మిత్రుల్తో కలిసి టూరింగ్ హాల్లో సినిమా చూడటానికెళ్ళాడు సూర్యం. ఆడుతూ పాడుతూ రెండు కాళ్ళ బండిమీద వెళ్ళారంతా.

చాలామంది నేల టిక్కెట్లు తీసుకుని తెరకి దగ్గరగా కూర్చోడానికని గబగబా లోపలికెళ్ళిపోయారు. సూర్యం మరికొందరూ కూడబలుక్కుని కుర్చీ టిక్కెట్లు తీసుకునెళ్ళారు.

కొందరు పెద్దిళ్ల కుర్రాళ్లూ సినిమాకొచ్చారు. కుర్చీల్లో దర్జాగా కూర్చునున్న సూర్యాన్నీ అతని మిత్రబృందాన్నీ అక్కసుగా చూశారు. అసూయతో మండారు. ఏదో వంకన వాళ్ళని బయటికి గెంటేస్తే బావుణ్ణనుకున్నారు. కాని అది జరిగేపని కాదనుకుని తామేదూరంగా వెళ్ళి కూర్చున్నారు. ముఖం ముడుచుకుని ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నారు.

ఆ సంగతి గమనించినా వాళ్ళ గొడవ పట్టించుకోకుండా బఠాణీలూ వేరుశనగ పప్పూ నముల్తూ సినిమా చూశారు సూర్యం, స్నేహితులూ.

సినిమా పూర్తయింది. అంతా బయటికెళ్తున్నారు. సూర్యం ఫ్రెండ్ జాన్ కాలు స్లిప్అయి ఒకమ్మాయి మీద పడబోతూ నిలదొక్కుకున్నాడు. మరుక్షణం ఓ యువకుడు జాన్ కాలర్ పట్టుకుని గుంజి "మా ఆడవాళ్ళని అల్లరి పెడతావుట్రా బద్మాష్. నువ్వెంత నీ బతుకెంతరా" అని తిడుతూ కిందపడేసి బూటుతో డొక్కల్లో తన్నేడు.

సూర్యం పరుగునొచ్చి ఆపాడు.

"వాడలాంటి వాడు కాదు. పొరబాటయ్యిందంటున్నాడుగా" సర్ది చెప్పడానికి ప్రయత్నించాడు సూర్యం.

"మీకు కళ్లు నెత్తికెక్కాయిరా. ఇది మీ వూరు కాదురా మీ ఆటలు సాగటానికీ..."

"తప్పయిపోయిందన్నాడుగా. వదిలేసెయ్యండి. మాటలు మిగిల్తే మర్యాద దక్కదు" తీవ్ర స్వరంతో అన్నాడు సూర్యం.

"ఏంజేస్తావ్రా..." అంటూ తిట్లు లంకించుకున్నాడు.

సూర్యం ప్రతిఘటించబోతోంటే ఎవరో వచ్చి అతణ్ణి తీసుకుపోయారు. ఈలోగా నేల క్లాసుకెళ్ళిన వారి మిత్రులంతా తోసుకొచ్చారు.

జాన్ని కొట్టారని తెలుసుకుని చెప్పులూ, కర్రలూ తీశారు.

వాళ్ళని శాంతపరిచి ఇంటిముఖం పట్టించాడు.

అంతా మౌనంగా చీకట్లో నడుస్తున్నారు.

ఆ సంఘటన గురించే ఆలోచిస్తున్నాడు సూర్యం.

నిమ్న కులస్థులైన తాము కుర్చీక్లాసుకెళ్ళడమే నేరమైపోయిందా? ఆ మాత్రం కూడా సహించలేనంత విద్వేషం అగ్రకుల యువకుల్లో ఎలా ఎందుకు పుట్టింది? చదువూ విజ్ఞానం గలవాళ్ళు సంస్కారహీనంగా అలా

ఎలా ప్రవర్తించగలిగారు? వారి అకారణ ఆగ్రహానికి ఏమని అర్థం చెప్పుకోవాలి?

అసూయా? ఓర్వలేని తనమా?

వారికన్నా తమకి ఎక్కువ ఏముందని? !

ప్చ్ కులవిద్వేషాలూ, కులాల సమరాలూ ముగిసేదెన్నడో!

కిష్టయ్య మాస్టారన్నట్టు సమాజాన్ని కులాలుగా వర్గాలుగా చీల్చేస్తోన్న వివక్షతా గోడలు నిలువునా కూలిపోవాలి. అది కులాంతర వర్ణాంతర వివాహాలవల్లే సాధ్యం. రాచపుండులాంటి ఈ కులకుళ్ళు వ్యవస్థకి అలాంటి శస్త్రచికిత్స తప్ప మరో మార్గం లేదు.

భావోద్రేకానికి లోనై వూగిపోయాడ సూర్యం.

★ ★ ★

"అమ్మా! అమ్మా!..."

"ఒరే ఒరే ఆ పరుగేంట్రా నీ కంగారు సంతకెళ్ల!"

"మరేమో అమ్మ..." ఒగురుస్తూ అన్నాడు రాజన్న. వాడికేదోగాని చెప్పలే నంత ఆనందంగా వుంది. ఆ ఆనందంతో ఉక్కిరి బిక్కిరైపోతున్నాడు.

"వుండుండు. ఒగుర్పు తగ్గనీ సెబుదూ గాని..." కొడుకు గుండె సవరిస్తూ అంది గౌరమ్మ.

అయినా విన్లేదు రాజన్న. గుండెల్లోంచి తన్నుకొస్తోన్న పరమానందం వాణ్ణి తిన్నగా వూపిరి పీల్చుకోనివ్వటంలేదు.

"అమ్మా. మరేమో నాకు ప్రైజివ్వటానికి కలెక్టరమ్మ వస్తాంది"

బుగ్గలు నొక్కుకుందామె. "ఎట్టెట్టా. కలెక్ట రమ్మ వస్తాందా. ఇళ్ళపట్టాలిస్తాదేవోఁ"

"ఏహే... అందుక్కాదే. నాకూ... నాకు ప్రైజివ్వటానికి వస్తాంది. ప్రైజులంటే బవు మానం అన్నమాట"

"నీకు బవుమానం ఇయ్యటానికి మన గుడిసెకెందుకొస్తాదిరా పిచ్చోడా. అలాంటి గొప్ప గొప్ప ఆఫీసర్లు మనకాడికి రారు. మనవేఁ ఎళ్ళాల. అల్లంత దూరాన ఎండలో నిలబడిసూత్తే ఎప్పటికో ఓ పాలొచ్చి అలా మొకం సూపించి ఇలా ఎల్లిపోతారు. ఈ వూసులకేంగాని మేకల్ని తోలుకుపో"

"నీకేం తెల్దమ్మా. కలెక్టరమ్మ నిజంగానే వత్తాంది. మా స్కూల్లో వార్షికోత్సవం చేస్తూండారు"

"ఏం సేస్తన్నారూ? "

"వార్షికోత్సవం. అంటే స్కూలు పండగన్న మాట"

"బిళ్ళలు పంచిపెట్టే పండగా? "

"అబ్బే... చాలా చాలా చేత్తారు. గొప్పగా చేత్తారు. స్కూలుకి ఎల్లవేత్తారు. జెండాలు కడతారు. మైకు పెడతారు. బోల్డు కుర్చీలే స్తారు. గుడ్డపందిరేస్తారు..."

బుగ్గలు నొక్కుకుంటూ వుంది గౌరమ్మ. ఆ విషయాలకన్నా కొడుకు నోట అలా పెద్ద కబుర్లు వినటం ముచ్చటగా వుందా మెకి.

"ఇంతకీ నీకు బవుమానం ఎందుకిత్త న్నార్రా రాజన్నా. మంచోడివనా, బాగా సదూకుంటున్నావనా, లేనోళ్ళ పిల్లోడి వనా? "

"అందుక్కాదొసే. ఆటల పోటీలెట్టేరు. నేను పరుగుపందేల్లో ఫస్టొచ్చాను. చెడు గుళ్ళో సెకండొచ్చాను. మరేమో...."

"ఏంట్రేంట్రా. స్కూలోళ్ళందరికన్నా పరు గులాటల్లో ముందొచ్చావా? "

"అవునే అమ్మా. మా మేస్టుగారూ అంతా తెగమెచ్చేసుకున్నారు. లేడిపిల్లలా పరుగెత్తే నంట. ఎక్కడెక్కడో పరుగు పోటీలకి కూడా పంపింతారంట. పరుగులరాణి ఉష లాగా బోల్డుప్రైజులు తెస్తానన్నారు"



"ఆవిడెవర్రా? మీ మేస్టారా? "

"అహ... కాదులే. నీకు తెల్దులే. ఆవిడ ఇంచక్కా పరుగెడద్దిలే. బోల్డు బంగారు పతకాలు గెలిపించిందిలే"

"ఆడపిల్లలు కూడా పరుగెడతారేంట్రా? ఇలాంటి సోద్యం నానెక్కడా ఇన్లేదు!"

"ఆళ్ళది మన్లాగా పల్లెటూరనుకున్నావేంటి పట్నం. అక్కడంతా పరుగెడతారు. ఆటలాడతారు. బోల్డు బోల్డు పనులు చేస్తారు. అయ్యన్నీ నీకు తెలవ్వులే"

"పొట్టకోత్తే అచ్చరం ముక్కలేనోళ్ళం. మనకేటి తెలుత్తాదిరా బిడ్డా. నీకు బవుమానం ఇత్తన్నారు. నా కడుపు నిండిపోయిందిరా రాజన్నా" ముద్దులు కురిపించింది.

"నాకూ ఇంకా నెగ్గినోళ్లున్నారే ఆళ్ళకీ ప్రైజులిత్తానికి కలెక్టరమ్మ వస్తాందన్న మాట. అయాల మేం నాటకాలేస్తన్నాం. డాన్సులు సేస్తన్నాం. పాటలు పాడతన్నాం. ఇంకా..."

"ఏవిట్రోయ్ రాజన్నా. నాటకాలూ, డాన్సులూ అంటన్నావేంటి కథ? రోజూ తిన్నగా స్కూలుకెళ్తన్నావా లేదా?" అప్పుడే అన్నానికి ఇంటికొచ్చిన సూర్యం అడిగాడు.

"ఒరే సూరెంబాబూ! మా రాజన్నగాడికి బవుమానం ఇవ్వడానికి కలెక్టరమ్మ వత్తాందంట్రా" సంబరంగా చెప్పింది గౌరమ్మ.

"చాలా సంతోషంరా. నువ్వింకా బాగా చదువుకోవాల్రా. మన మాలపల్లికీ మన వూరికీ మంచి పేరు తేవాల్రా..." మెచ్చుకున్నాడు సూర్యం.

"రన్నింగులో ఫస్టొచ్చానన్నా. నాటకం కూడా వేస్తున్నాం. నువ్వు కూడా రావాలన్నా"

"అదేమంత దూరంరా. ప్రక్కనేకదా. కాలవకడ్డంపడితే రెండు మైళ్లు. రోజూ నువ్వెళ్ళి చదువుకొస్తూ రాగాలేంది మేం ఒక్కరోజు రాలేమా? తప్పకుండా వస్తాం" భుజం చరిచి మరీ అభినందించి తన గుడిసెలోకెళ్ళిపోయాడు సూర్యం.

"అన్నమాట ఇను. ఆడి సదువు మద్దెలోనే కొండెక్కింది పాపం. లేపోతే గొప్పోడయ్యేవోడు. తెలివైనోడులే బిడ్డ. నీ సదువు మాత్రం ఆక్కాడ దొరేయ్. పొరుగూర్లో సదువయ్యేక పట్నం పంపిత్తాడ్రా నీ అయ్య. గొప్ప గొప్ప సదువులు సదువుకుని గొప్పోడివైపోవాల. నీడపట్టున కుర్చీలో కాలుమీద కాలేసుకుని కూకుని ఉజ్జోగం సెయ్యాలి..." కళ్ళనుండి కన్నీళ్ళు జలజలా రాలిపోతోంటే సంబరంగా పొంగిపోతూ అంది గౌరమ్మ.

"ఓ పట్నంలో చదూకుంటాను. పెద్దవుజ్జోగం చేత్తాను"

"మానాన్నే! మా తండ్రే! ఎంత సల్లని మాట చెప్పేవురా నీ అమ్మ కడుపు సల్లగా. మీ అయ్య ఇన్నాడంటే ఇల్లెక్కి గంతులేస్తాడ్రా" మళ్ళీ ముద్దుల్తో ముంచెత్తింది.

"ఒరే రాజన్నా. నీకెలాటి బవుమానం ఇస్తాదిరా కలెక్టరమ్మ? "

గతుక్కుమన్నాడు రాజన్న. ఎలాటి ప్రైజు ఇస్తారో వాడికీ తెలీదు. కానాసంగతి బయటపెట్టదలచలేదు.

"కలెక్టరమ్మ ఇస్తాదికదా. చాలా పెద్ద ప్రైజు ఇస్తాదమ్మా"

"అవునవును. బవుమానం ఇయ్యడానికి కొండమీంచి దిగొస్తాందామె. సిన్నదీ సిటికెదీ ఇస్తాదేంటి నా పిచ్చిగానీ! శానా పెద్దదే ఇత్తాదిరా"

"మరేమో అమ్మా... అయాల మంచి బట్టలు- కొత్త బట్టలు ఏసుకురమ్మన్నారు మేస్టారుగారు" దిగులుగా అన్నాడు.

వాడి భుజం దగ్గర చిరిగిన చొక్కా చిరుగు కన్పించకుండా సర్దుతూ, "అలాగేలేరా. నువ్వేం ఇదవ్వమాకు. మీ అయ్యాకి నచ్చజెప్పి కొత్త బట్టలు కుట్టిత్తాన్లే" అంది.




"మా అమ్మ శానా మంచిది. మేకలు తోలుకెల్తానే"

"ఇంత గంజి తాగిపోరా బిడ్డా"

"మల్లొచ్చి తాగుతాన్లే" ఉత్సాహంగా మేకల్ని మేపడానికి తోలుకెళ్ళిపోయాడు రాజన్న. స్కూలునుంచి రాగానే వాడికది అదనపు డ్యూటీ!

"పిచ్చి సన్నాసి!" కొడుకువంక అభిమానంగా, ఆప్యాయంగా చూస్తూండిపోయింది.

"ఏంటే గౌరమ్మా. ఆ సూపేంటే. కొడుక్కి దిష్టి తగిలేను" పొరుగింటి చుక్కమ్మ అంది నవ్వుతూ.

"బిడ్డకి తల్లి దిష్టిలేదుగానీ, ఇదిన్నావా. కలెక్టరమ్మ వచ్చి మా రాజిగాడికి బవుమానం ఇస్తాంది. వాడు ఆటల్లో ముందుండంట"

"అట్టానా. దేనికైనా పెట్టిపుట్టాల!" కొడుకు సూర్యాన్ని తలచుకుని దిగులుగా అంది.

ఒకప్పుడు సూర్యం కూడా ఇలాగే చక్కగా చదువుకునేవాడు. మాష్టార్ల ప్రశంసలందుకునేవాడు. పట్నం వెళ్ళి హాస్టల్లో వుండి కూడా చదువుకున్నాడు. కాని ఆ చదువు అర్థాంతరంగా ఆగిపోయింది. పాలేరుగా మారిపోక తప్పింది కాదు.

నిట్టూర్చింది.

గౌరమ్మ మొగుడొచ్చేవరకూ ఇరుగమ్మకీ పొరుగమ్మకీ చెప్పిందే చెబుతూ వూదరగొట్టింది.

మొగుడు ముసిలిగాడు వస్తూ అల్లంత దూరాన కన్పించేడు. ఎదురెళ్లి మరీ చెప్పింది. "ఇదిగో ఇన్నావా. మన రాజిగాడికి బవుమానం ఇయ్యడానికి కలెక్టరమ్మ వస్తాంది"

"పోవే ఎర్రి మొగవాఁ. రాజిగాడేవన్నా దొరబిడ్డేంటి కలెక్టరమ్మ రాడానికీ, బవుమానం ఇయ్యడానికీనూ!"

"నిజవేనయ్యా. ఇస్కూల్లో ఏవో పోటీలెట్టారంట. అందులో మన బుడ్డోడు అందరికన్నా ముందొచ్చాడంట. బవుమానం ఈయడానికి సాచ్చాత్తూ కలక్టరమ్మే వత్తారంట. కొత్త బట్టలు తొడుక్కురమ్మని పంతులుగారు సెప్పేరంట నామాట అబద్ధమైతే సూరెంబాబునడుగు"

"ఏడీడు? "

"మేకల్ని తోలుకుపోయాడు"

"అయితే నిజంగా నిజవంటావేంటే"

"నీతోడు! నా బిడ్డ నిప్పయ్యా. సెరమ్మం ఒలిసినా అబద్ధం సెప్పడు"

"నాకు తెల్డేంటే. కూలీ నాలీ సేసుకునే కడజాతోళ్లం. మన కడుపున బుట్టినోడిమీద కలెక్టరమ్మకి దయగలిగిందంటే ఎంత గొప్ప! ఎంత అది! ఎంత ఇది!" పొంగిపోతూ అన్నాడు.

"గొప్పల సంగతి సరే. కొత్త బట్టల మాటేంటి. నువ్వేం సేత్తావో నాకు తెల్డు. ఆడికి కొత్త బట్టలు కుట్టియ్యాల్సిందే" తెగేసి చెప్పింది గౌరమ్మ.

"కుట్టిత్తానే. అప్పో సప్పో సేసైనా సరే కుట్టిత్తానే. అయ్యగోర్ని అప్పడిగొత్తానుండు"

దారిలో దర్జీదాసు మిషను దగ్గరాగాడు.

"మా బుడ్డోడికి కొత్త బట్టలు కుట్టాల దాసుగోరూ. ఎంతవ్వద్దండి" అనడిగాడు.

"యాభై అయినా లేందే ఏవొత్తాయ్"

"అయ్యగోర్నడిగి డబ్బుతెత్తా. రెండ్రోజుల్లో బట్టలు కుట్టియ్యాల"

"ఏంటో అంత అర్జంటు"

"కలెక్టరమ్మొచ్చి మావోడికి బవుమానం ఇత్తాంది"

"ఆఁ!"

తిన్నగా కామందు ఇంటికెళ్ళాడు. అయ్య

గార్లేరు. అమ్మగారి దగ్గరికెళ్ళాడు.

"అమ్మగోరూ. ఏరేవోc. మా పిల్లడికి బవుమానం ఇయ్యడానికి కలెక్టరమ్మ పత్తాం దండి"

"నీకేమైనా మతిపోయిందా. కలెక్టరమ్మ ఎందుకొస్తుంది? "

"మనూరు కాదమ్మగోరూ. పక్కూరి ఇస్కూల్లో ఏదో పండగుందంట. ఆ పండగలో మావోడికి బవుమానం ఇత్తారంట"

"ఆహా. అలా చెప్పు. స్కూలు ఫంక్షన్లో పిల్లలందరికీ ఏదోటిస్తారు. దానికింతగా కింద మీదవ్వక్కర్లేదు"

మారిన ఆవిడ ధోరణిని గ్రహించగల స్థితిలో లేడు ముసిలిగాడు.

"మావోడికి సరైన బట్టల్లేవమ్మగోరూ. తవcరో యాభైరూపాయలిత్తే కొత్త బట్టలు కుట్టిత్తాను. జీతంలో పట్టుకుందురుగాని"

"ఇంతోటిదానికి కొత్త బట్టలు కుట్టించాలేవిట్రా. మా అబ్బాయి పాత బట్టలిస్తాను. రేపొచ్చి పట్టుకెళ్లు"

"బిడ్డ ఎంతో ఆశగా అడిగాడమ్మా. ఆళ్ళమ్మ మురిసిపోతూ అడిగింది. కొత్త బట్టలే కుట్టిత్తాను. తవcరు డబ్బిత్తే..."

"డబ్బు పాతర్లున్నాయి. తవ్వి ఇస్తానుండు. ఏవృత్తి చేసుకునే వాళ్ళు ఆ వృత్తి చేసుకోవాలి. 'కులవృత్తికి సాటిరాదు గువ్వలచెన్నా' అని వూరికే అన్లేదు. గోచీకి రికాణా లేని వాళ్ళకి కొత్త బట్టలూ, గుడిసె లేనోళ్లకి చదువులూనూ. మాయదారి కాలం మాయదారి మనుషులూనూ!"

అవాక్కైపోయాడు ముసిలిగాడు. ఆవిడ ధోరణి హఠాత్తుగా ఎందుకు మారిపోయిందో అర్థంకాలేదు. అరచి గీపెట్టినా అర్థ రూపాయి బిళ్ళకూడా ఇవ్వదనుకుని బుర్ర గోక్కుంటూ వచ్చేశాడు.

ఎలాగైనా కొత్తబట్టలు కొనివ్వాలి. అవి తొడుక్కుని రాజిగాడు కలెక్టరమ్మ దగ్గర్నుంచి బహుమతి తీసుకొంటోంటే కళ్ళనిండుగా చూడాలి.

మరి రెండుచోట్లకెళ్ళి ప్రయత్నించాడు గాని డబ్బు దొరకలేదు.

తిరిగి తిరిగి ఇంటికొచ్చిన అతడికి మేక అరుపులు అమృతపు సోనల్లా సోకాయి.

అతడి కళ్ళు మెరిశాయి.

మర్నాడు స్కూలునుంచొస్తూనే "అమ్మా-తెల్లమచ్చల మేక లేదేంటమ్మా" అనడిగాడు రాజన్న.

"మీఅయ్య నీకు కొత్తబట్టలుకొన్నాడ్రా. దాసుగోరి కాడికెళ్ళి అది ఇచ్చిరాపో బిడ్డా"

సంతోషంతో ఎగిరిగంతేశాడు. అంతలోనే ఏదో గుర్తురాగా "మచ్చలమేక" అని ఆగాడు.

"ఎక్కడా డబ్బు పుట్టనేదురా. అందుకని మేకని అమ్మేసిండు"

నీరసంగా కూలబడిపోయాడు రాజన్న.

"అలా అయిపోయావేంరా బిడ్డా..."

"సాయిబుకి అమ్మేరా? దాన్ని కోసేత్తారా? "

"అహ... అబ్బే... సాయిబుకి కాదు. చిన్నమేకని సాయిబుకెందుకమ్ముతాం. పెంచుకోడానికే అమ్మేం"

అపనమ్మకంగా చూశాడు.

"నిజంరా బిడ్డా. నీతోని అబద్ధమాడతానా. బేగెళ్ళి అది ఇచ్చి రారా. రేపటేలకి కుట్టియ్యాలిగందా"

తలాడించి పరుగిచ్చుకున్నాడు.

మర్నాడే వార్షికోత్సవం. స్కూలుకి సెలవు. అంచేత రాజన్న టైలరు దాసుదగ్గర కూర్చుని తన బట్టలు కుట్టించుకుని తెచ్చుకున్నాడు.

గబగబా స్నానం చేసి కొత్త దుస్తులు ధరించాడు.





# ఏరిన ముత్యాలు

★ మనిషి వ్యక్తిత్వానికి గీటురాయి నిజాయితీ.

-మిల్టన్

★ పంచిపెట్టేకొలదీ పెరిగేది మంచితనం ఒకటే.

-ఎమర్సన్

★ నిరాశావాది ఎవడంటే ప్రతీవాడు తనంత చెడ్డవాడని భావించి అందరినీ ద్వేషించువాడు.

-బెర్నార్డ్‌షా

★ ఆలోచించలేనివాడు మూర్ఖుడు. ఆలోచించగోరనివాడు అంధవిశ్వాసి, ఆలోచించ సాహసించనివాడు బానిస.

-కార్నెగి

★ గత చరిత్ర అంతా వర్గాలమధ్య జరిగిన ఘర్షణల చరిత్ర.

-మార్క్స్‌ఎంగిల్స్

★ మనిషికి పెట్టని కూడు చదివిన చదువు కాదు. సంపాదించిన వ్యక్తిత్వం.

-స్పెన్సర్

★ వర్గపోరాటంలేని సోషలిజం అంటే అది బూటకమైనా కావాలి. లేదా పగటి కలలైనా కావాలి.

-లెనిన్

★ ఆసక్తి పరిశోధిస్తుంది. జ్ఞానం కనిపెడుతుంది.

-వుడ్‌వర్డ్

★ వేలకొలదీ నీతులు బోధించుటకంటే ఒక మంచిపనిచేసి చూపించటం మేలు.

-గాంధీ

★ ఇతరుల చేదు అనుభవాలు చూసి జాగ్రత్తపడడం మేలు.

—మసైరస్

★ అజ్ఞానంకన్నా నిర్లక్ష్యం ఎక్కువ కీడు చేస్తుంది.

-ఫ్రాంక్లిన్

★ ప్రగతిని గూర్చిన భయమే మతస్థాపనకు దారితీసింది.

-రస్సెల్

★ నా మతం సైన్సు. జీవితాంతం నేను దానినే ఆరాధిస్తాను.

సి.వి. రామన్

★ జీవితంలో అన్నింటికన్నా ముఖ్యం, ఒక లక్ష్యం కలిగివుండటం.

-గోర్కి

సేకరణ ఎన్.చిరంజీవి




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి 'చతుర' నవల **వేయి నూర్యుళ్లు**

..............................................

**సమీక్షకుని పేరు :** ..............................................

**చిరునామా :** ..............................................

..............................................

..............................................

..............................................

వాడి సంబరం చూసి పరమానందపడి పోయింది తల్లి.

"దొరబాబులాగున్నావురా"

"స్కూలుకెళ్ళి పోతన్నానే"

"కలెక్టరమ్మ ఒచ్చేది రేత్రికి కదా. ఇప్పుడే ఎళ్ళడం ఎందుకురా సోద్యంగాపోతే!"

"మేష్టారుగారు ఒచ్చెయ్యమన్నారు. రంగుల జెండాలవీ కట్టొద్దూ. నువ్వూ అయ్యా రండి. అయ్య పొలంబోతనంట డేమో. నువ్వే చెప్పు. అన్నకి కూడా చెప్పు"

"బెమ్మాండం బద్దలైనా మీ అయ్య ఆగడ్రా. ఇద్దరం వొచ్చేత్తాంరా. నీకన్నా సిన్నపిల్లోడైపోయాడ్రా మీ అయ్యా" అని నవ్విందామె.

చుక్కమ్మ గుడిసెలోకెళ్ళి సూర్యం అన్నని రమ్మని చెప్పమని చెప్పి బయల్దేరాడు రాజన్న.

వాడు స్కూలుకెళ్లేసరికి ఎక్కడలేని హడా విడీ అక్కడే పరచుకునుంది.

డ్రిల్లు మాస్టారి ఆధ్వర్యంలో స్కూలు ఆవరణని శుభ్రంచేస్తూ నీళ్ళుచల్లుతూ రంగు కాగితాల తోరణాలు కడుతూ నానా హైరాన పడుతున్నారు పిల్లలు.

"ఒరే రాజన్నా. లార్డులా వచ్చేవుగాని పార అందుకుని రోడ్డుపక్కవి పిచ్చిమొ క్కల్ని నరికి అవతల పారెయ్" మాస్టారు పురమాయించారు.

"అలాగే సార్"

మరో గంటకి స్కూలు ఆవరణంతా అందంగా మారిపోయింది.

నాటకం వేస్తున్న పిల్లల్నందర్నీ ఓ క్లాసు లోకి తీసుకెళ్ళి ఫైనల్ రిహార్సల్ చేయిం చింది సైన్సు టీచర్. ప్రైజు డిస్ట్రిబ్యూషన్ అయిపోగానే అంతా లోపలిగదిలోకొచ్చి మేకప్పు వేయించుకోవాలని చెప్పింది.

తన వేషంకోసం తెచ్చిన డ్రెస్సూ మీసాలూ కత్తీ చూసి పొంగిపోయాడు రాజన్న.

"నీది భటుడు పాత్ర అయినా చాలా ముఖ్యమైన వేషంరా రాజన్నా. డైలాగులు మర్చిపోకు. భయపడకుండా బాగా చెప్పాలి సుమా. నాటకమంతా నీమీదే ఆధారపడి వుంది" భుజం చరచి మరీ చెప్పిందామె.

తలాడించాడు వుబ్బి తబ్బిబ్బవుతూ.

చీకటిపడింది. ప్రకటించిన టైము దాటి పోయింది. కాని కలెక్టరు రాలేదు. యమ్మెల్యే రాలేదు. పిల్లలూ వారి తల్లిదం డ్రులూ గ్రామస్తులూ వచ్చి ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. యమ్మార్వో, గ్రామ ప్రెసి డెంటూ, చోటామోటా వుద్యోగులూ నాయ కులూ మాత్రం హడావిడిగా తిరుగుతు న్నారు.

రాజన్న స్టేజికి దగ్గరగా కూర్చున్నాడు. కాస్త దూరంలో టేబుల్ మీద అమర్చిన కప్పుల్నీ ఇతర బహుమతుల్నీ ఎంతో ఆరా ధనగా చూస్తున్నాడు. తన పేరు పిలవగానే ఒక్కంగలో వెళ్ళి ప్రైజు అందుకోడానిగ్గాను సిద్ధంగా వున్నాడు.

ఆ దృశ్యాన్ని కళ్ళారా చూడాలని వాడి తల్లీతండ్రీ జనం అడ్డుగోడల్ని ఛేదించు కుంటూ దగ్గరకి రా ప్రయత్నిస్తున్నారు.

"కలెక్టరుగారూ యమ్మెల్యేగారూ వచ్చేస్తు న్నారు. అంతా నిశ్శబ్దంగా వుండాలి" మైకులో ప్రకటించారు.

ఒక్కసారి వుత్సాహతరంగం చుట్టేసిందం దర్నీ.

మందుగుండు సామాగ్రి పేలింది.

పూలవర్షం కురిసింది.

బ్యాండు మేళం మ్రోగింది.

కలెక్టరుగారూ యమ్మెల్యేగారూ డీఈఓ తదితరులు లోపలికొచ్చారు. పరిచయాలూ అల్పాహారాలూ అయ్యాక సభ ప్రారంభ మైంది.



సన్నగా కాస్త పొడుగ్గా వుండి జరీ చీర ధరించి హుందాగా వున్న కలెక్టరమ్మని రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు రాజన్న. తనకి బహుమతి ఇవ్వడానికి నింగినుంచి దిగి వచ్చిన దేవతలా కన్పిస్తోంది వాడికి.

హెడ్మాస్టారు నివేదిక సమర్పించారు.

ఎప్పట్నుంచో ఖాళీగా వున్న నాలుగు టీచర్లపోస్టుల్ని భర్తీచేయమన్నారు. ఆడపిల్లలకి మరుగుదొడ్డి కట్టించమని కోరారు. యస్సెస్సీలో వుత్తీర్ణతా శాతం పెంచడానికి

చేస్తున్న కృషిని వివరించారు. స్కూల్లో చదువుతున్నవారిలోఎనభైశాతం మంది పిల్లలు షెడ్యూల్డ్‌కులాలకీ వెనుకబడిన తరగతులకీ చెందిన వారనీ అంచేత ప్రత్యేక శ్రద్ధ తీసుకుని స్కూలు అభివృద్ధికి చర్యలు తీసుకోమని అభ్యర్థించారు.

ఆయన చెప్పిందే తిప్పి చెప్పేరు యమ్మెల్యేగారు. కాన్వెంటు మోజుని తగ్గించుకోవాలని హితవు చెప్పేరు కూడా.

కలెక్టరుగారు లేచి గొంతు సవరించుకున్నారు. హంస గమనంలా సాగిందామె ఉపన్యాసం.

హైదరాబాదులో తను చదివిన ఖరీదైన కాన్వెంటులోని క్రమశిక్షణ గురించీ విద్యావిధానం బోధనా పద్ధతుల గురించీ చెప్పేరు. అలాంటి క్రమశిక్షణని అలవర్చుకుని వున్నత స్థాయికి చేరుకోవాలంటూ పిల్లలకి ఉపదేశించి ముగించారు.

చప్పట్లు మార్మోగాయి.

ఇక బహుమతి ప్రదానం మొదలవుతుందని ఆశగా అంతా ఎదురుచూస్తున్నారు. ఇంతలో హెడ్మాస్టారు సైంధవుడిలా వచ్చారు.

"సభ ఆలస్యంగా ప్రారంభమైనందున కలెక్టరుగారు వేరే కార్యక్రమానికి వెళ్ళాల్సివున్నందున లాంఛనంగా ఒకరికి బహుమతిచ్చి బహుమతి ప్రదాన కార్యక్రమాన్ని ముగిస్తారు. మిగతావారికి బహుమతుల్ని రేపు ప్రేయర్లో ఇస్తాం"

రాజన్న గుండెల్లో రాయిపడింది. సంగతి బోధపడక వాడి తల్లిదండ్రులు అయోమయంగా చూశారు.

గత ఏడాది యస్సెస్సీలో స్కూలు ఫస్టు వచ్చిన విద్యార్థికి గోడగడియారాన్ని బహూకరించి సభకి నమస్కరించి స్టేజి దిగిపోయారు కలెక్టరుగారు.

ఆమెతోబాటు ప్రముఖులంతా వెళ్ళిపోయారు.

"మన రాజిగాడికి బహుమానం ఇవ్వకుండా ఎల్లిపోతన్నారేంటి కలెక్టరమ్మ" గౌరమ్మ ఆందోళనగా అడిగింది.

"సర్పంచిగోరింటికాడ భోజనాలంట" నీరసంగా జవాబిచ్చాడు ముసిలిగాడు.

సూర్యం మరి ముగ్గురు కుర్రాళ్ళూ వచ్చారు.

"రాజిగాడికి ప్రైజులిచ్చేశారా" ప్రైజు డిస్ట్రిబ్యూషన్ కార్యక్రమం అయిపోయిందని గ్రహించి నిరుత్సాహంగా అడిగాడు సూర్యం. పని తెమలనందున తొందరగా రాలేకపోయాడు.

"ఎంతన్నాయవో సూడరా సూరెంబాబూ. మా బుడ్డోడికి బహుమానం ఈయలేదు' కళ్ళనీళ్ళుపెట్టేసుకుంది గౌరమ్మ.

"అలాగా హెడ్మాస్టార్ని అడుగుతానుండు. రాజిగాడేడీ? "

"ఆ పక్కనే కూకున్నాడు మరి" స్టేజివంక చూపించారు.

వాళ్ళంతా రాజన్నకోసం వెదుకుతున్నారు. కాని వాడక్కడ లేడు.

జనంలోంచి తోసుకుని బయటపడ్డాడు. మధ్యలో ఎవరో బలంగా తోయగా కిందపడ్డాడు. బట్టలు దుమ్ముకొట్టుకుపోయాయి. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. అయినా లెక్కచే

యకుండా విసురుగా బయటికి నడిచాడు.

ఈరోజుకోసం బహుమతి అందుకోబోయే దివ్యక్షణాల కోసం ఎంత ఆత్రంగా ఎదురు చూశాడు! ఎంతగా తపించాడు! ఎన్ని రంగు లకలలు కన్నాడు.

వాటన్నిటినీ వుఫ్‌మని వూదేశారు! ఆ పిచ్చి కగూళ్ళని కసాబిసాతొక్కేశారు!

వుక్రోషం, కోపం తన్నుకొచ్చాయి.

కలెక్టరుమీద, హెడ్మాస్టారుమీద, స్కూలు మీద, అందరిమీదా అన్నిటిమీదా కోపం వచ్చేసింది. ఏదో చేసెయ్యాలనుకున్నాడు కసిగా.

"నాటకంలో వేషాలేసే పిల్లలంతా వెంటనే మేకప్ రూములోకి రావాలి" మైకులో సైన్సు టీచరు విజ్ఞప్తి చేసింది.

రాజన్న కళ్ళు మెరిశాయి.

నాటకంలో తనది ముఖ్యపాత్ర అని టీచరు చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

ఎగ్గొట్టి వెళ్ళిపోతే?

తన వేషంకోసం తెచ్చిన డ్రెస్సూ మీసాలూ కత్తీ కళ్ళముందు కదిలాయి. వాటిని వదులుకునెలా వెళ్ళడం?

ఒక్కక్షణం వూగిసలాడాడు.

నాటకం పోతేపోనీ. మేష్టారు తిడితే తిట్టనీ.

తను వెళ్లిపోవాలి.

తల్లీ తండ్రీ వచ్చారు. సూర్యంఅన్నా తదితరులూ వచ్చి వుంటారు. వాళ్ళంతా ఆశగా చూస్తోంటే కలెక్టరమ్మ బహుమతి ఇవ్వ కుండా వెళ్ళిపోయింది. కొంచెంసేపుండి ప్రైజులిచ్చి వెళ్ళకూడదూ? మరలాటప్పుడు ఆశపెట్టడం దేనికి?

వాడి కళ్ళల్లోకి నీళ్ళొచ్చేశాయి.

మైకులో మళ్ళీ ఎనౌన్స్ చేశారు.

"వూహూ. వెళ్ళనుగాక వెళ్ళను. అంతే" స్కూలు ఆవరణ దాటి పరుగిచ్చుకున్నాడు రాజన్న.

ఊరి పొలిమేర దాటేక ఆగాడు తృప్తిగా గాలిపీల్చుకోడానికి!

ఆ పసివాడి నిరసన గురించి తెలీని గౌరమ్మ, ముసిలిగాడు, సూర్యం తదితరు లంతా రాజన్న కోసం వెదుకుతూనే వున్నారు!

శివస్వామి ఇంకా పూర్తిగా కోలుకోలేదు. విశ్రాంతి చాలా అవసరమనీ అనవసర వుద్రేకాలకి లోనుకావొద్దనీ డాక్టర్ చెప్పేరు. మరోసారి హార్ట్ఎటాక్ వస్తే పరిస్థితి చేజా రవచ్చని కూడా సన్నగా హెచ్చరించారు.

ఆయన కుటుంబ సభ్యులంతా ఆయన పక్కనే కూర్చుని ధైర్యవచనాలు చెబుతు న్నారు, ఓదారుస్తున్నారు. భరోసా ఇస్తున్నారు.

అయినప్పటికీ ఆయన సంతృప్తిపడలే కుండా వున్నారు. ఆనాటి సంఘటన గుర్తొస్తే చాలు ఒంట్లోని రక్తం పరుగులు తీస్తోంది. ఉద్రేకం వూపేస్తోంది!

"ఒరే- వాళ్ళని వదలకూడదురా. కోర్టుకీడ్చాలి. జైల్లో పెట్టించాలి" ఒగురుస్తూ అన్నారు.

"ఇటువంటివి ఆవేశంతో కాదు ఆలోచ నతో సాధించాలి. చూస్తూండండి నేనేం చేస్తానో. మీ కడుపున బుట్టినవాడ్ని మీ వారసత్వం అందుకోవాల్సిన వాడ్ని. చేతికి మట్టి అంటకుండా వాడ్ని దెబ్బతీస్తాను. శివ స్వామి కొడుకునని నిరూపించుకుంటాను"

"అదిరా మాటంటే... ఇప్పుడు నాకు నచ్చావురా అబ్బాయ్. ఇహ ప్రశాంతంగా నిద్రపోతాన్రా"

అన్నట్టుగానే నిద్రపోయారు. శాశ్వతంగా నిద్రపోయారు.

ఆడవాళ్ళు ఘొల్లుమన్నారు.

నారాయణ కళ్ళల్లోకి కన్నీళ్ళు రాలేదు.



నిప్పులొచ్చాయి!

శివస్వామి మరణవార్త విని అందరికన్నా మిన్నగా పెద్దమునసబుగారు ఖంగుతి న్నారు.

క్షణంలో నూరోవంతు సేపు ఆయన గుండె ఆగి తిరిగి కొట్టుకోసాగింది.

శివస్వామిది సహజమరణమైవుండి వుంటే ఇంతగా కలత చెందేవారు కాదు. కొద్దో గొప్పో సంతోషించేవారేమో కూడా.

కాని ఒక కడజాతి కుర్రాడు సవాలు విసిరి వీరంగం చేసేసరికి అంత పెద్ద మోతుబరి గుండెకూడా తట్టుకోలేక ఆగిపో యింది.

ఒక పిపీలకం మహావృక్షాన్ని కూకటివే ళ్ళతో కూల్చేసింది.

రేపటి మహాప్రళయానికిది నాంది కావచ్చు.

పెత్తందారీతనాన్ని ఎదిరిస్తూ ఒక పీల గొంతులేచింది.

దాని పీకపిసికెయ్యాలి!

లేకపోతే ఆ గొంతుతో పదిగొంతులు కల వొచ్చు. ఆ పిమ్మట పిడికిళ్ళు బిగియవచ్చు.

అదే జరిగితే తమ అధికారపీఠం కదిలి పోతుంది.

తను బతికుండగా అలా జరగడానికి వీల్లేదు.

పెద్దమునసబు ఆఖరిశ్వాస విడిచేవరకూ వూరికి పెద్దగానే పెద్దతలకాయగానే వుండాలి. జేజేలందుకుంటూనే వుండాలి!

మీసాల్ని మెలితిప్పారు.

అది చూసి "ఏవిటి నాన్నగారూ" అనడి గాడు వారి చిన్నబ్బాయి.

"ఊరు మన పెద్దరికానికి వ్యతిరేకంగా వూపిరిపోసుకుంటోందిరా. ఆ వూపిరి ఆగి పోవాలి"

"ఆ సూర్యంగాడి గురించా నాన్నగారూ. వాడెంత సత్రకాయి! అసలు వాడలా ఏకు మేకవ్వడానికి ముఖ్యకారకుడు కిష్టయ్య. ఆయన్ని శంకరగిరి మాన్యాలకి పంపించే స్తాను. ఇక సూర్యంగాడి పొగరుకీ ఎగురు ళ్ళకీ తాళంపడుతుంది"

"సరే... ముందా పావుని కదుపు. తర్వాత వీడి సంగతి చూద్దాం"

"ఈ వేడిలోనే వీడి భరతమూ పట్టే స్తాను. చూస్తూండండి"

శివస్వామి చనిపోయారన్న వార్త సూర్యాన్ని కలచివేసింది.

ఆయన చావుకి తనే కారణమన్న అప రాధ భావన అతడి నిలువెల్లా ఆక్రమించే సింది.

తను మరీ అంత దూకుడుగా వెళ్ళకుండా వుండాల్సిందనీ ఆవేశంతో వీరంగం తొక్క కుండా వుండాల్సిందనీ పదేపదే అనుకు న్నాడు.

అంతా తనవంక దోషిలా, ద్రోహిలా చూస్తున్నారనిపించింది. ఎవరి మొఖాల్లోకీ చూడలేకుండా వున్నాడు.

సమయానికి 'నీరుకట్టుడు' పని తగి లింది. పొలం వెళ్ళిపోయాడు. బోదెకడ్డం వేసి తమ కామందు చేలోకి నీళ్ళు వెళ్ళడా నికిగాను కంత తీశాడు. కాలువలోంచి వడిగా వస్తున్న పంటనీరు బోదెద్వారా చేలోకి వేగంగా వెళ్తున్నాయి.

చీకటిపడింది.

ఒకసారి చేనుచుట్టూ తిరిగొచ్చాడు. సగం చేను తడిసింది.

"అర్ధరాత్రికి పూర్తిగా తడిసిపోద్ది" అను కుంటూ కూర్చోబోతోంటే ఓ ఇద్దరు ఆగంత కులొచ్చారు.

"ఎవఁడ్రాడూ. మా చేలోకి నీర్రాకుండా అడ్డుకట్ట వేసిన పింజారీ నా కొడుకెవ్వఁడ్రా" అంటూ రంకె లేశాడొకడు.




"ఎవర్రా మీరూ"

"మేమెవరమో కన్పించట్లేదురా. నీకు కళ్ళు నెత్తికెక్కాయిరా. పెద్ద హీరోననుకుంటున్నావేంట్రా" అంటూ మీదికొచ్చి తోశాడు రెండోవాడు.

తూలిపడబోయి నిలదొక్కుకుని కోపంగా చూశాడు సూర్యం.

"వాడు మాటల్తో దారికి రాడురా" అంటూ కర్ర తిప్పి రెండు దెబ్బలేసేశాడు.

రెండోవాడూ కర్ర ఎత్తి మీదకొచ్చాడు.

ఊహించని పరిణామానికి విస్తుబోయాడు సూర్యం. అంతలోనే తేరుకుని కర్ర దెబ్బల్నుంచి తప్పించుకున్నాడు. అయినా ఒక దెబ్బ తలమీద పడింది. రక్తం వుబికింది.

అయినా లెక్కచెయ్యకుండా తన చేతికర్ర అందించుకుని విరుచుకుపడ్డాడు. అయిదుని మిషాలపాటు హోరాహోరీ పోరాడుకున్నారు. కాని సూర్యం ధాటికి తట్టుకోలేక పరుగిచ్చుకున్నారు వాళ్ళు.

వాళ్ళు వెనుదిరిగి రారని నిర్ధారణ చేసుకున్నాక తువ్వాలు తడిపి తలకి కట్టుకున్నాడు. రక్తమింకా స్రవిస్తున్నట్టుగానే వుంది.

వూళ్ళోకెళ్ళి మందు వేయించుకుంటే మంచిదనుకున్నాడు. కాని తనమీదెవరో దౌర్జన్యం చేశారని తెలిస్తే చాలామంది వుద్రేకపడొచ్చన్పించింది. తన గురించి ఆవేశకావేషాలకి లోనవడం ఇష్టం లేకపోయింది.

మాస్టారింటికెళ్తే మందువేసి కట్టుకడతారనుకుని పెద్దపెద్ద అంగలేస్తూ వెళ్ళాడు.

సూర్యం తలకి తగిలిన దెబ్బచూసి అదిరిపడ్డారు కిష్టయ్య మాస్టారు. ఆయన భార్య కళవళపడిపోతూ కొట్టినవాళ్ళకి శాపనార్థాలు పెట్టసాగింది.

గాయాన్ని తుడిచి మందు వేసి కట్టుకట్టారు.

"కొంతవరకూ అదృష్టమే. కొంచెం పక్కన నెదరగంతకి తగిలివుంటే చాలా ప్రమాదమయ్యేది. ఇంతకీ వాళ్ళెవరంటావు? "

"మన వూరి వాళ్ళు మాత్రం కాదు. నీటి కట్టు గురించేదో మాట్లాడారుగాని అది కేవలం నెపం మాత్రమే. నామీద దాడికోసమే వచ్చారు. ఒకవేళ అయితే"

"అయితే? "

"నారాయణగారు పొరుగూర్నుంచి వాళ్ళని పిలిపించి నామీదకి పంపి వుండొచ్చు"

"నేన్నమ్మను. ఓ పక్కన తండ్రిపోయాడని దహన కార్యక్రమంలో వున్న అతను ఇవాళే ఇలాటి పనికి పూనుకుంటాడనుకోను. ఇంకెవరో కక్షకట్టి చేసి వుంటారు. అనుమానం నారాయణమీదకి పోతుందని భావించి వుంటారు"

"అదీ పాయింటేననుకోండి. కాని అలాటి పనికి పూనుకునే ధైర్యం ఎవరికుండి వుంటుంది? "

"దొంగదెబ్బ తీయడానిక్కావాల్సింది ధైర్యం కాదు, తెగువ. ఏమైనా నువ్వు జాగ్రత్తగా వుండాల్రా సూర్యం"

"నెమ్మదిగా అంటారేవిటి. వూరికి దీపం లాటోడివి. నువ్వు పదికాలాలపాటు చల్లగా వుంటేనే వూరు బావుంటుంది. వాడ బావుంటుంది" మాస్టారి భార్య అంది.

"బాగా చెప్పేవు"

"కాళ్ళూ చేతులూ కడుక్కో సూర్యం. రెండు ముద్దలు ఎంగిలిపడుదువుగాని"

"గుడిసెకెళ్ళి పోతాను"

"ఈ కట్టుతో వెళ్తే మీ అమ్మ శోకాలు తీయదూ! రేపు వెళ్దువుగాన్లే. అప్పటికి కట్టు విప్పేయొచ్చు"

"పొలం వెళ్ళాలిలెండి. లేకపోతే ఎవరైనా కంత మూసేస్తే కామందు కోప్పడతాడు"

కాళ్ళూ చేతులూ కడుక్కొచ్చి కూర్చు న్నాడు. అన్నం వడ్డించింది మాస్టారి భార్య కాంతం.

"శివస్వామి చావుకి నువ్వేకారణమని అంతా చెవులు కొరుక్కుంటున్నారు. లోకులు కాకులంటారందుకే" పిన్నిగారంది బాధగా.

"అది కావాలని చేస్తున్న ప్రచారంలే. అగ్ర కులస్తుల్ని ఎగదోయటానికి చేస్తున్న ప్రయత్నం. ఆ ప్రయత్నాలేమీ ఫలించవులే. శివస్వామి ఎలాటివాడో పాలు తాగే పసివా డినుంచి పండు ముదుసలివరకూ అందరికీ తెలుసు. దుష్టుడి చావుకి సానుభూతి లభిం చదు. అదో పండగవుతుంది. మన దీపా వళే అందుకు నిదర్శనం" మాస్టారన్నాడు.

"జరిగిందానికి నాకు చాలా సిగ్గుగా బాధగా వుంది మాస్టారూ. అవాళ నేను అంత ఆవేశపడకుండా వుండాల్సింది. కాస్త నిగ్రహంతో వ్యవహరించి వుండాల్సింది. నా తొందరపాటువల్ల ఆ పెద్దాయన ప్రాణాలు పోయాయి పాపం" బాధగా అన్నాడు సూర్యం.

అతణ్ణి ఓదారుస్తూ కిష్టయ్య మాస్టార న్నారు, "అందులో నీ తప్పేముందిలే. ఆ పరిస్థితిలో నీ స్థానంలో ఎవరున్నా నీలాగే ప్రవర్తిస్తారు. కళ్లెదుట కన్న తండ్రిని కట్టేసి హింసిస్తోంటే ఎవరు మాత్రం సహించగ లరు చెప్పు? "

"ఆయనకి మేం బాకీ వున్నాం. మరీ అధిక వడ్డీ గుంజుతూ నిలువునా దోచే స్తున్న మాటా నిజమే! అయినా అప్పు అడిగే హక్కు ఆయనకుంది. నిలదీసే హక్కూ ఆయనకుంది. అప్పు తీర్చాల్సింది పోయి అప్పు తీర్చనంటూ ఎదిరించాను. అది తప్పే మాస్టారూ"

"అప్పు ఇచ్చినవాడు వడ్డీ ఆశించడం సహజం. కాని అవతలివారి అవసరాల్ని కేష్ చేసుకోవాలని చూడటంమాత్రం క్షమిం చరాని నేరం. కేవలం అంతటితో ఆగారా? అదీలేదు. కారుచౌకగా మీ శ్రమని కొనుక్కు న్నాడు. పండగలకీ పబ్బాలకీ మీ అమ్మచేత వెట్టిచాకిరీ చేయించుకున్నాడు. అంచేత నువ్వలా మాట్లాట్టంలో తప్పులేదు. మర్చిపో. ఆ సంఘటన పెత్తందార్ల గుండెల్లో అణువిస్ఫోటనం అయితీరుతుంది చూడు! ఇక వూళ్లో ఇలాంటి ఘటనలు పున రావృత్తం కావని ధీమాగా చెప్పగలను"

"ఏమో మాస్టారూ! నావల్ల ఒకరు ప్రాణాలు పోగొట్టుకున్నారే అని బాధగా వుంది"

"నువ్వేం బాధపడక్కర్లేదు. ఆయనేమైనా మంచివాడా ఏమిటీ! వడ్డీల రూపేణ ఎందరి రక్తం తాగేడో! ఎందరి పుస్తెల తాళ్లు చేజిక్కించుకున్నాడో! లేక పోతే అన్ని ఆస్తులెలా కూడబెడతాడు? నోరులేనివారి కడుపుకొట్టిన పాపం ఆయన్నే బలితీసు కుంది. నువ్వు నిమిత్తమాత్రుడివంతే"

ఆ మాటలన్న పిన్నిగారి ముఖంలోకి చూశాడు సూర్యం. ఆవిడ ముఖం ప్రశాం తంగా వుంది. అభయమిస్తున్నట్టుగా వుంది. తేలిగ్గా నిట్టూర్చాడతడు.



కృష్ణమాచార్యుల దంపతులు చెరువు తవ్వటానికి పొలంలో పూజచేశారు. అలి వేలూ, సూర్యం, మేస్త్రీ మొదలైన వాళ్లంతా

కొబ్బరికాయలు కొట్టారు.

అనంతరం తవ్వు కార్యక్రమం మొదలెట్టారు.

సూర్యం అందరికీ హుషారిస్తూ మేస్త్రితో మాట్లాడి సూచనలిస్తూ కలతిరుగుతున్నాడు.

"చూశావా! సూర్యం ఎంత చురుకైన వాడో" కృష్ణమాచార్యులన్నారు భార్యతో.

"నిజమేనండి. పశువులపని కూడా చాలా శ్రద్ధగా చేస్తున్నాడు"

తల్లిదండ్రుల్తోబాటు కాస్సేపు గట్టుమీద కూర్చుంది అలివేలు. ఆమె దృష్టంతా సూర్యంమీదేవుంది!

తవ్వు పని చకచకా జరిగిపోతోంది.

సూర్యం రోజూ వచ్చి పూర్తైన పని వివరాలు చెబుతున్నాడు. పిమ్మట పశువుల పని చూసి వెళ్తాన్నాడు.

అతడ్ని కలవాలని, అతడ్తో మాట్లాడాలని ఎంతో వుబలాటంగా వుంది అలివేలుకి. అతడిలో ఆమెకు చొరవ ధైర్యం సాహసం కలగలిసిన వీరోచిత కథానాయకుడు కన్పిస్తున్నాడు.

ఎవరూ చూడకుండా ఇంట్లోంచి బయటపడి కొంచెం దూరంలో వున్న పశువుల కొట్టం దగ్గరికెళ్ళింది. శాలని శుభ్రపరుస్తోన్న సూర్యం ఆమె రాకకి ఆశ్చర్యపడ్డాడు. ఆనందమూ పడ్డాడు.

"ఏం చిన్నమ్మాయిగారూ ఇలావచ్చేరేంటి కత?"

"నీ కన్నా చిన్నదాన్ని పట్టుకుని అమ్మాయిగారూ బొమ్మాయిగారూ అంటావేమిటి. ముచ్చటగా అలివేలూ అని పిలొచ్చుకదా!"

"హమ్మో! మీ ఇంట్లోవాళ్లు వింటే నా బుర్రచేత రామకీర్తన పాడించేస్తారు"

"నీ జోలికి రావడానికి ఎవర్కైనా ఎన్ని గుండెలుండాలీ!"

"ఇదేం ఆరోపణ?"

"ఆరోపణ కాదు పచ్చి నిజం. గుడిలో అడుగుపెట్టి సంచలనం సృష్టించావ్. శివస్వామిగారి మీద కర్ర తిప్పి నువ్వేంటో తెలియజెప్పేవ్. మా అగ్రహారంలోని ఆడవాళ్లంతా నీ హీరోయిజంగురించే మాట్లాడుకుంటున్నారు తెలుసా?"

"కట్టేసికొడితే పిల్లి కూడా ఎదురు తిరుగుతుంది. అలాగని దానికి పౌరుషం ఎక్కువని అనగలమా? మేమూ అంతే. గొప్పవారి మోచేతినీళ్లు తాగి బతికేవాళ్లం. కలిగున్నమారాజులకి శ్రమని అమ్ముకుని బతికేవాళ్లం"

"ఎందుకలా నిన్నునువ్వు తక్కువ చేసుకుంటావ్? ఇతరుల శ్రమ మీద ఆధారపడి బతికేవాళ్లు సిగ్గుపడాలిగాని కష్టించి పనిచేసి బతికే మీరెందుకు హీనంగా ఫీలవ్వాలి?"

ఆశ్చర్యంగా చూశాడామెవంక. ఆమె తను భావిస్తున్నట్టు అమాయకురాలు కాదనుకున్నాడు. గడపదాటివెళ్లక పోయినా వూళ్లోని విషయాలు తెలుసుకొంటోంది. సమాజస్థితిగతుల్ని అధ్యయనం చేస్తోంది. ఛాందస కుటుంబంలో పుట్టినా అధునాతనంగా ప్రగతి దృక్పథంతో ఆలోచిస్తోంది.

సూర్యానికి చెప్పలేనంత ఆనందం కలిగింది.

"మీరు బ్రాహ్మలకులంలో పొరబాట్న పుట్టినట్టున్నారు?"

"నేనలా అనుకోవట్లేదు. బూజుపట్టిన ఆచార సాంప్రదాయాల్ని అతిక్రమించడానికీ కులవర్గ విచక్షణని అధిగమించడానికీ నేనే మిటో ఋజువు చేసుకోడానికీ అవకాశం కల్పించిందనుకుంటున్నాను"

గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు కొన్ని క్షణాలపాటు.

"ఏమిటా చూపు" చిలిపిగా నవ్వింది.



కలవరపడ్డాడు సూర్యం.

"అమ్మాయ్ ఇక్కడున్నావా? ఎక్కడికెళ్లేవో అని మీ అమ్మ వెదుకుతోంది" అంటూ వూడిపడ్డారు కృష్ణమాచార్యులు.

"నా బుజ్జి ఆవుదూడని సరిగ్గా చూస్తు న్నాడో లేదో చూద్దామని వచ్చాను..."

"నువ్వలాటి భయాలేం పెట్టుకోనక్క ర్లేదు. ఏ సంగతైనా సరే సూర్యానికప్పగిస్తే ఇహ నిశ్చింతగా నిద్రపోవచ్చునుకో. చెరువు తవ్వకం ఎంత వేగంగా జరుగుతోందనీ, అప్పుడే మూడొంతుల పని పూర్తయ్యింది కూడానూ"

"అందులో నాదేముందండీ వుప్పరోళ్లు బాగా తవ్వుతున్నారు"

"అలాగనకు. రౌతుకొద్దీ గుర్రం అన్నారు. ఇక్కడి పనయ్యాక వీధిలోకిరా మాట్లాడాలి. రొయ్య సీడ్ గురించి కంపెనీలో ముందే బుక్కింగ్ చేసుకోవాలంటున్నారు. ఏం చేస్తే బావుంటుందో. ఓ నిర్ణయానికొద్దాం"

"అలాగేనండి"

తండ్రి వెనకే వెళ్తూ సూర్యంవంక చూసింది. అల్లరిగా నవ్వి చేతులూపింది అలివేలు.

కొండెక్కినంత సంబరపడ్డాడతడు!



పనయ్యాక మాస్టారింటికెళ్లి పొద్దుపోయే వరకూ అవీఇవీ మాట్లాడి ఇంటి ముఖం పట్టాడు సూర్యం.

వూరు నిద్రలోకి జారుకుందప్పటికే.

నిశ్శబ్దాన్ని కర్ర చప్పుడుతో చీలుస్తూ నడుస్తున్నాడు.

ఒకామె పక్క సందులోకి మళ్లటం కన్పిం చింది. ఆమె రంగిలా అన్పించి గబగబా నాలుగడుగులు వేసి చూశాడు.





వెన్నెల వెలుగులో రంగి స్పష్టంగా కన్పిం చింది.

కంగారుగా అడుగులేస్తూ వెళ్తోంది.

ఇంత రాత్రివేళ ఆమెకి వూళ్లో పనేమిటో అర్థం కాలేదు. ఏదో అనుమానంరాగా అదేదో తెల్సుకోవాలని ఆమెననుసరించాడు.

ఆమె మరికొంతదూరం వెళ్లి షావుకారుకి చెందిన గడ్డిమేటు దొడ్లోకెళ్లింది.

ఆశ్చర్యబోతూ సమీపించాడు సూర్యం.

అరగంటనుంచి రంగికోసం అక్కడ నిరీక్షి స్తోన్న షావుకారు ఆమెని చూసి మండిప డ్డాడు.

"ఏంటే ఇంతాలస్యం. ఇలా అయితే కుదర్దు" తన బొంగురు గొంతును చీల్చు కుంటూ అన్నాడు.

నల్లగా తారు డబ్బాలా వుంటాడు షావు కారు. నుదుట నామాలూ చేతివేళ్లకి వున్న వజ్రపుటుంగరాలూ మాత్రం మెరుస్తూం టాయి. సీంబోతు కుక్క మొరిగినట్టుం టుంది అతడు మాట్లాడితే.

అతడూ అతడి మాటా చేష్టలన్నీ అస హ్యామే. అయినా మౌనంగా భరిస్తోందామె. కారణం? తనతడి చేతిలో బందీ! బానిస!

"బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడవేంటే"

"మా ఇంటోడు తొంగున్నాక వచ్చేస రికి..."

"నీ ఇష్టం వచ్చినప్పుడొస్తే లాభంలేదు. రమ్మన్నప్పుడు రమ్మన్న టైముకి ఠంచనుగా రావాల్సిందే. లేకపోతే నా బాకీ తీర్చెయ్. ఇంకోదాన్ని చూసుకుంటాను. ఏదో కష్టాల్లో వున్నావుగదాని అవసరమైనప్పుడల్లా అరు విచ్చి ఆదుకొంటోంటే మా బాగుందే బేరం"

"ఈసారికి తప్పుకాయండి. మళ్లీసారి బేగి వచ్చేత్తాను"

"సర్లే" అని ఆయన ఆమె మీదపడి మోటుగా దగ్గరకి లాక్కున్నాడో లేదో "సావు

కారుగారూ!" అన్న గర్జన విన్పించింది.

అదిరిపడ్డారిద్దరు.

బెదిరిన లేడి అయ్యింది రంగి. అరచేతుల్లో మొఖం దాచుకుని ఏడ్వసాగింది.

షావుకారు మొఖం చాటెయ్యబోయాడు గాని వీలు పళ్లేదు. నీళ్లు నములుతూ తలొంచుకున్నాడు.

"మీరు చేస్తున్న పనేంటి? అర్ధరాత్రి ఆడకూతుర్ని..."

"రామరామ... నేనే పాపం ఎరగను. సత్యప్రమాణంగా చెబుతున్నాను"

"మీ దొంగ ప్రమాణాల గురించెవరికి తెలీదు? "

"నిజం నీ కాదు నామీదొట్టు. అదే వచ్చింది. అదే రమ్మంది"

"ఏమే రంగీ. ఈ రంకు వ్యవహారం ఎన్నాళ్లనుంచి సాగుతోంది? నీ మొగుడికి తెలిస్తే నీ బతుకేమవుద్దో తెలుసా? అన్నీ తెలిసి ఇంత నీచానికి ఒడిగట్టేవంటే ఛీ ఇదీ ఒక బతుకేనా? "

"అన్నా..." అంటూ సూర్యం కాళ్లని చుట్టేసి ఏడ్చేసింది.

"ఎందుకు పాల్పడ్డావింత నీచానికి? చెప్పు... చెప్పవే"

వెక్కివెక్కి ఏడుస్తూనే వివరించింది రంగి.

పనులు లేని రోజుల్లో పిల్లలకింత తిండి పెట్టడానికి ఇంట్లో ఏమీలేక షావుకారు పచారీకొట్లో తిండి సరుకులు అరువిమ్మంది. బతిమాలగా బతిమాలగా అరువివ్వడానికి ఒప్పుకున్నాడు గానీ ఓ షరతు విధించాడు. ఆ రాత్రి తనతో గడపమన్నాడు. గత్యంతరం కన్పించక తలొంచిందామె. ఆ తర్వాత కూడా అప్పుడప్పుడూ అరువు తీసుకోవాల్సిరావడం, తనని అతడికర్పించుకోవడం చర్విత చర్వణమైపోయింది.

"మీరు మనిషేనా షావుకారుగారూ? "

"దానికి లేని సిగ్గు నాకెందుకూ" బుకాయించాడు.

"ఛీ! పేదపడుచు ఆకలిని ఆసరా చేసుకుని మీ ఆకలి తీర్చుకుంటారా? సిగ్గులేదూ? అరువిచ్చుకున్న నేరానికి శరీరం, శీలం మీకు అర్పించుకోమంటారా? ఎంత ఘోరం! మీకా వయస్సు కూతురుందే. అయినా మీరింత నీచానికెలా దిగజారేరు? "

"తప్పైపోయింది. ఇంకెప్పుడూ ఇలా చెయ్యను. ఈసారికి వదిలెయ్యి" లెంపలేసుకున్నాడు.

"ఇంకోసారిలా ప్రవర్తించినట్టు తెలిసిందో మీ బండారం బయటపెట్టి మళ్లీ తలెత్తుకోకుండా చేస్తాను. మీ దగ్గరెవరూ సరుకులు కొనకుండా కట్టడిచేసి మీ వ్యాపారాన్ని దివాళా తీయిస్తాను. ఉప్పూ చింతపండూ అమ్ముకోడానికొచ్చినవాళ్లు అంతటితో ఆగండి. దళితులు కదా అన్న అలుసుతో దరిచేరి మా ఆడోళ్ల జోలికి వచ్చారో మీ చేతులు విరిచేస్తాం. మీ కాళ్లు నరికేస్తాం జాగ్రత్త!"

"బుద్దొచ్చింది. ఇంకెప్పుడూ ఇలా చెయ్యను. వదిలెయ్యి" వూడిపోతున్న పంచెని దోపుకుంటూ పరుగిచ్చుకున్నాడు షావుకారు.

'పొద్దుట లేవగానే ఏ వెధవ మొహం చూశానో ఏమో ఇవాళన్నీ అపశకునాలే. అవమానాలే' అని గొణుక్కోసాగాడు వాళ్ల వెళ్లాక!

★ ★ ★

సూర్యం, జాన్, మరో ఇద్దరు యువకులూ యమ్మార్వో ఆఫీసుకెళ్లారు.

యమ్మార్వోని కలవాలని బిళ్ల బంట్రోతుతో చెప్పేరు.

అతడు వాళ్లని ఎగాదిగా చూశాడు.

"ఏ వూరు? "

చెప్పేరు

"ఏం, పని"

చెప్పేరు.

"కాగితాలివ్వడానికొచ్చారా సరిసరి. బల్ల మీద కూర్చోండి. అయ్యగారి అనుమతి లభించగానే పిలుస్తాను"

కూర్చున్నారు. మధ్యాహ్నమైపోయింది. వారి తర్వాత ఎందరో వచ్చారు. లోపలికె ళ్లారు. లోపల్నుంచొచ్చి వెళ్లిపోయారు.

"చేతులు తడపందే ఈ పూజారి వరమి చ్చేట్టులేడు" జాన్ అన్నాడు.

"అడిగి చూస్తానుండు"

సూర్యం వెళ్లి అడిగాడు. పొద్దుట్నుంచి నిరీక్షిస్తున్నామనీ వెనుక వచ్చినవాళ్లు ముందెళ్లి పోయారనీ అడిగాడు. అలా అడి గినందుకు బంట్రోతుకి కోపం వచ్చింది. అసలు లోపలికి పోనివ్వను పొమ్మన్నాడు.

"తిరిగెళ్లిపోతాంగాని నీ పేరు చెప్పు"

"ఎ..... ఎందుకు? "

"మమ్మల్ని తిట్టావని కేసుపెట్టడానికి"

"అయ్యబాబయ్య బాబోయ్. ఇప్పుడు నేనే వన్నాననీ? "

"పొమ్మంటూ తిట్టేవుగా"

"తప్పైపోయింది. బాబ్బాబు ఆగండి. చిటికెలో పంపించేస్తాగా"

మాటప్రకారం మరి రెండు నిమిషాలకే లోపలికి పంపించాడు.

"దండాలండి"

"చూడూ... ఆ దండాలు... ఏంపనీ"

"మేం దళితులమండి. మా వూళ్లో వున్న బంజర్ని పేదలకి పంచమని కోరడాని కొచ్చాం"

"చూడూ, ప్రతిదానికీ కొన్ని రూల్సుం టాయ్. రూల్స్ ప్రకారం చేస్తాం. వెళ్లొచ్చు"

"ఈ మహజరుని మీరోసారి పరిశీలిస్తే"

"చూడూ.. పిటిషన్ ఇచ్చావుగా రూల్సు ప్రకారం చూడాల్సినవాళ్లు చూసి, రాయా ల్సింది రాస్తార్లే"

"నిరుపేదలం నిమ్నజాతివాళ్లం. మీరు కరుణించి ఆ భూమి మా వాళ్లకి పంచిస్తే మీ పేరు చెప్పుకుంటాం"

"చూడూ, నేనీ సీట్లో కూర్చున్నది దయా దానం పంచడానిక్కాదు. రూల్స్ ప్రకారం నడుచుకోడానికి"

"మీరు రూల్సు మనిషని తెలిసే వచ్చేం. మాకు న్యాయం చెయ్యాలి. వూరి మోతు బర్లు బంజర్ని ఆక్రమించుకోకుండా చూసి ఆ భూమికి పట్టాలిప్పిస్తే చెరువు తవ్వు కుంటాం"

"చూడూ రూల్సు ప్రకారం ఏంచెయ్యాలో అది చేస్తాం. ఎలా చెయ్యాలో అలా చేస్తాం. మీరెళ్లొచ్చు"

"మా వోళ్లకి ఇళ్లుకట్టిస్తామన్నారు. శ్మశానం పక్కన వద్దన్నాం. మళ్లీ ఆ వూసే ఎత్తలేదండెవరూ, మీరు కాస్త ఆ ఫైలు చూసి.. "

"చూడూ, ప్రభుత్వం దయదలిచి ఏదో చెయ్యాలని చూసినప్పుడు మోకాలొడ్డితే ఎలాగోయ్. ఈ రూల్సున్నాయే ఒకసారి బ్రేకులు పడితే మళ్లీ కదలవు. వెళ్లి యమ్మేవోని కలవండి"

"వస్తాంసార్, నమస్కారం"

కొంచెం నిరుత్సాహంగా బయటికొచ్చారు.

"ఆయన వాలకం చూస్తే మనకి సాయం చేస్తాడనిపించట్లేదు" జాన్ అన్నాడు.

"ఎలచ్చన్లముందే కాగితాలు కదుల్తాయి. ఆ తర్వాత నిద్రోతాయిరా" మరో యువకు డన్నాడు.





"ఎలాగూ ఇంతదూరం వచ్చేంగనుక మన యమ్మెల్యేని కలిసి సాయపడమని కోరదాం" సూర్యం అన్నాడు.

"మనల్ని గుర్తుపడతాడా అని"

"ఆయన మనం గుర్తుపట్టలేనంతగా మారిపోయాడేమో అది చూడండి ముందు'

జాన్ మాటలకి నవ్వుతూ యమ్మెల్యేగారింటికెళ్లారు.

గేటుకి తుప్పుపట్టిన పెద్ద తాళంకప్ప వేళ్లాడుతోంది. పక్కనేవున్న కిళ్లీ షాపులో కనుక్కున్నారు.

"ఎన్నికలైన మర్నాడే ఎళ్లిపోయేరుగా. హైదరాబాదులో మేడకట్టేరు. ఏవో బిజినెస్సులు చేస్తున్నారంట. ఇంక ఇటుకేసి రారనుకుంటున్నారు"

"మళ్లీ ఎన్నికల ముందు తప్పకుండా ప్రత్యక్షమవుతారు. కావలిస్తే పందెంకాస్తా" జాన్ అన్నాడు.

"నీకెలా తెలుసుబాబూ" షాపతను అడిగాడు.

"నాకు వూహ తెలిసినప్పట్నుంచీ జరుగుతున్న కథే ఇది"

"అవున్రా జానూ, ఈనాటి నాయకులు జనంలోంచి ఎదగరు. పైనుంచి దిగుమతి అవుతూంటారు. ఒక్క రాత్రిలో నాయకులైపోతూంటారు. అంతవరకూ వ్యాపారాలో సారా కాంట్రాక్టులో బ్రోకర్‌పనులో గూండా గిరీయో కాకాపన్లో చేసేవాళ్లంతా అర్జంటుగా నాయకుల వేషాలేసుకొచ్చేస్తారు. వంగివంగి దండాలు పెడ్తారు. రంగుటద్దాల్లో భవిష్యత్తు చూపిస్తారు. మీ వుద్ధరణే మాకు ముఖ్యమంటారు. నినాదాలిస్తారు. మనతో కూర్చుని తింటారు. నమ్మకమైన కబుర్లు చెబుతారు. మాయచేస్తారు. ఓట్లు దండుకుంటారు. అమృతం త్రాగేసి వెళ్లిపోతారు. ఆ పిమ్మట వాళ్లకి వాళ్ల ఆస్తులూ వాళ్ల వాటాలూ వాళ్ల ప్రయోజనాలూ వాళ్ల పిల్లలూ వాళ్ల బాగులూ తప్ప మరేమీ కన్పించవు. మరెవ్వరూ కన్పించరు" సూర్యం అన్నాడు కాస్త ఆవేశంగానే.

"ఇలా ఎంతకాలం? "

"జనం చైతన్యవంతులయ్యేవరకు!"

"స్వతంత్రం వచ్చి యాభై ఏళ్లయ్యింది. ఇప్పటికి ఇదిగో సరైన తిండిగుడ్డా గూడూ లేకుండా వున్నాం. ఇంక అలాటి రోజు రావాలంటే ఇంకెన్ని పదుల సంవత్సరాలు పడుతుందో"

నిరుత్సాహం వద్దు, నిరాశవద్దు. మార్పు అనివార్యం. మంచి కాలం అతి త్వరలో రావడం ఖాయం. అందుకోసం మనం మన వంతు కర్తవ్యం నిర్వర్తించాలి. చీకట్ని తిట్టుకుంటూ కూర్చుంటే ఒరిగేదేమీ వుండదు. ప్రయత్నమనే చిన్న దీపాన్ని వెలిగిద్దాం. ఆ వెలుగుతో జగాన్ని నింపేద్దాం"

"మా బాగా చెప్పేవు బాబూ, నీ పేరేంటి" కిళ్లీకొట్టతను అడిగాడు బడ్డీలోంచి బయటికొచ్చి తేరపారి చూస్తూ.

"సూర్యం!"

★ ★ ★

భోంచేసి చెరువుగట్టుకెళ్లాడు సూర్యం.

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో మాలపల్లెలోని యువకులంతా చెరువుగట్టుకి చేరతారు. పంచాయితీ రేడియో కార్యక్రమాలని వింటారు. ఆ తర్వాత పిచ్చాపాటీ మాట్లాడుకుంటారు.

సూర్యం వెళ్లేసరికి జాన్‌తో గట్టిగా వాదిస్తోన్న ఇద్దరు కుర్రాళ్లు అతణ్ణి చూసి మాటలాపేశారు.

"సంగతేవిట్రా" సూర్యం అడిగాడు.

"ప్రతీదానికీ లీడర్లా తయారవుతావుగా. పెద్ద కులపోళ్లు మనోళ్లని సంపేత్తన్నా నోరు మూసుక్కూర్చున్నావనుకుంటన్నాం"



దావీదు అన్నాడు.

"విషయం సరిగ్గా చెప్పకుండా ఆ డొంకతిరుగుడేమిట్రా" జాన్ కసురుకున్నాడు.

"మనోళ్ళని చంపడం ఏవిటి? అసలేం జరిగింది? " ఆదుర్దాపడ్డాడు.

"ఏదో జరిగిందిలే. నువ్వు వేలు పెడితే గుడి గొడవలానే మధ్యలోనే తుస్సుమంటుంది. పెద్దోళ్లు సత్తామని బెదిరించారని నోర్మూసుకుని కుర్రాళ్ల పరువు తీసినోడివి. ఇందులో కూడా తలదూర్చడం ఎందుకులే"

"నువ్వనుకుంటున్నట్టు గుడిసంగతి నేను మర్చిపోలేదు దావీదూ. డొంకసంగతి తేల్చాలనే తీగలాగాను. ప్రతిస్పందన చూశావుగా. మెల్లగా పెద్దవాళ్లని ఒప్పిస్తాను. మనవాళ్లనే కాదు మాల, మాదిగ, ఎరుక, యానాది బడుగుకులాలవార్నందర్నీ కూడగడతాను. ఆలయప్రవేశం చేయిస్తాను. ఆరోజు అతిత్వరలో రాబోతోంది"

సూర్యం మాటలకి ఈల వేశాడు జాన్. "సూర్యం మాటంటే మాటే. మొన్న గుళ్లోకెళ్ళినా నిన్న శివస్వామిమీద ఎదురుతిరిగినా మనోళ్ళకోసం యమ్మార్వోని కలిసినా అవన్నీ మన సూర్యానికే సాధ్యంరా. ఇప్పటికైనా మనోణ్ణి అర్థంచేసుకోండి. జరిగిందేంటో చెప్పండి. ఏం చేస్తాడో మీరే చూడండి"

"బొందు చల్లయ్య తల్లిని ఎంకటరెడ్డిగారు చావగొట్టేరు" దావీదు అన్నాడు మెల్లగా.

"ముసిల్దానికెలా వుంది? "

"ఒక్క తాపు తన్ని కర్రతో వీపుమీద కొట్టేట్ట. వీపంతా వాచిపోయింది. వెన్ను విరిగిపోయిందేమో అంటున్నారు"

"అంత దౌర్జన్యం చెయ్యడానికి ఆ ముసిల్ది చేసిన నేరమేమిటి? "

"మనం లోకువ గనుక!"

"అంటే? అసలేం జరిగిందో చెప్పరా దావీదూ"

"ఎంకటరెడ్డిగారి తోటకి దగ్గర్లో కళ్ళం బాగుజేస్తాంది ముసిల్ది. దాహం ఏస్తేనూ తోటలోని చెర్లో దిగి నీళ్లు తాగిందంట. అది పెద్ద తప్పైపోయింది. 'అత్తెరి మాలముండవి నా చెర్లో దిగి నీల్లు తాగుతావా? ' అని బండబూతులు తిడుతూ చావబాదేడు"

చాలా దారుణమన్పించిందతడికి. దాహం తీర్చుకోడానికి ఒక ముసలిది చెరువులో దిగి నీళ్లు తాగితే చావుదెబ్బ కొడతారా? ఆయన మనిషేనా?

"ముసిల్దాన్ని చూసొద్దాం పదండి"

కుర్రాళ్ళంతా బొందుచల్లయ్య ఇంటికెళ్ళారు. అతడి తల్లి బాధ తాళలేక కేకలు పెడుతోంది. డాక్టరు మందిచ్చి కట్టుకట్టి వెళ్ళాడు. ఇరుగు పొరుగు ఆడవాళ్ళు వెంకటరెడ్డిని శాపనార్థాలు పెడుతున్నారు.

ముసిల్దాన్ని చూసేసరికి సూర్యం మనస్సు వికలమయ్యింది. తనువు భగ్గున మండింది.

ఆకుమడికి మాత్రమే పెట్టే ఆ చెరువు నీళ్లు తాగినందుకింత శిక్షా! కేవలం మాలపల్లెలో పుట్టినందుకే ఆ చెరువు నీళ్లు తాగడానికి అనర్హురాలైపోయిందా! ఆమె తాకితేనే నీళ్లు మైలపడిపోయాయా! ముసిల్దన్న సానుభూతి కూడా లేకుండా ఇంత దారుణంగా కొడతారా? ఏ హక్కు, ఏ బలం, ఏ అధికారం చూసుకుని ఇంతకి సాహసించాడాయన?

అతడి మెదడు కుతకుత ఉడికిపోతోంది.

"ఏం జేద్దామంటావురా? " ఎవరో అడిగారు.

"దెబ్బకి దెబ్బ తీసేయడవే తగిన మందు. మళ్ళీ నాయాళ్లు మాలోడి నీడన్నా హడలి చావాలి" తొడగొట్టేడు జాన్.

"ఇది చాలా సున్నితమైన విషయం. కుల వివక్షకి సంబంధించిన సమస్య. ఆవేశప




డటం మంచిది కాదు. మాస్టార్ని కలిసి ఆయన సలహా తీసుకుందాం"

"కులాల గొడవల్లోకి ఆయన్ని లాగటం ఎందుకురా. మన పెరుమాళ్లుని కలిస్తే మంచిది. ఎంతైనా మనోడు మనోడేకదా" దావీదన్నాడు. మరికొందరు బలపరిచారు.

పెరుమాళ్లమీద సూర్యానికి నమ్మకం లేదు. అయినప్పటికీ పదుగురి మాటని త్రోసిపుచ్చేకన్నా అదెంత ఉపయోగకరమో తేల్చుకోవడమే మంచిదనుకున్నాడు.

"తెల్లారితే మళ్ళీ అంతా పనుల్లోకి దిగాలి కదా. ఇప్పుడే వెళ్ళి కలిసొద్దాం. పదండి"

ఓ పదిమంది కదిలారు.

★ ★ ★

పెరుమాళ్లు ఒకప్పుడు హరిజన నాయకుడు. మాజీ యమ్మెల్యే. కులపుకోటాలో ఆయనకి మంత్రిపదవి రాబోయిందిగాని మరోమంత్రి కుతంత్రంవల్ల చేజారిపోయింది. లేకపోతే మాజీమంత్రిగా మిగిలిపోదురు.

కొన్నేళ్ళక్రితం ఆ గ్రామసర్పంచి పదవిని రిజర్వ్‌డ్ కేటగిరికి కేటాయించడంతో పెద్ద మునసబుగారాయన్ని సర్పంచిని చేశారు. ఆ పదవీకాలం ముగిసేసరికి అసెంబ్లీ ఎన్నికలొచ్చాయి. ఆ పక్క నియోజకవర్గాన్ని హరిజనులకి కేటాయించారు. కిందా మీదా పడి ఆ నియోజకవర్గానికి టిక్కెట్టు సంపాదించుకున్నారు. అక్కడి జనానికి ఆయనెవరో తెలీకపోయినా పార్టీ గాలి పుణ్యమా అని గెలిచేశారు.

తను గొప్ప హరిజన నాయకుడ్నని సభల్లో చెప్పేవారు. ఆయన పార్టీవారు కూడా అనేవారు. కాని హరిజనులకెవ్వరికీ పిసరంత సాయం చెయ్యలేదు. ఒక్కసారే అంతస్తు పెరిగిపోయేసరికి వాళ్ళెవరైనా తనని కలవడానికొస్తే ఇంట్లో వుండే లేనని చెప్పించేవారు. మరీ తప్పనప్పుడు 'చేద్దాం చూద్దాం'లతో సరిపెట్టేవారు. దాంతో వాళ్ళకాయనమీద ఆశలు కరిగిపోయి అటువైపె ళ్లడం మానుకున్నారు.

కాని అయిదేళ్లలో ఆయన ఆస్తుల్ని ఇరవై రెట్లు పెంచుకున్నారు. కారు కొనుక్కున్నారు. కొడుకులకి ఆఫీసర్ల ఉద్యోగాలు వేయించారు. వూరికి దూరంగా తమ పొలాల మధ్య ఒంటిస్తంభం మేడలాంటి మేడ కట్టుకున్నారు.

ఆయనమీద చాలా ఆరోపణలు రావడం వల్లా, నియోజకవర్గంలో అసంతృప్తి ఎక్కువగా వుండటంవల్లా తదుపరి ఎన్నికల్లో ఆయనకి టిక్కెట్టు లభించలేదు.

అయినప్పటికీ తన మేడలో భార్యతో కలిసి సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు, అందర్తోనూ అన్ని రకాల సంబంధాలూ వదిలేసుకుని!

సూర్యంవాళ్ళూ వెళ్లేసరికి పెరుమాళ్లు నిద్ర పోతున్నారు. వీళ్ళంతా గట్టిగా పిలిచేసరికి లేవక తప్పలేదు. విసుగూ కోపం రాగా కసురుకుందామని తలుపులు తీశారు. తీరా ఎక్కువమంది వుండేసరికి ముఖం ప్రసన్నంగా మార్చుకుని ఆహ్వానించారు. ఆయన వెనకే వచ్చిందాయన భార్య.

"నమస్కారమండి"

"రండి బిడ్డలూ రండి" అంటూ పిలిచి కూర్చోమని చెప్పారు. కుర్రాళ్ళు ఎవరెవరి బిడ్డలో అడిగి తెలుసుకున్నారు.

"మీ అందర్నీ చూసినందుకు చాలా సంతోషంగా వుంది. ఏం పనిమీద వచ్చారు బిడ్డలూ"

"చందాల కొచ్చారేమో" ఆయన భార్య అంది.

"చందా కోసం నా బిడ్డలు ఇంత దూరం రానక్కర్లేదే. తలో చెయ్యీవేస్తే కావల్సినంత పోగవుతుంది. ఏవంటారు బిడ్డలూ"

వెంకటరెడ్డి బొందుచల్లయ్య తల్లిని

కొట్టడం, ఆమె ప్రస్తుత పరిస్థితీ అంతా వివరంగా చెప్పాడు. "మీరు కలగజేసుకుని ఏదో పరిష్కార మార్గం చూస్తారని కొండంత ఆశతో వచ్చేం" అని ముగించాడు సూర్యం.

రెండు నిమిషాలు ఆలోచించాక అన్నారు పెరుమాళ్లు, "బిడ్డలూ! ఆ ముసిల్దాని పరిస్థితికి చాలా బాధగా వుంది. నా సానుభూతిని బొండు చల్లయ్యకి తెలియజేయండి. ఆవిడ త్వరగా కోలుకోవాలని ప్రభువుని ప్రార్థిస్తున్నాను. ఇక విషయానికొస్తే ఆవిడ మన కులస్తురాలు గనుక ఆవిడదే రైటని చెప్పను. నాదంతా సమదృష్టి. అందర్నీ సమంగా చూస్తాను. అందుకే నన్ను చాలా పెద్దమనిషి అనేవారు ఆరోజుల్లో. మీరు కూడా అలాంటి సమదృష్టిని అలవర్చుకోవాలి బిడ్డలూ. అప్పుడే మనం పైకొస్తాం. మన మాటకి విలువ లభిస్తుంది..."

"బాగా చెప్పారు" ఆయన భార్య అభినందించింది.

"ఇప్పుడు జరిగిందేవిటో తరచి చూద్దాం. వెంకటరెడ్డిగారు నాకు బాగా తెలుసు. ఆయన పెద్దమనిషి. పెద్ద రైతు. ఆ సంగతి మీకూ తెలుసుకదా బిడ్డలూ. మీకు తెలీదేమోగాని ఆయనకి మనమంటే ఎంతో సానుభూతి అన్న సంగతి నాకు బాగా తెలుసు. అటువంటాయన ఒక ఆడదాన్ని-అందునా ముసిల్దాన్ని కాలితో తన్నుతారా? కర్రతో చావగొడతారా? నేన్నమ్మను. మీరెలా నమ్ముతున్నారో నాకర్థం కావట్లేదు బిడ్డలూ"

"సొయానా నా కళ్ళతో సూశానండి. పాతిగ్గజాల దూరంలోని చేలో పనిసేత్తన్నానండి" దావీదు అన్నాడు.

అందరికీ వూతం వచ్చింది. ఇప్పుడేవంటారన్నట్టు చూశారు.

"సరే... నువ్వు చూశానంటున్నావు గనుక ఆయన కొట్టారనే భావిద్దాం. కాని ఎందుక్కొట్టుంటారో నువ్వు చూశావా? చూళ్ళేదు. ఆ ముసిల్ది చెప్పింది నమ్మేశావు. వెంకటరెడ్డిగారులాంటి పెద్దమనిషి సరైన కారణం లేకుండా కొడతారంటారా బిడ్డలూ? "

"కాని ముసిల్ది..."

"అలాగే చెప్పుద్ది బిడ్డా. దొంగతనం చేసి పట్టుపడ్డవారు ఎన్నెన్నో చెబుతారు. అవన్నీ నిజమని నమ్మేస్తే ఎలాగ? తప్పు బిడ్డలూ. అపార్థాలు చేసుకోవద్దు. నేన్చెప్పేది జాగ్రత్తగా వినండి. మనం మాలోళ్లం. కూలోళ్ళం. వూరి పెద్దల దయమీద ఆధారపడివున్నాయి మన బతుకులు. వారిని ఎదిరిస్తే మనకి ముద్ద దొరకదు. మనకి ఓర్పు కావాలి. సహనం కావాలి. మనది అహింసా సిద్ధాంతమని మర్చిపోవద్దు. ఓ చెంపని కొడితే రెండో చెంప చూపించమన్నారు గాంధీజీ. మన ఆవేశంవల్ల నష్టపోయేది మనమే. ఒకవేళ వెంకటరెడ్డిగారు నిజంగా తప్పుచేసి వుంటే ఆయనే తెలుసుకుంటారు.

మన మౌనాన్ని చూసి పశ్చాత్తాప్పడతారు మరెప్పుడూ అలాంటిపని చెయ్యరని గట్టిగా చెప్పగలను..."

"అమ్మో! అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు చెప్పారు. మీకు నా దిష్టే తగిలేట్టుంది" మురిసిపోయిందాయన భార్య.

"కాని... ఇంత అవమానాన్ని భరించి వూరుకుంటే దాన్ని అలుసుగా తీసుకుని రేపింకో దౌర్జన్యం చెయ్యరనేవిటి? " జాన్ అడిగాడు కొంచెం రోషంగానే.

"బిడ్డా! మా చిన్నప్పుడు ఎన్ని అవమానాలు, ఎన్ని ఆంక్షలు, ఎన్ని వివక్షలు భరించామో తెలిస్తే నువ్విలా మాట్లాడవు. అప్పట్లో మాలపల్లి వూరికి దూరంగా వుండేది. రొచ్చుకుంటలా వుండేది పల్లి. రోడ్లూ, లైట్లూ ఏవీ వుండేవికావు. తలెత్తుకుని వూళ్లో నడవడానికి కూడా వుండేది కాదు. చెరువులో నీళ్ల తెచ్చుకోడానికి వీలుండేది కాదు. దూరం దూరంగా భయం

భయంగా బతకాల్సొచ్చేది. అటువంటిది ప్పుడు మనకెన్నో ఎన్నో సౌకర్యాలొచ్చాయి. చదువులొచ్చాయి. ఉద్యోగాలొచ్చాయి. పద వులొచ్చాయి. చక్కని బతుకులు వచ్చాయి. ఇవన్నీ కేవలం ప్రభుత్వంవల్ల అయిన పనులు కాదు. మార్పు- మార్పువల్ల వచ్చిన మార్పు. అగ్రకులాల వారిలో వచ్చిన మార్పు. వారి దృష్టిలో దృక్పథంలో వచ్చిన మార్పు. అందుకే ఇవాళ పట్నాల్లో కులం గిలం లేకుండా అందర్తో కలిసి మెలసి వుండగలుగుతున్నాం. అంత గొప్ప మార్పు పల్లెల్లో రానిమాట నిజమే. కాని తప్పకుండా వస్తుంది. కాలం తెచ్చే ఆ గొప్ప మార్పు కోసం, ఆ మంచిరోజు కోసం ఎదురు చూద్దాం బిడ్డలూ. ఈలోగా తొందరపడి అనర్థాలని కొనితెచ్చుకోవద్దు"

"పదవి పోయినా మీలో పవరు తగ్గ లేదు. అసెంబ్లీలో ఉపన్యాసం ఇచ్చినట్టు ఎంత బాగా మాట్లాడేరూ" మెచ్చుకుంది పెరుమాళ్ళు భార్య.

"ఇక వెళ్ళిరండి బిడ్డలూ చాలా రాత్ర య్యింది. మీరంతా చందాలేసుకుని ఆ ముసిల్దాన్ని మంచి డాక్టరుకి చూపించండి. మనకి మనమే సాయం చేసుకోవాలి బిడ్డలూ"

ఆయన లేచారు.

మిగతావాళ్ళూ లేచారు. వెళ్ళొస్తామని చెప్పడానికి నోర్రాక మౌనంగా నమస్కార బాణాలు వదలి వెనుదిరిగారు.

వారికంతా అయోమయంగా వుంది.

★ ★ ★

ఆ మర్నాటికి ముసిల్దాని పరిస్థితి మరింత విషమించింది. మగతగా పడివుం దామె. డాక్టరొచ్చి ఇంజెక్షన్ చేసి వెళ్ళాడు.

పొద్దుట లేస్తూనే వెళ్ళి ఆమెని చూసి ఓదార్చి ధైర్యం చెప్పి పొలం వెళ్ళాడు సూర్యం.

చెరువు తవ్వకం పూర్తయ్యింది. ఉప్పు నీరు పెట్టి రొయ్యపిల్ల వెయ్యడానికి అను వుగా తయారుచేశారు. ఫీడ్ మందులు నిల్వవుంచడానికీ, కాపలా సమయంలో పడుకోడానికీ వీలుగా చెరువుగట్టుమీద చిన్న పాక నిర్మించారు. మరో కూలోడి సాయంతో పాకకి తాటాకు కట్టాడు సూర్యం.

సాయంత్రం పశువులపని చూసి పాలు పితుకుతోంటే వచ్చింది అలివేలు.

"నీతో బోల్డు సంగతులు మాట్లాడాలనొ చ్చాను. ఇంట్లో ఎవ్వర్లేర్లే. అమ్మ గుడిలో నాన్నగారి పురాణశ్రవణం వినడానికెళ్ళింది. అవునూ ఏవిటలా మూడీగా వున్నావ్? "

"బాగానే వున్నానే"

"నా దగ్గర బుకాయించలేవుగాని ఏం జరి గిందో నీ మనస్సుని కలచేస్తోన్న ఆందోళన ఏమిటో చెప్పు"

రాత్రి జరిగిందంతా వివరించి చెప్పాడు.

"నువ్వేదో ధైర్యవంతుడివనుకున్నాను. చూస్తోంటే నీలో చీమూ నెత్తురూ కూడా వున్నట్టు లేవే!"

అదిరిపడి చూశాడు.

"ఒక అన్యాయాన్ని ఒక అమానుషాన్ని ఒక దౌర్జన్యాన్ని నిరసించకపోతే నిలదీయ లేకపోతే మనలో వుడుకునెత్తురెందుకు? "

అతడి గుండెలకి సూటిగా తగిలాయి ఆమె మాటలు!

"ఆఖరికి జంతువులు కూడా ఆత్మరక్షణ కోసం ఎదురు తిరుగుతాయి. చివరికంటా పోరాడతాయి. మీరేవిటిలా మన్నుతిన్న పాముల్లా బుస కూడా కొట్టలేని బురదపా ముల్లా పడివున్నారు? "

అతడి గుండెలమీద సమ్మెట పోటులై తగిలాయామె మాటలు!

"మీ మౌనాన్ని బలహీనతగా భావిం చొచ్చు మీ మంచితనాన్ని పిరికితనంగా

తలచొచ్చు దీన్ని అలుసుగా తీసుకుని విజృంభించొచ్చు మిమ్మల్ని అణగదొక్కి పాదాక్రాంతుల్ని చేసుకోడానికి వీరవిహారం చెయ్యొచ్చు అలా జరక్కూడదంటే మేం పిల్లి పిల్లలం కాదు పులిబిడ్డలం అని నిరూపించుకోవాలి. అన్యాయాన్ని ప్రశ్నించడం. దౌర్జన్యాన్ని ఎదిరించడం నేర్చుకోవాలి. హక్కులనేవి వూరికే రావు. అవసరమైతే వేడినెత్తురు తర్పణచేసి వాటిని చేజిక్కించుకోవాలి"

అతడి గుండె ఉక్కులా మారిందామె మాటలకి!

"నా పోరబాటేమిటో తెలిసింది. నా కర్తవ్యం బోధపడింది"

వాడిగా వేడిగా వచ్చాయి మాటలు.

పాలచెంబు ఆమెకందించి కృతజ్ఞతాపూర్వకంగా చూసి పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ మాలపల్లె వెళ్ళాడు సూర్యం.

బొండు చల్లయ్య ఇంటి పరిసరాలు వెళ్ళేసరికి ఏడ్పులు విన్పించాయి.

ఇంటిముందు ముసిల్దాని శవం!

అతడి కళ్ళు అగ్నిగోళాలయ్యాయి. ఆవేశం బుసలు కొట్టింది.

కర్ర అందుకుని "పదండి" అన్నాడు.

ఆ మాటకోసమే ఎదురుచూస్తున్నారు. పాతిక ఇరవైమంది యువకులు కర్రలూ కావడిబద్దలూ అందుకుని కదిలారు.

ముసలివాళ్లు అడ్డొచ్చారు. ఏదో చెప్పబోయారు.

ఎవరూ విన్పించుకోలేదు. ఆగనూ లేదు.

కవాతుకి కదిలిన సైన్యంలా కదిలారు.

సూర్యం ముందు నడుస్తోంటే కర్రలతో విన్యాసాలు చేస్తూ అనుసరించారంతా.

వూరు విస్తుబోయింది. జనం వణికిపోయారు.

తలలు తెగిపడ్తాయా? రక్తం ఏరులైపారుతుందా?

ఏమో! అందరి గుండెల్లో దడ!

ఆ దృశ్యాన్ని పెద్ద మునసబుగారూ చూశారు.

వాళ్లు బలప్రదర్శన చేస్తున్నట్లుగా అన్పించింది.

కాళ్ళకింది భూమి కదుల్తున్నట్టుగా అన్పించింది.

నిలబడే శక్తి లేక వాలుకుర్చీలో కూర్చుండిపోయారు.

ఆవాళ కొడుకు నియమించినవాళ్ళు పిరికిపందల్లా పారిపోయి రాకుండా సూర్యాన్ని పైకి పంపించి వుండివుంటే ఇవాళిలాటి దృశ్యం చూడాల్సివచ్చేది కాదని వాపోయారాయన.

అంతా వెంకటరెడ్డి ఇంటిముందు ఆగారు.

"వెంకటరెడ్డిగారూ! దమ్ముంటే బయటికి రండి. ఇవాళ మీరో మేమో తేలిపోవాలి" అరుగుమీద కర్రతో కొట్టాడు జాన్.

బయటికి రావాలంటూ అరిచారు మిగతా వాళ్లు.

వెంకటరెడ్డి ఇంటి తలుపులే కాదు. ఆ వీధిలోని అన్ని ఇళ్ళ తలుపులూ మూసుకుపోయాయి. అంతా అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకుని ఉగ్గబెట్టుకుని కూర్చున్నారు.

వెంకటరెడ్డీ అంతే. భయంతో నిలువెల్లా వణికిపోతున్నారు.

లోపల్నుంచి సమాధానం రాలేదు. తలుపులు తెరచుకోనూ లేదు.

మళ్ళీ మళ్ళీ అరిచారు. గొంతు చించుకున్నారు.

జవాబు లేదు.

కిటికీల అద్దాల్ని పగలగొట్టారు. ఇప్పటికైనా బయటికి రాకపోతే తలుపులు బద్దలు కొట్టేస్తామని హెచ్చరించారు.

తను బయటికెళ్ళకపోతే వాళ్ళే లోపలి కొచ్చి తన భరతం పట్టేస్తారేమోనని భయపడ్డారాయన. తన రక్షణకి వూరి పెద్దలు గాని కులపోళ్ళుగాని రానందుకు కోప్పడ్డారు. తను చేసినపని ఫలితం తనే అనుభవించాల్సొచ్చినందుకు కుళ్ళిపోయారు. అనాలోచితంగా వ్యవహరించానే అని కృంగిపోయారు.

బయట అంతకంతకీ అరుపులూ కేకలూ ఎక్కువవడం చూసి బిక్కచచ్చి భార్యని బతిమాలారు. ఎలాపోలా నచ్చచెప్పి పంపించకపోతే తనని చంపేస్తారని భయపెట్టారు.

మరి గత్యంతరం కన్పించక అదుర్తోన్న గుండెల్తో తలుపులు తీసి వీధిలోకెళ్ళిందామె.

"ఆయన మీ ముసిల్దాన్ని కొట్టినప్పట్నుంచీ పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నారు. సిగ్గుతో చితికిపోతున్నారు. ఆయన్ని క్షమించమని నేను వేడుకుంటున్నాను. నా పసుపుకుంకాలు కాపాడమని మీకు చేతులెత్తి ప్రార్థిస్తున్నాను" మంగళసూత్రాలు చూపిస్తూ కన్నీటితో అర్థించింది.

"ఇలాటి ఎత్తు మా దగ్గర కాదు. ఆయన్ని బయటికి రమ్మనండి" జాన్ రంకె లేస్తోంటే వారించాడు సూర్యం.

"నేను నిజమే చెబుతున్నాను. ఆయన తరఫున నేను వేడుకుంటున్నాను. నన్ను నమ్మండి. ఇంకెప్పుడూ ఇలా జరగదని హామీ ఇస్తున్నాను..."

ఆమె కన్నీళ్లు వారి ఆవేశపు మంటల్ని చల్లార్చాయి.

"సరే... మీరంతగా చెబుతున్నారు గనుక ఈసారికి వదిలేస్తున్నాం. ఇంకోసారిలా జరిగితే మేమేం చేస్తామో మాకే తెలీదని మా హెచ్చరికగా చెప్పండి. ఇకనైనా మనుషుల్ని మనుషులుగా చూడటం నేర్చుకోమనండి. ఎదురుదెబ్బ తీయడం మాకూ వచ్చుని తెలియజెప్పండి" ఆవిడ మొఖం చూసి శాంతించి "పదండి" అన్నాడు సూర్యం.

సూర్యం మాటలకి సుశిక్షిత సైనికుల్లా వెనుదిరిగారంతా.

"ఒక్కక్షణం వుండండి నాయనా..."

అంతా ఆగారు. ఆమె లోపలికెళ్ళి వెయ్యి రూపాయలు తెచ్చి సూర్యం చేతిలో పెట్టింది. "మందుల కోసం..."

"ఇప్పుడు కావాల్సింది మందులు కాదు కట్టెలు"

ఆమె నిశ్చేష్ట అయ్యింది.

ఆ డబ్బు తిరిగి ఆవిడ చేతిలో పెట్టి కదిలారంతా.

వాళ్ళు వెళ్ళాక వాళ్ళముందు ఏడ్చి పరువు తీశావుకదే అంటూ భార్యమీద విరుచుకుపడ్డారు వెంకటరెడ్డి. వాళ్ళ తాటాకు చప్పుళ్ళకి తను బెదిరేరకం కాదనీ తను తలచుకుంటే వాళ్ళ ఎముకల్ని ఏరేసివుండేవాణ్ణనీ గొంతెత్తి చెప్పారు. తనేదో చెయ్యరాని నేరం చేసినట్టు క్షమాపణ కోరడమేకాక పరిహారంగా డబ్బివ్వబోతావా అని తిట్టారు.

ఆమె జవాబివ్వలేదు.

ఆయన్నో క్షుద్రపురుగులా చూసి అక్కణ్ణుంచెళ్ళిపోయింది.

★ ★ ★

"అయ్యో! అయ్యో ఈ ఘోరం విన్నారుటండీ?" గుడినుంచొస్తోన్న భర్తకెదురెళ్తూ అంది పుష్పవల్లి.

"ఏ ఘోరం?"

"అంత నెమ్మదిగా అడుగుతారేవిటండీ. మన పాలేరు సచ్చినోడు రాత్రి పాతికమంది మాలవాళ్ళని వెంటేసుకుని వెంకటరెడ్డిగారింటిమీద పడ్డాట్టండీ"

ఆ మాటలు చెవిన బడేసరికి అలివేలు

కళ్లు మెరిశాయి. ఏం జరిగిందోనన్న ఉత్కం రతో తండ్రిపక్కకొచ్చి చేరింది.

భార్య మాటలకి నవ్వారు కృష్ణమాచార్యులు.

"నవ్వుతారేమిటండీ? "

"వాళ్ళేదో మనింటిమీదకే దండెత్తి వచ్చినట్టు పడుతున్న నీ కంగారుని చూసి!"

"బావుంది. ఇవాళంత పెద్ద భూస్వామి ఇంటిమీదికెళ్ళిన వాడు రేపు జరక్కూడనిది జరిగితే మనింటిమీదకి రాడనేవిటి? ఏవిటో- ఇంటా వంటాలేని వ్యవసాయాలూ రొయ్యల చెరువులూ ఎందుకంటే వినరు. కదా!"

"పిచ్చిదానా. గోరంతల్ని కొండంతలు చేసి చూస్తావెందుకే. అసలు సూర్యం మన చేతిలో వున్నందుకు సంతోషించాలే. ఆ వెంకటరెడ్డి మా పెద్దమునసబుగార్నీమధ్య విమర్శిస్తున్నట్టు తెలిసింది. ఇహ ఈ దెబ్బతో ఆయన ఆటకట్టు. పైగా సూర్యం మన చేతికింద వున్నాడు గనుక మన జోలికి రావడానికంతా భయపడి ఛస్తారే"

"ఏవిటో మీ రాజకీయాలు. నాకో పట్టాన అర్థం కావుకదా"

"అందుకే వదిలేసెయ్యమంటున్నాను"

"వదలక ఏంజేస్తానూ. ఏ అరిష్టమూ రాకుండా ఆ ఏడుకొండలవాడే కాపాడాలి" కళ్లు మూసుకుని లెంపలేసుకుంది.

"రాత్రేదో గొడవ జరిగిందన్నావ్. ఏం జరిగిందమ్మా? " తల్లిని అడిగింది అలివేలు.

"భక్తీవ్రతాలూ పూజలూ ఆచారాలూ చూసుకోవాల్సిన వయసు నీది. వూరిగొడవలు నీకెందుకు చెప్పు. వెళ్ళి రుక్మిణీకళ్యాణం చదువుకో" అందామె.

అది వలచినవాడిచేత వలపింపజేసుకున్న పడతికథ! సాంప్రదాయాలనీ కులవిబేధాలనీ త్రోసేసి ప్రేమించిన వాడితో వెళ్ళి పెళ్ళి చేసుకున్న స్త్రీ మూర్తి ప్రేమకథ.

పెళ్ళికాని ఆడపిల్లలు ఆ కథ చదివితే త్వరగా పెళ్లవుతుందని నమ్ముతారు. దాని అంతరార్థం ఏమిటో!

నవ్వుకుంది అలివేలు.

పెరటి గుమ్మంలో సూర్యం కన్పించాడు. పరుగున వెళ్ళింది.

"పార కావాలి..."

"ఇస్తానుగానీ రాత్రేం జరిగింది? "

"గొడవలు జరగలేదుగాని మా శక్తేమిటో మాకు తెలిసింది. మేమేమిటో వూరికి తెలిసింది. దీనికి ప్రేరణ మీరే"

"నాదేం వుంది. నీ మనస్సులో అస్పష్టంగా కదుల్తోన్న భావాల్నే స్పష్టమైన మాటల్లో చెప్పేనంతే"

"స్వాతి చినుకులే ముత్యాలవుతాయి"

"కబుర్లు బాగా చెబుతున్నావు"

"వేడిలో వేడిగా మాలపల్లి పక్కనున్న ఖాళీ ప్రదేశాన్ని ఆక్రమించి ఇళ్లు కట్టుకుందామంటున్నారు కిష్టయ్య మాస్టారు"

"ఎంతమంది స్వంతంగా ఇళ్లు కట్టుకోగలరు? ప్రభుత్వ సాయానికి కృషిచేస్తే మంచిదికదా"

"తిరిగి తిరిగి అలసిపోయాం. చెప్పులు అరిగిపోయాయిగాని కాగితాలు కదల్లేదు"

"మాస్టారు మంచి చెడ్డలూ లోతుపాతులూ అన్నీ బేరీజువేసే చెప్పుంటార్లే. అసల్నాలో తార్కిక జ్ఞానపుబీజం నాటింది ఆయనే. ఆయన శిష్యురాల్నవడం నా అదృష్టం"

"ఆయన చేతిలో పెరిగిన ప్రతి మొక్కా అలాగే వుంది. వీరభద్రయ్యగారబ్బాయి సారథి మాదిగలమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. వారం పదిరోజుల్లో వస్తామని మాస్టారికి ఉత్తరం కూడా రాశాడు"




"కులరహిత సమాజావిష్కరణకి నాంది పలికారన్నమాట. చాలా సంతోషంగా వుంది. అవునూ- ఎప్పట్నుంచో అడగాలను కుంటూనే మరచిపోతున్నాను. చదువెం దుకు మానేశావు? ఈ పాలేరుతనంకన్నా ఉద్యోగం ఎంతో మంచిదికదా"

"మావాళ్ళకి ఇష్టం లేకపోయినా మాస్టార్ని ప్రోత్సాహంవల్ల హాస్టల్లో వుండి చదువుకు న్నాను. నిజానికది హాస్టల్ కాదు. పశువుల శాల. ఒక పొడుగాటి పాకలో ఎనభైమంది వుండాలి. చదువూ నిద్రా అన్నీ అక్కడే. అన్నం సంగతి చెప్పేదేముంది. ఖైదీలకి వేసినట్టు ఇంత అన్నం నానాచెత్తగల సాంబారూ పోసేవారు. అయినా భరిం చాను. కాని అవినీతి ఆరోపణలూ గొడ వలూ దర్యాప్తులూవల్ల హాస్టల్ మూతబ డింది. సరైన ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చెయ్యలేకపోయారు. టైఫాయిడ్ వచ్చింది. ఇంటికొచ్చేశాను. మళ్ళీ వెళ్లనివ్వలేదు మావాళ్లు"

"అయ్యోపాపం..."

"నేనందుకు బాధపట్టంలేదు. ఈరకంగా మావాళ్ళందరితో కలిసి కష్టసుఖాలు పంచు కునే అదృష్టం లభించినందుకు సంతోషిస్తు న్నాను. వాళ్ళబ్రతుకుల్లో చిరుదివ్వెలు వెలి గించడానికి, వారి అభ్యున్నతికి చిన్నిచిన్ని మెట్లు పంచడానికి నా బ్రతుకు ఏ కొంచెంగా వుపయోగపడినా నా జన్మ ధన్య మైనట్లు భావిస్తాను".

అతడిలో ఒక దీక్షామూర్తి, ఒక ప్రగతి వాది, ఒక మహోన్నత మానవతామూర్తి కన్పించారామెకి.

★ ★ ★

వంతెనమీద బస్సాగింది.

సారథీ, లక్ష్మీదిగారు.

నవ్వుతూ ప్రవహిస్తోన్న కాలువ. గుంభ నంగా నవ్వుతోన్న పచ్చనివరిచేలు. గర్వంగా తలెగరేస్తోన్న కొబ్బరి చెట్లు. నిర్మలంగా వున్న ఆకాశం. గిలిగింతలు పెడుతోన్న పిల్ల తెమ్మెర.

కబుర్లు చెప్పుకుంటూ కాలువ గట్టే నడు స్తున్నారు.

"మీవూరికి సరైన రోడ్డుకూడా వెయ్యలేద న్నమాట"

"వేశారు. కాని అది మరీ అధ్వాన్నంగా వుందిట. అందుకే వంతెనదగ్గర దిగి అడ్డ దారిన వెళ్తున్నాం"

"మనదేశ ప్రగతి పథకాలు, అభివృద్ధీ అన్నీ కాగితాలకే పరిమితమైపోతున్నాయి. డబ్బంతా నాయకుల, కాంట్రాక్టర్ల జేబుల్లోకి వెళ్ళిపోతోంది. ఈ స్థితి మారితేతప్ప నిజ మైన అభివృద్ధి జరగదు."

"ఈ హవాలాలూ స్కాములూ ఇలాగే వుంటే అభివృద్ధి కార్యక్రమాలకి ప్రభుత్వం దగ్గర సొమ్ముకూడా వుండదు".

"అప్పుడే మన రాష్ట్రప్రభుత్వం చేతులెత్తే సిందిగా!" లక్ష్మి నవ్వింది.

"ఎవరూ? " ఒక చేనువద్దనున్న రైతు అడిగాడు.

"నేను తాతా వీరభద్రయ్యగారబ్బాయిని"

"నువ్వట్రా. ఎక్కడ వుజ్జోగం సేస్తున్నా వురా"

"హైదరాబాదులో"

"మనసైడుకి రావేంటి"

"వీలుపడదుతాతా"

"ఆ పిల్లెవర్రా? మాకు పప్పన్నం పెట్ట కుండా పెళ్ళిచేసేసుకున్నావేంట్రా"

"అవునుతాతా. చెప్పడానికి వ్యవధిలేకపో యింది"

"ఈ కాలం కుర్రాళ్ళకి అంతా తొందరే. ఏవొచ్చినా పట్టలేం" తనలోతను అనుకున్న ట్టుగా అని, "బేగెళ్ళండి. ఎప్పుడనగా బయ

ల్దేరారో ఏమో" అన్నాడు.

"అతనికి మనగురించి తెలీదంటావా సారధీ"

"తెలీకపోవచ్చు. తెలిస్తే మొఖాన్నే అడిగేస్తారుగాని సంకోచించరు. ఇంకో సంగతేవిటంటే ఇతను ముక్కరైతు. అంటే గట్టుమీదుండి పన్లుచేయించే రకం కాదు. చేలో దిగి కూలీల్తో బాటు పనిచేసే బాపతు. వాళ్ళతో కలిసి భోంచేస్తారు తప్ప గిరిగీసుక్కూర్చోడు"

ఊరు సమీపించడంతో ఆ పై మాటలు సాగలేదు.

ఎలాంటి గాలివానని ఎదుర్కోవలసి వస్తుందోననుకుంటూ .ముందుకి నడుస్తున్నారు లక్ష్మి సారధీ.

వాళ్ళు అల్లంతదూరాన వుండగానే చూశారు వీరభద్రయ్య.

ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. నోరు తడారిపోయింది. ఏం చెయ్యాలో తోచక హడావిడి పడ్డారు. చేతులు వెనక్కి కట్టుకొని వేగంగా అరుగుమీద పచార్లు చేశారు.

అయినా ఆందోళన తగ్గలేదు. నిజానికి పెరిగింది!

రెండ్రోజుల క్రితమే సారధి దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది. కులాంతర వివాహం చేసుకున్నాననీ కన్నవారి ఆశీస్సులకోసం రాబోతున్నాననీ రాశాడు.

ఆ వుత్తరం చూసినప్పట్నుంచీ ఇంట్లోంచి పీనుగెళ్ళినట్టుగా అయిపోయారంతా

అవమానం. బాధ, దుఃఖం, ఆక్రోశం, కడుపుకోత, లోకులభయం అన్నీ చుట్టుముట్టి నిర్దాక్షిణ్యంగా నలిపేస్తోంటే నిస్సహాయంగా నలిగిపోతున్నారు ఇంటిల్లపాదీ.

"ఈ సంగతి నలుగురికీ తెలిస్తే ఎంతల ప్రతిష్ఠ! ఎంత అవమానం! వంశానికెంత మచ్చ! కులస్థులముందు తలెత్తుకోగలరా? మిగతా పిల్లలకి పెళ్ళిళ్ళవుతాయా? చదువుకున్న వాడు కూడానూ ఆ మాత్రం ఇంగిత జ్ఞానం వుండొద్దూ" అని రగిలిపోతున్నారాయన.

"సారధి పెళ్ళి చేసుకున్న అమ్మాయి కులం సంగతి బయటివారికి తెలీకపోతే ఏదోలా సర్దుకుందుం. కడుపులో దాచుకుందుం. కాని మునిరత్నంగాడికి తెలిసిపోయిందే! వాడు వూరంతా కోడైకూసేశాడే! అసలు తప్పంతా నాదేలే. ఉత్తరం చూసి ఆవేశపడి చిందులేశాడు. కొడుకుని శాపనార్థాలు పెట్టాడు. దాంతో సంగతి వాడికి తెలిసిపోయింది. అడిగో భాగోతం చూద్దామనొచ్చేసి గుంటనక్కలా కూర్చున్నాడు చూడు చుట్టకాలుస్తూ..." చీదరగా చూశారతడ్ని.

అదేం పట్టించుకోలేదు మునిరత్నం. గుప్పు గుప్పుమని పొగ వదుల్తూ గోడకి జేరబడి కాళ్ళాడిస్తూ కూర్చున్నాడు.

వున్నట్టుండి ఏమన్పించిందో అరుగు దిగి అడ్డదారివంక చూసి అరిచాడతడు "భద్రయ్య మావోయ్! నీకొడుకు వచ్చేశాడు ఆ మాదిగదీ వస్తోంది!"

వీరభద్రయ్య గుండెలు జారిపోయాయి.

ఇప్పుడేం చెయ్యాలి? లోపలికి రానివ్వాలా? బయటికి పొమ్మనాలా? పొమ్మంటే ఎక్కడికి పోతాడు?

రానిస్తే లోకులు కాకులై పొడుచుకుతినరూ?

ఏడుపొచ్చేస్తోందాయనికి!

లోపలాయన భార్య సన్నగా రోదించసాగింది.

సారధీ లక్ష్మి వచ్చారు. తండ్రివంక చూశాడతడు. ఆయనఅభిప్రాయం అర్థం కాలేదు. మెట్లెక్కుతూంటే అడ్డుకున్నాడు మునిరత్నం.

"ఏంట్రోయ్. నువ్వు చేసిన పరువు





తక్కువ పనిని మీనాన్న ఒప్పుకుంటాడనే ఆ అంటరాని దాన్ని వెంటేసుకుని తిన్నగా ఇంట్లోకొచ్చేస్తున్నావ్"

"ఇది మా ఇంటివిషయం. మధ్యలో నీ జోక్యం అనవసరం".

"కులంకాని దాన్ని కట్టుకొచ్చి ఇంటిగొడ వంటే అయిపోద్దేంటి. కులమూ కట్టుబాటూ లేవేంటి? మాట్లాడవేం భద్రయ్యమావా. నీకొడుక్కి బుద్ధిచెప్పు" ఎక్కేశాడు మునిరత్నం.

"ఆ- అవును. ఏరా! మా కడుపున చెడ బుట్టావుకదురా. చదువు కున్నావు, వుద్యోగం చేస్తున్నావు, మాకు చేయూతగా నిలబడతావనుకుంటే... మాకడుపులో చిచ్చు పెడతావుట్రా? తగుదునమ్మా అని ఎవతెనో కట్టుకొని వస్తావుట్రా? వెళ్ళరా వెళ్ళు. నీకీ గుమ్మం తొక్కే అర్హతే లేదురా. నాకసలు కొడుకే పుట్టలేదనుకుంటాను..." పైపంచ అడ్డం పెట్టుకొని ఏడ్చేశారు.

"విన్నావుట్రా. మీనాన్న నిప్పులాంటి మనిషిరా. ఒకర్తో వేలెత్తి చూపించుకునే పనెప్పుడూ చెయ్యడు. ఇలాంటి ఛండాలపు పనిని చచ్చినా సమర్థించడు..."

"మీ జోక్యం అనవసరమని చెప్పినా ఎందుకు కల్పించుకుంటారు? " తీవ్రస్వరంతో ప్రశ్నించాడు సారథి.

"అయిన వాడ్నీ సాటికులస్తుడ్నీ కనుక"

"అలాగని పిలవని పేరంటానికి వచ్చేస్తారా? ఇతరుల విషయాల్లో తలదూరిస్తే మీతలకే ప్రమాదం రావొచ్చు వెళ్ళండి" అని కోప్పడ్డాడు. "ఇలాంటి నక్కల వూళలు పట్టించుకోకండి నాన్నా. అసలేం జరిగిందో ఏవిటో అంతా చెబుతానుగా. లోపల కూర్చుని మాట్లాడుకుందాం. మమ్మల్ని లోపలికి రానీండి..."

"ఇంక నేనేమీ వినలేనురా. వచ్చిందారినే వెళ్ళిపోరా. మమ్మల్ని కాదని మనకులాన్ని కాదని పెళ్ళాడినవాడికి మేమెందుకు మా ఇల్లెందుకు? " లోపల్నుంచి భార్య పిలుస్తూ ఏదో చెప్పాలని తాపత్రయపడుతున్నా విన్పించుకోకుండా అన్నారాయన.

సారథి మరి నిలబడలేకపోయాడు. లక్ష్మిని మరింత అవమానాగ్నికి గురి చెయ్యడం ఇష్టంలేక ఆమెని తీసుకుని పశువుల పాక వైపెళ్ళిపోయాడు.

విశాలాక్షమ్మ ఏడుపు స్వరం హెచ్చింది.

వీరభద్రయ్య మనస్సు అల్లకల్లోలంగా వుంది. మరేమీ తోచక సలహానిమిత్తం పెద్దమునసబుగారి దగ్గరికి పరుగెత్తారు.

మునిరత్నం సంతృప్తిగా కదిలాడు వార్తని నలుగురి చెవిలోనూ వెయ్యడానికి!

పశువులపాకలో గడ్డిపరుచుకుని కూర్చున్నారు సారథీ లక్ష్మి.

ఆమె ముఖం బాధతో అవమానంతో ఎర్రగా కందివుంది.

"సారీ లక్ష్మి. ఇలా జరుగుతుందని ముందే వూహించినా..."

"వూహించినా అలా జరగదనెందుకో అన్పించింది. కాని..."

"పెద్దల ఆశీర్వాదం కోసం వచ్చేం. ఆశీర్వదించనన్నారు. వెళ్ళిపోతాం. దట్సాల్. ఇవాళిలా ప్రవర్తించారని ఎప్పటికీ ఇలా వుంటారని మాత్రం అనుకోనవసరంలేదు. మార్పు అనివార్యం".

కొన్ని నిమిషాలు మౌనంగా దొర్లాయి.

"అబ్బాయ్"

ఆ పిలుపు తల్లిదని సారథి వెంటనే గ్రహించాడు. చెప్పలేనంత ఆనందం కలిగింది. గబగబా తల్లి దగ్గరకెళ్ళాడు. 'అమ్మా' అంటూ

"ఏరా బాబూ. ఇలాటిపని చేసేవేంట్రా. మేం బతికున్నామనుకున్నావా చచ్చామనుకున్నావా? "

"అమ్మా"!"

"లేకపోతే నువ్వు చేసిన పనికి మీనాన్న తలెత్తుకోగలరనుకున్నావుర్రా. నలుగుర్లో తలవంపులు తెచ్చేపని చేశావు కదుర్రా. మమ్మల్నీ వయస్సులో ఇలా బాధపెట్టడానికి మేమేం పాపం చేశాంరా? ".

తల్లి కన్నీటికి చలించిపోయాడు సారథి.

"ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకుని సుఖపట్టం తప్పంటారనుకోలేదమ్మా. నా సుఖసంతోషాల కన్న కులానికెక్కువ విలువి స్తారనుకోలేదు. మీ అభిప్రాయాలతో మీ నమ్మకాలతో మమ్మల్నీ మా పనుల్నీ కొల వడం అన్యాయమమ్మా. మీకులేని చదువు, విజ్ఞానం లోకజ్ఞానం ముందుచూపు- లాటి వెన్నో మాకున్నాయమ్మా"

"నాకదంతా తెలీదురా. నాకు తెలిసిందొ కటే. దేవుడు సృష్టించిన కులాల్ని కాదంటే మేం ఒప్పుకోంరా. అది దేవుడ్ని దూషించినట్టవుతుందిరా. నామాట వినరా అబ్బాయ్.. "

"ఈ కులాల్ని దేవుడు కాదమ్మా మను ష్యులే సృష్టించారు. వృత్తిరీత్యా ఏర్పరిచిన భేదాల్ని కులాలుగా విడదీసి అణగద్రొక్కడా నికి, అదిమి వుంచడానికి పన్నిన పన్నాగం! కండబలం, బుద్ధిబలం వున్న వాళ్ళు వేసిన ఎత్తుగడ!"

నువ్వెన్ని చెప్పినా నాకెక్కదురా. ఇప్పు డైనా మించిపోయిందిలేదురాఅబ్బాయ్. ఆ పిల్లని వదిలేసి మనకులస్తురాల్ని కట్టుకోరా. ఈతల్లి వేదన అర్థంచేసుకోరా" చేతులు పట్టుకొని ఏడ్చేసింది విశాలాక్షమ్మ.

"భలేదానివమ్మా. ఒక ఆడకూతురికి అన్యాయంజరిగినా ఫర్లేదు గాని వంశగౌర వంకోసం మరొకర్ని పెళ్లాడాలి? దేవుడిలాటి పనిని హర్షిస్తాడా అమ్మా? "

"అబ్బాయ్!"

"ఒక ఆశయంతో ముందడుగువేశాను. దాన్ని వెనక్కి తీసుకోనమ్మా. నేను నిదా నంగా నడుస్తున్నప్పుడు నా నీడ వంకరగా వుందంటే నేను పట్టించుకోను. మా పెళ్లి ఇష్టంలేకపోవచ్చు మేం ఇష్టమే కదా. మమ్మల్ని దీవించమ్మా"

లక్ష్మి పాదాభివందనం చెయ్యడానికి వంగగానే దూరంగా జరిగిందావిడ. నిశ్చేష్టు లయ్యారిద్దరూ.

సారథి పొడిగా నవ్వి అన్నాడు "కోడలు నమస్కరించడానికి వంగితే ఎక్కడ ఆమె స్పర్శకి మైలపడిపోతానోనని దూరంగా జరు గుతున్నావా అమ్మా. నీ కోడలికి నిన్ను తాకే అర్హతలేని నాడు నాకూ వుండదమ్మా"

"బాబూ! నువ్వు నా పేగు తెంచుకుని పుట్టిన బిడ్డవిరా. నన్ను మాటల్తో చిత్రవధ చెయ్యకురా"

"నా భార్య నమస్కారాన్నికూడా స్వీకరిం చలేనినిన్ను అమ్మా అనికూడా పిలవలేను" వెనుదిరిగి కళ్ళు తుడుచుకున్నాడు.

"అంతమాటనకురా. నేన్నీ కన్న తల్లినిరా. మేమేంచెయ్యంరా బాబూ. మరోకులం వాళ్ళని పెళ్ళాడకూడదనీ మాలమాదిగల్ని ముట్టుకోకూడదనీ మా చిన్నప్పుడే నూరిపో శార్రా. మారక్తంలో, మా బుర్రల్లో కలిపే శార్రా. నువ్విప్పుడు అదంతా ఛాందస మంటే మేమేం చెయ్యగలం చెప్పు? మేం ఎలా చావాలి చెప్పు? "

అతడు మాట్లాడలేదు. తల్లి వంక చూడ నూలేదు.

ఏడుస్తూ వెళ్ళిపోయిందావిడ.

"మీ అమ్మగారు చాలా బాధపడుతు న్నారు. మీరలా అనకుండా వుండాల్సిం దేమో" లక్ష్మి అంది.

"ఒక్కోసారి పెన్సిలిన్ వాడక తప్పదు."

★ ★ ★

చెరువులోని రొయ్యపిల్లలకి ఆహారం





వేశాడు సూర్యం.

పిల్లల్ని చూసి వాటి ఎదుగుదలకి సంతృప్తిపడ్డాడు. ఇలాగే ఎదిగితే మంచి కౌంటు వస్తుందనుకున్నాడు.

దగ్గర్లోని పొలానికి నీళ్ళు పెట్టడానికొచ్చిన సుబ్బడు సూర్యం దగ్గరికొచ్చి "ఇదిన్నావుట్రా అల్లుడూ" అన్నాడు.

"ఏది"

"అదే. ఈరభద్రయ్యగోరబ్బాయి లేడూ. అయిద్రాబాదులో వుజ్జోగం సేత్తన్నాడూ..."

"అవునూ, సారధి. వచ్చేడా?"

"రాడవేకాదురా. మాదిగోళ్ళపిల్లని పెళ్ళాడి తీసుకొచ్చాట్ట. ఈరభద్రయ్యగోరు ఇంట్లోకి రాడాకీల్లేదన్నారంట. ఆరి గొడ్లసావిట్లో వున్నారంట..."

"అరెరె. ఎంతన్యాయం"

"అన్యాయం అని మెల్లిగా అంటావేంట్రా. కలికాలం. గొప్పోలు గొప్పగా వుండాలిగానీ ఇలాటి సిల్లర బుద్ధులేంటి సెప్పు. కడజాతోళ్ళని పెళ్ళాడతాడా. పిదపకాలమూ పిదప బుద్ధులూనూ..."

ప్రమాన్పడిపోయాడు సూర్యం.

దళితుడైన సుబ్బడుకూడా సారధివివాహాన్ని సమర్ధించడంలేదు! అంటే కులవ్యవస్థ కూకటివేళ్ళు మనిషి మనస్సు పొరల్లోకి కూడా చొచ్చుకుపోయాయన్నమాట. ఆ భావదాస్యశృంఖలాలనుండి విముక్తులవడానికి ఇంకా ఎంతకాలం పడుతుందో ఏమో!

గబగబా చెరువుదగ్గరి పని ముగించేశాడు. మెల్లగా చీకటి తెరలు దిగుతోంటే కామందు ఇంటికెళ్ళాడు పచ్చగడ్డి మోపునెత్తినెట్టుకొని.

పశువుల పాకలోకెళ్ళి గేదెల దగ్గరి పేడ తీసేసి అవి తొక్కేసిన గడ్డినొల్లేసి శుభ్రంచేశాడు. ఆవుకీ గేదెలకూ పచ్చగడ్డి వేశాడు. పాలుపితికి పాలతెపాలాత్తో వెళ్ళాడు.

తెపాలా అందుకుంటూ వుండమని సైగ చేసి వెళ్ళింది అలివేలు. రెండుకొబ్బరి చెక్కల్తో వచ్చింది.

"సారథి వచ్చేరట. తెలిసింది..."

"ఎంతో దూరంనుంచి ఆశీర్వచనాలకోసం తల్లితండ్రుల్ని వెదుక్కుంటూ వస్తే వాళ్ళని ఇంట్లోకి రానివ్వకపోవడం దారుణం. దళిత అధికారులు ఇంటికొస్తే లోపలికి పిలవరూ? కుర్చీ వేసి మర్యాద చెయ్యరూ? అప్పుడు లేని అంటూ సొంటూ ఇప్పుడెందుకొచ్చిపడిందో" బాధగా అందామె.

"మనిషికీ మనిషికీ మధ్యనున్న సంబంధాలని డబ్బూ అధికారమూ శాసిస్తున్నాయి గనుక. అందుకే అంటారు మానవసంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలేనని"

"బాగా చెప్పేవు. ఇవాళ కొడుకుని కాదన్న వీరభద్రయ్యగారు రేపుకొడుకు పంపే డబ్బుని కాదనగలరా? వూహూ. సరే. ఇవాళ గాకపోయినా రేపైనా ఆయన మారతారని ఆశిద్దాం. ఇదిగో ఈ ఫలహారం సారథిగారికివ్వు. వారి దాంపత్యం పచ్చగా పదికాలాలపాటు వర్ధిల్లాలని దేవుడిగుడిలో కొబ్బరికాయకొట్టేను..."

అభినందనగా ఆరాధనగా చూశాడు సూర్యం.

అతడి దృష్టిలో ఆమె మరింత ఎత్తుకి ఎదిగిపోయింది.

"మీరు చాలా గొప్పవారు..."

"పొగడ్తలు కాకారాయుళ్ళ ఆయుధాలు" నవ్వింది.

"అహ. అబ్బే. అదికాదు. మరేవిటంటే..."

"నాకు తెలుసుగాని ఇదిగో ఈ చెక్క నీకోసం"

'నాకోసమా? అంటే?'

"ఆలోచించు నీకే తెలుస్తుంది."

అయోమయంగా చూశాడు.

గుంభనంగా నవ్వింది ఆమె.

అతడేదో అనబోయాడు. వీధిలో ఎవరో పిలిచారు. అతడాగిపోయాడు. ఆమె వంక అర్థోక్తితో చూసి కదిలాడు.

వీధిలోకెళ్ళింది అలివేలు.

"ఆచార్లుగారున్నారాండీ" వీఏఓ దగ్గర పన్జేసే గ్రామనౌకరు అడిగాడు.

"లేరు. ఏం?"

"వచ్చేక పెద్దమునసబుగోరు రమ్మన్నారని సెప్పండి"

"ఎందుకుట?"

ఏమో తెల్వదండి కాని ఈరభద్రయ్యగోరొచ్చి పెద్దమునసబుగోరికేవో సెప్పేరండి. ఆరేమో పెద్దల్నందర్నీ పిలవరా అన్నారండి. ఈరభద్రయ్యగోరబ్బాయి మా కులం పిల్లని పెళ్ళాడేడుగదండీ. అందుకే అనుకుంటానండి. మర్సిపోకండా ఆచార్లుగోరికి సెప్పండే"

అతడెళ్ళిపోయాడు.

"విషయాన్ని గ్రామపెద్దల సమక్షంలో పెడుతున్నారన్నమాట. వాళ్ళేంచెబుతారు? దేవాలయంలోకి హరిజన ప్రవేశవిషయంలో చెప్పిందే చెబుతారు, కాని వీరి మాటల్ని సారధి గారు లెక్కచేస్తాడేమిటి వీళ్ళపిచ్చిగానీ!

★ ★ ★

"అన్నయ్యా" సారధి చెల్లెలు పార్వతి భోజనం కేరియర్ తీసుకొచ్చింది. "అక్కడే నిలబడిపోయావేం. రా పార్వతీ"

సంకోచిస్తూనే సమీపించింది.

"నా చెల్లెలు పార్వతి. మీ వదిన లక్ష్మి..." పరిచయం చేశాడు సారధి.

"మీ అన్నయ్య ఎప్పుడూ నీ గురించే చెబుతూంటారు. నీకు మంచి వరుడ్ని చూసి త్వరలోనే పెళ్ళి చేసేస్తాంలే రా..." ఎదురెళ్ళింది లక్ష్మి.

పార్వతి రెండడుగులు వెనక్కేసింది.

ఆమెకి చాలా ఆశ్చర్యంగా వుంది. వదిన ఎలాగో వుంటుందనుకుంది. వూళ్ళోని మాదిగలమ్మాయిలా వుంటుందనుకొంది. కాని అందంగా హుందాగా వుంది. పెద్దకులపుఅమ్మాయిలా వుంది. చదువుకున్నానన్న గర్వం లేకుండా అణుకువగా వుంది.

హతాసురాలయ్యింది లక్ష్మి. అంతలో ఏదో గుర్తురాగా సూట్‌కేసులోంచి ముత్యాల పాకెట్ తెచ్చిచ్చింది.

"ముత్యాలు తెమ్మని ఎప్పటినుంచో అడుగుతున్నావటగదా మీ అన్నయ్య చెప్పారు. నా కానుకగా తెచ్చాను."

తీసుకోడానికి సంశయించింది పార్వతి. తీసుకోమని మనస్సు ఒత్తిడిచేస్తోంది. కాని తండ్రికి తెలిస్తే కూకలేస్తాడేమోనని భయపడింది.

"తీసుకో పార్వతీ. నాన్నేమీ అనళ్ళే. రెండ్రోజులు కంటబడకుండా దాస్తే సరి మూడోనాటికి కోపం ఎగిరి చక్కాపోతుంది"

ఆమె తీసుకుంది. లక్ష్మి ఆనందంగా నిట్టూర్చింది.

"అన్నయ్యా- భోజనం..."

"నువ్వు మా ఇద్దరికీ వడ్డిస్తావా చెప్పు?"

తలొంచుకుంది.

"ముష్టివేసినట్లు పెడతానంటే ఎలా తింటాంచెప్పు? వద్దులే తీసుకెళ్ళిపో"

"అమ్మ బాధపడుతుందన్నయ్యా"

"మా ఆత్మాభిమానానికి తగుల్తోన్న దెబ్బలకి మాకూ బాధగానే వుంది. అమ్మ వడ్డిస్తోంటే తినే భాగ్యానికి నోచుకోనందుకు బాధగానే వుంది..."

లక్ష్మి బొమ్మలా నిలబడి అన్నా చెల్లెళ్ళని





మార్చిమార్చి చూస్తోంది.

అన్నా వదినెలకి అన్నం వడ్డించాలనీ వదినతో కబుర్లు చెప్పాలనీ పార్వతికెంతో ఆశగావుంది. కాని తండ్రిభయం ఆమెని అడుగు ముందుకెయ్యనివ్వటంలేదు.

కొన్ని నిమిషాలపాటు తటపటాయించి వెళ్ళిపోయింది.

"అసలు మనమిక్కడికి రాకుండా వుండాల్సిందేమో సారథీ"

"రాకపోతే వీళ్ళలో ఇంత సంచలనం రాదు. చైతన్యానికి సంచలనం నాంది"

"సారథీ..." అంటూ వచ్చి వాటేసుకున్నాడు సూర్యం.

"నమస్తే..." లక్ష్మి విష్ చేసింది.

"నా పేరు సూర్యం..."

"చాలుచాలు... నాకు మీ గురించీ కిష్టయ్య మాస్టారి గురించీ అంతా తెలుసు" అందామె.

పొంగిపోయాడు సూర్యం.

"మీకు శుభాకాంక్షలెలా చెప్పాలో తెలీడం లేదు. దీవించడానికి చిన్నవాణ్ణి. అయినా మీరు నూరేళ్ళు కాదు వెయ్యేళ్ళు చల్లగా సుఖంగా బతకాలని మనసా వాచా కోరుకుంటున్నాను"

"థాంక్యూ... అది మేం దీవెనగానే తీసుకుంటాం. దీవెనకి అర్హత వయస్సు కాదు మనస్సు"

"అన్నట్టు మరిచేపోయాను. మా అలివేలు మీకీ కొబ్బరిచెక్క ఫలహారం ఇమ్మంది"

"మీ అలివేలా? మాకు చెప్పకుండా పెళ్ళి చేసుకున్నావా సూర్యం? "

నాలిక్కరుచుకున్నాడతడు.

"అదే సారథీ. మా కామందు కృష్ణమాచార్యులగారమ్మాయి. మీ దాంపత్యం సుఖసంతోషాలతో ఆదర్శప్రాయంగా వర్ధిల్లాలని దేవుడికి పూజచేసి ఈ ఫలహారం మీకిమ్మంది"

సారథీ, లక్ష్మి ఇద్దరూ కూడా ఆశ్చర్యపోయారు.

"ఈ వూరు మంచి మనసులకీ మంచి దీవెనలకీ గొడ్డుపోలేదు సుమా" లక్ష్మి అంది.

"నిజమే లక్ష్మీ. అంతేకాదు. ఒక బ్రాహ్మ లమ్మాయి వర్ణాంతర వివాహాన్ని ప్రోత్సహిస్తోందంటే అది నేటి యువతీయువకుల్లో వస్తోన్న మార్పుకి చక్కని నిదర్శనం. థాంక్యూ సూర్యం. ఆమెను కలుసుకొని మా కృతజ్ఞతలు చెప్పడానికి వీలుకుదరదేమో. నువ్వు మా కృతజ్ఞతలు తెలియజెయ్యి..."

"తప్పకుండా. మరి భోజనం సంగతి..." పడుకోటానిక్కాదుకదా కూర్చోడానిక్కూడా వీల్లేని రొచ్చుకంపుతో నిండిన పాకని పరికిస్తూ అడిగాడు సూర్యం.

"మా అమ్మ వస్తుందేమోనని ఆశగా చూస్తున్నాను. ప్చ్ ఇంక లాభంలేదు. మాస్టారింటికెళ్దాం పద..." అన్నాడు సారథి.

వద్దంటున్నా వినకుండా వారి సూట్‌కేసు అందుకున్నాడు సూర్యం. వూరి విషయాలూ రొయ్యల వ్యవసాయం గురించీ వివరాలడుగుతూ ముందు నడిచాడు సారథి. లక్ష్మి అనుసరించింది.

వాళ్లు వెళ్లిన పావుగంటకి చీరకొంగుతో కళ్లొత్తుకుంటూనే కేరేజీతో వచ్చింది విశాలాక్షమ్మ.

అక్కడెవరూ కన్పించకపోయేసరికి స్థాణువయ్యింది. కళ్లల్లో కన్నీటి అల భళ్ళున బద్దలయింది.

వాళ్ళెక్కడికెళ్ళిందీ చెప్పడానికక్కడ ఒక్కరూ లేరు.

★ ★ ★



"నమస్కారం మాస్టారూ"

గ్రామస్తులకి వుత్తరాలు చదివి పెడుతున్న కిష్టయ్య మాస్టారు సారథిని చూసి పరమానంద పడిపోయారు.

"రావోయ్ సారథీ రా. రామ్మా లక్ష్మీ, ఎలాంటి సందేహాలూ పెట్టుకోవద్దు. ఇది నీ ఇల్లే అనుకో" అంటూ ఆహ్వానించారు. ఆ వెంటనే "ఇదిగోనేవ్, ఎవరొచ్చారో చూడు" అని కేకేశారు భార్య నుద్దేశించి.

"వచ్చింది మన సారథేనా..." అంటూ వచ్చింది మాస్టారి భార్య కాంతం. సారథి దంపతుల్ని చూసి బోలుడు సంబరపడిపోయింది.

"ఏరా నాయనా బావున్నావా. ఏమ్మా లక్ష్మీ అచ్చం మహాలక్ష్మిలా వున్నావనుకో. లోపలికి రామ్మా" ఆప్యాయంగా అందర్నీ లోపలికి తీసుకెళ్లింది. మంచినీళ్లూ ఆపైన టీ నీళ్ళూ ఇచ్చింది.

గ్రామస్తులు సారథిని పలకరించి యోగక్షేమాలు కనుక్కున్నారు. లక్ష్మీవంక అదోలా చూసి మాస్టారి దగ్గర సెలవు తీసుకువెళ్లిపోయారు.

"మధ్యాహ్నం జరిగిందంతా తెలిసింది సారథీ. నువ్వేం ఇదవ్వకు. కన్న మమకారానికన్నా మూఢ విశ్వాసాలకే ఎక్కువ విలువిస్తున్నారంటే అవి వారిలో ఎంత లోతుగా వేళ్లూనాయో అర్థంచేసుకోడానికి ప్రయత్నించు"

"ఎంతో దూరాన్నుంచొచ్చారు. మావాళ్లు మావాళ్లని వచ్చారు. అటువంటివాళ్ళని ఇంట్లోకి కూడా రానివ్వకపోటం పశువుల పాకలో వుండాల్సి రావడం- మీరెన్నైనా చెప్పండి, చాలా దారుణం మాస్టారూ" సూర్యం అన్నాడు.

"ఆ గొడవకేంగాని మీ ఆరోగ్యం ఎలా వుంది మాస్టారూ" సారథి అడిగాడు.

"ఆరోగ్యానికేం బాగానే వుందిలే. ఇదిగో ఏమేవ్- పొయ్యిమీద కాస్త ఎసరేశావా కోడలితో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నావా? " మాస్టారడిగారు.

"అయ్యో చోద్యం! ఇంతవరకూనా! ఇందాకే వేశాన్లెండి. సూర్యానిక్కూడా బియ్యం వేశాను వెళ్ళనీకండి"

"నాక్కూడా ఓ గుప్పెడు వెయ్యాల్సిందోయ్. ఈ కుర్రాళ్ళతో కూర్చుని మళ్లీ తినాలనిపిస్తోంది నాకు"

"అలాగే తిందురుగాన్లెండి మీరు తినేదెంతా పిట్టతిండేకదా!"

నవ్వుకున్నారావిడ మాటలకి.

"చూస్తోంటే రొయ్యల చెరువులు మన ప్రాంతాన్ని మార్చేసేట్టున్నాయే. ఏం సూర్యం? " సారథి అడిగాడు.

"అవునవును, అంతా వూడ్పు పొలాల్ని చెరువులుగా మార్చాలని ప్రయత్నిస్తున్నారు. లాభాలు దండిగా వస్తున్నాయి. అందుకే అంతా అటు మొగ్గుతున్నారు. కాని మా కూలోళ్లకి దెబ్బేనండి. ఇహ సీజన్లో కూడా చేతినిండా పనుండదు"

"ఉత్తరాల్లో మాస్టారు నీ గురించెక్కువగా ఎందుకు రాస్తున్నారో ఇప్పుడర్థమయ్యింది"

"అదంతా మాస్టారి అభిమానం" సిగ్గుపడ్డాడు సూర్యం.

"అలాగనకు మరి. ఏ మాటకామాటే చెప్పుకోవాలి. సూర్యమూ మిగతా కుర్రాళ్ళూ వూరినోకుదుపు కుదిపేస్తున్నారు సారథీ. వీరివల్ల దళితుల్లో చైతన్యమే కాదు శక్తి కూడా వచ్చిందనుకో. అందర్నీ ఒక్క తాటిమీద నిలుపుతున్నారు. అన్యాయాలూ అక్రమాలూ జరక్కుండా వేయికళ్ళతో కనిపెట్టుకుని చూస్తున్నారు. నిజం చెప్పాలంటే హరిజనుల్ని అగ్రవర్ణాలవారు ఇదివరకట్లా హీనంగా చూట్టానికి భయపడుతున్నారనుకో. దళితుల్లో ఐకమత్యమూ ఆత్మవిశ్వాసమూ పెరగడానికి ప్రధానకారకుడు సూర్యమే. రేపటి కాలంలో ఈ చిరంజీవుల




నాయకత్వంలో నిమ్నకులాల వారంతా ముందడుగు వేస్తారని వారిలోంచి వేలాదిగా సూర్యులు వుదయించి కోటి సూర్య ప్రభలతో ప్రకాశించి చీకట్లని పారద్రోలతారని నాకు నమ్మకంగా వుంది" వుద్వేగంగా అన్నారు మాస్టారు.

అప్పుడాయన కళ్ళల్లో మెరిసిన మెరుపుల్నీ ముఖంలో కన్పించిన తేజస్సునీ చూసి మైమరచిపోయారు. ఆరాధనగా చూస్తూండిపోయారు సూర్యమూ, సారథీ.

"మీ అండదండలుంటే వాళ్ళు నిజంగానే గొప్పవాళ్ళవుతారు మాస్టారూ. న్యూనతా భావం పోయిన రోజున దళితులు ఆత్మవిశ్వాసంతో నిటారుగా నిలబడగలరు. తామెవరికీ బానిసలు కాదనీ ఫలానా పనే చెయ్యాలన్న ఆంక్షలేమీ లేవనీ గ్రహించిన రోజున వారికీ వారి శక్తికీ ఎదురుండదు. సంపద సృష్టించేవాడు సమాజాన్ని శాసించే రోజు తప్పకుండా వచ్చితీరుతుంది."

"మీ మాటలకి నా ఒళ్ళు పులకరిస్తోంది. సారథీ, నువ్వు మావాడకి రావాలి. మా వాళ్ళకి నాలుగు ముక్కలు చెప్పాలి. నీలాటివారి నోటవింటే వారిలో వారి శక్తిమీద నమ్మకం పెరుగుతుంది. తమ స్థితిగతుల్ని అర్థంచేసుకోగలరు. తామెటు పయనించాలో గ్రహిస్తారు" అన్నాడు సూర్యం.

"అవును సారథీ. సూర్యం చెప్పింది బావుంది. నువ్వూ నీలాటి యువకులూ మీకు వీలున్నప్పుడల్లా వాళ్ళకి నాలుగు మంచి మాటలు చెబితే మంచిది. వాటి ప్రభావం వాళ్ళ మీదెంతో వుంటుంది. వాళ్ళకి చేయి అందించి పైకి తీసుకురావాల్సిన బాధ్యత మీ అందరిమీదా వుంది"

"అలాగే మాస్టారు. నేనెప్పుడూ మీ మాటలు మర్చిపోను. ఎక్కడున్నాసరే వాటిని ఆచరణలో పెట్టడానికి నా శాయశక్తులా కృషిచేస్తాను"

"మాలపల్లెలో గుడిసెల్లేని పేదలు చాలా మంది వున్నారు. వారికోసం పల్లెనానుకుని వున్న తుమ్మలతోపుని ఆక్రమిస్తే బాగుంటుందనుకుంటున్నాం. ఎన్నికల సమయంలో ఇంటిస్థలాలిప్పిస్తాం, గృహాలు నిర్మిస్తాం అంటూ వాగ్దానాలు చెయ్యడమే గాని ఆచరణలో ఏమీ కన్పించట్లేదు. ఇప్పుడేమో కొత్త స్లోగన్ మొదలైంది కదా. ప్రభుత్వ ఖజానా ఖాళీ అయిపోయింది. దేనికీ డబ్బు అడగొద్దు అంటున్నారుగా. అంచేత స్థలాలైనా దక్కుతాయని మా ఆశ. నువ్వేమంటావు సారథీ"

"ముందు రెవెన్యూ అధికారులద్వారా ప్రజాప్రతినిధులద్వారా ప్రయత్నిస్తే మంచిది మాస్టారూ. శాశ్వత గృహనిర్మాణం జరిగితే తప్ప ప్రయోజనం వుండదు..."

"అధికారులేమో చూస్తాం, రాస్తాం అంటారు. యమ్మెల్యే హైదరాబాదు వాసియైపోయాడు. యంపీ ప్రతిపక్షం వాడుగనుక పనులవ్వవు, నిధులు రావు. ఇంకేం చెయ్యం చెప్పు?"

"పైనుంచి నరుక్కొద్దాం. ముఖ్యమంత్రికీ జిల్లామంత్రికీ కలెక్టరుకీ విజ్ఞప్తులు పంపితే కొంతైనా ప్రయోజనం వుండకపోదు"

"సరే అలాగే చేస్తాం. శాంతియుతంగా పరిష్కారం లభించేట్లయితే ఎందుకు వద్దంటాం. రేపే మనవాళ్ళందరి సంతకాలతో పంపిద్దాం సూర్యం"

"అలాగే మాస్టారూ"

"ఇక భోజనానికి లేస్తారా" కాంతం పిలిచేసరికి అంతా లేచారు.

భోజనాలయ్యాక సూర్యంవెంట హరిజనవాడకెళ్ళారు సారథీ లక్ష్మీ.

★ ★ ★

ఆ వూరికి తిరుగులేని నాయకుడు పెద్ద మునసబుగారే. చెదురుమదురు ఘటనలు తప్ప ఇంతవరకూ ఆయనకి వూళ్ళో ఎదుర



నేదే లేదు.

అందుక్కారణం లేకపోలేదు. ఒకప్పుడు మునసబుగా గ్రామాన్ని గడగడలాడించారు. తర్వాత మునసబుగిరీని పెద్ద కొడుక్కి కట్టబెట్టి పెత్తనం తన దగ్గరే వుంచుకున్నారు. మునసబుగిరీలకు కాలం చెల్లటంతో ఎలాగైనా అధికారం నిలుపుకోవాలని చెప్పి రెండోకొడుకుని సర్పంచ్‌ని చేశారు. దానికి తోడు పెద్దకొడుకు వి.ఏ.ఓ.గా కొత్త అవతారం ఎత్తగా పలుకుబడి ఉపయోగించుకుని తమవూరికే వేయించుకున్నారు.

దాంతో ఆయనకి ఎదురనేది లేకపోయింది. కుర్చీ దిగకుండానే వూరి విషయాల్ని చక్కబెడుతూంటారు. ఆఖరికి ఎన్నికల్లో అభ్యర్థులు ముందుగా వచ్చి ఆయన్ని ప్రసన్నంచేసుకుంటేనే ఓట్లు పడతాయి.

పెద్దమునసబుగారి అధికారం, దర్పం నిరాటంకంగా కొనసాగడానికి మరో ముఖ్య కారణం కూడా వుంది.

ఊళ్ళోని మోతుబరుల్నీ కాస్త నోరున్నవాళ్ళనీ పెద్దల్ని చేసేసి వారి సలహాలూగట్రా తీసుకున్నట్టు నటిస్తుంటారు. వాళ్లకి గౌరవం ఇస్తున్నట్టు ప్రవర్తిస్తూ వారి అభిమానం మూటగట్టుకొంటూంటారు.

ఊళ్లోని ప్రతి తగవూ తీర్పుకోసం తనదగ్గరకి రావాల్సిందే. రాకపోతే ఎలాహోలా ఎత్తువేసి రప్పించుకుంటారు. తన పెద్దరికం రుజువుచేసుకొంటూంటారు. మరీ మోతుబరుల వ్యవహారమైతే తప్ప కోర్టుల దాకా పోనివ్వరు. తన చేయిదాటితే తను చేతకాని వాడైపోయినట్టు ఫీలవుతారు.

అసలందుకే ఆయన 'ఏదిన్యాయం?' అని ఆలోచించి తీర్పు ఇవ్వరు. ఎవరికనుకూలంగా తీర్పుఇస్తే ఎక్కువ లాభమో అటు మొగ్గుతారు. ఒకవేళ ఇరుపక్షాలవారూ కావాల్సిన వారైతే మధ్యేమార్గంగా తీర్పిచ్చి ఇద్దరి అభినందనలూ అందుకుంటారు.

ప్రస్తుతం వీరభద్రయ్యకి ఎదురైన సమస్య దృష్ట్యా పెద్దల్ని సమావేశపరిచారు పెద్ద మునసబుగారు.

కబురందగానే పరుగెత్తుకొచ్చిన వారిలో కృష్ణమాచార్యులు ప్రథములు. వీరభద్రయ్య అంటే ఆయనకి పీకలదాకా కోపం వుంది. అందుక్కారణం లేకపోలేదు. ఇద్దరి పొలాల సరిహద్దులో ఇద్దరూ కలుపుకోడానికి వీలుగా వున్న ఓ ఎకరం పొలం అమ్మకానికొచ్చింది. ఇద్దరూ పోటీపడగా వీరభద్రయ్య గెలిచారు. అదిగో అప్పట్నుంచీ ఆయనంటే ఈయనకి కోపం, కక్ష!

మరో పెద్ద పరంధామయ్య. ఆయన ప్రతీదీ పవిత్రంగా వుండాలంటారుగాని తానెంత పవిత్రంగా వుంటున్నదీ చెప్పరు. తక్కువ కులాలవారి విషయం వస్తే 'కుక్కని తీసుకెళ్ళి సింహాసనంమీద కూర్చోబెడతామా?' అని ప్రశ్నిస్తారు. తమకన్నా పెద్దకులస్తుల సంగతొస్తే 'బ్రాహ్మలైనా మామీదపడి బతకాల్సిందే. వాళ్ళ గొప్పేమిటి మధ్యన?" అనేస్తారు.

శివస్వామి కొడుకు నారాయణ మరోపెద్దమనిషి. స్వతంత్రభావాలు లేనివాడు. పెద్ద మునసబుగారికి తోకలా వ్యవహరిస్తూ పబ్బంగడుపుకోవాలని చూస్తూంటాడు. ఈసారైనా తనని ఉపసర్పంచిని చెయ్యకపోతారా అని అతడి ఆశ. సూర్యంతో జరిగిన గొడవవల్ల తండ్రిపోయినప్పట్నుంచీ లోలోన రగుల్తున్నాడు. సమయంకోసం పొంచి చూస్తున్నాడు.

ఇంకో పెద్దమనిషి పేరు రామ్మూర్తినాయుడు. ఆయన తాత ముత్తాతలకి శ్రీరాముడు పూనేవాట్ట. కాని ఆయనకి పూనటం లేదు. వూళ్లో పెరుగుతూన్న అక్రమాలూ వర్ణ సంకరాలూ దానిక్కారణమని నిందిస్తుంటారు.




వెంకటరెడ్డి ఇంకో పెద్దమనిషి. మాలలు తనింటిమీదకి దాడికొచ్చినప్పట్నుంచీ మేక పోతు గాంభీర్యం ప్రదర్శిస్తున్నారన్న మాటే గాని లోలోన చాలా భయంగా వుంది. అదే సమయంలో పెద్దమునసబు తనని రక్షించ లేదని వుక్రోషంగానూ వుంది.

మిగిలిన పెద్ద గోపాలం. ప్రస్తుత సమా వేశానికి రాలేదు. ఆయన పెద్దమునసబుకి వ్యతిరేకంగా గ్రూపుకడుతున్నట్టు నీలి వార్తలు.

ఇదీ ఆ వూరి పెద్దల సంగ్రహ చరిత్ర.

వచ్చిన పెద్దల్ని పరామర్శించి రాని గోపా లాన్ని తలచి మీసం దువ్వుకుని విషయ మంతా వివరించారు పెద్దమునసబుగారు.

"అదీ జరిగింది. ఇప్పుడు మన వీరభ ద్రయ్య ఏం చేస్తే బావుంటుందో చెప్పండి" అన్నారాయన.

ఆయనకి వీరభద్రయ్యమీద పెద్దగా ఇష్టమూ లేదు అలాగని అయిష్టమూలేదు. అతడో సన్నకారు రైతు అవడంవల్ల అతడి వల్ల తనకి కలిసొచ్చేదేంలేదు. కానతడు గోపాలం ముఠాలోకి వెళ్ళకుండా చూడా ల్సిన అవసరం వచ్చిపడింది గనుక విష యాన్ని జాగ్రత్తగా డీల్ చెయ్యాలనుకున్నా రాయన.

"మనదాకా రావడానికి దసలు సమస్యేనా అని? చాతుర్వర్ణం మయసృష్టం గుణకర్మ విభాగితం అని కృష్ణపరమాత్ముడు గీతలో స్పష్టంగా చెప్పేడు. అంచేత వర్ణవ్యవస్థని కాపాడాల్సిన బాధ్యత మనందరిమీదా వుంది. అందుకు విరుద్ధంగా ప్రవర్తించిన వారిని తీవ్రంగా శిక్షించడం ద్వారా అలా టివి మళ్ళీ మళ్ళీ జరక్కుండా నిరోధిం చొచ్చు అంచేత సారథితో సంబంధం తెగ్గొ ట్టేసుకోవడమే ఏకైక పరిష్కారమార్గం" అన్నారు కృష్ణమాచార్యులు.

"నిజమే అనుకో. కానీ కన్న ప్రేమ కదా. ఇంటికి పెద్దవాడు కూడానాయె. అందుకని ఏ శాంతో మరోటో చేసి..."

పెద్దమునసబుగారికి మధ్యలో అడ్డొ చ్చారు పరంధామయ్య. "ఆ మాదిగదాన్ని పవిత్రంచేసేసి కోడలిగా స్వీకరించమం టారు? అంతేగా మీరనేది? గొడ్డుతోలు కెన్ని పూజలు చేసి ఎన్ని బొట్లుపెట్టినా తెల్ల బడుతుందా చెప్పండి? "

"బాగా సెలవిచ్చారు. మన సంస్కృతన్నా శాస్త్రాలన్నా ఎంతో గౌరవాభిమానాలున్న పెద్దమునసబుగారిలా మాట్లాట్టం ఆశ్చ ర్యంగా వుంది. ఏది శాస్త్రసమ్మతమో అది చెప్పాలిగాని మనవాడని ఒకటీ పరాయివా డని మరోటీ చెబితే ఎలా? " దెప్పిపొడిచారు కృష్ణమాచార్యులు.

"మునసబు బాబాయ్- ధర్మశాస్త్రప్రకారం ఏది న్యాయమో అది చెప్పండి. చేసేస్తాను" వుక్రోషపడ్డారు వీరభద్రయ్య.

"పోనీ ఆ పిల్లని వదిలేస్తాడేమో కను క్కుని వదిలేస్తానంటే గోదావరిస్నానం చేయించి గుళ్ళో అభిషేకం గట్రా చేయించి ఆ సహవాసదోషాన్ని పోగొడితే? " మునస బుగారి వంక చూస్తూ చిన్నగా అన్నాడు నారాయణ.

వీరభద్రయ్యలో ఓ ఆశ మెరిసి మాయ మయ్యింది.

కృష్ణమాచార్యులు ముఖం కొంచెంగా వాడింది.

"గంగలో మునిగినా ఆ దోషం పోదు. ఏమనుకుంటే ఏంలాభం అంతా కలికాలము హత్యం!" తనకి శ్రీరాముడు పూనకపోవడా నికి ఇది ఓ కారణమే అయ్యుంటుందను కుని నిట్టూర్చారు రామ్మూర్తినాయుడు.

"ఆ అమ్మాయిని వదలిపెట్టడానికి మీవా డొప్పుకుంటాడా వీర భద్రయ్యా!" మునసబు గారు ప్రశ్నించారు.

ఒప్పుకోడని బదులివ్వబోయే ఆగారు. ఒకవేళ బతిమాలితే ఒప్పుకోవచ్చేమోనన్న



ఆశ ఆశపెట్టిందాయన్ని.

"అబ్బే. అలాటి వుద్దేశ్యం లేనట్టు మిత్రుల్తో చెప్పేడని నాకు రూఢిగా తెలిసింది. అంచేత అతగాడిని వెలివేసి సంఘం చెడిపోకుండా కాపాడాల్సిందే. ఇలాటి విషయాల్లో తాత్సారం పనికిరాదు"

కృష్ణమాచార్యులి మాటలకి రోషం పొడుచుకొచ్చింది వీరభద్రయ్యకి. విసురుగా లేచారు. "ఓయబ్బో! నీకన్నా నాకు పట్టుదల ఎక్కువ ఏమనుకున్నావో. కులవృత్తి చేసుకోక రొయ్యల వ్యవసాయం చేస్తోన్న ఈయనా నాకు చెప్పేది? మునసబు బాబాయి! మా వాడిని అడిగి చూస్తాను. ఆ పిల్లని వదిలేస్తానంటే సరే వదలనంటే వాణ్ణే వదిలేస్తాను. చచ్చిపోయాడనుకుంటాను. కులమూ కట్టుబాటూకన్నా కొడుకెక్కువకాదు నాకు"

"సరే... అలా కానిచ్చేద్దామోయ్" అంటూ లేచారు మునసబుగారు.

విజయదరహాసం కదలాడింది కృష్ణమాచార్యులి పెదాలమీద!

విసవిసా నిష్క్రమించారు వీరభద్రయ్య. కాని పదడుగులు వేశారో లేదో ఆయనకోపమూ పట్టుదలా నీరుకారిపోయాయి. కన్నీరు పొంగివచ్చింది.

'సారథి పట్టుదల తనకి బాగా తెలుసు. ఆ పిల్లని వదల్డుగాక వదల్డు. చూస్తూ చూస్తూ ఇంటిపెద్దకొడుకుని ఎలా దూరంచేసుకోవడం? అసలు దీనికంతకీ కారణం ఆ పిల్ల. ఆ వగలాడి. ఏదో మాయమాటల్జెప్పి వలలో వేసుకునుంటుంది. దాన్ని నరికి పోగులెట్టినా పాపం లేదు. అసల్దీనికంతటికీ కారణం ఆ మునిరత్నంగాడు. ఆ నక్కగాడి వల్లే ఇంత గ్రంధమయ్యింది. లేకపోతే ఆ పిల్లెవరో దాని కులమేమిటో ఎవరికీ తెలిసేదికాదు. పరువూ మర్యాదా పోయే పరిస్థితీ ఏర్పడేదికాదు. అంతా కర్మ! పోనీ వాడితో సంబంధం వదులుకున్నామని చెప్పి తామే చాటుమాటుగా వాడిదగ్గరికెళ్ళి వస్తే? చెట్టంత కొడుకునీ వాడు పంపేడబ్బునీ ఎలా వదులుకోవడం? కానా సంగతి కృష్ణమాచార్యులి కంటబడిందో తన మర్యాద మంట కలిసిపోతుంది. కన్న ప్రేమంటే ఏమిటో తెలీని మూర్ఖుడాయన! ఆయన కూతురు ఏ మాలాడితోనో లేచిపోతేగాని తెలిసిరాదీ కడుపుకోత! ఇప్పుడేం చెయ్యడంరా భగవంతుడా!'

ఆలోచనలు తెగలేదుగాని ఇల్లొచ్చింది.

కాళ్ళీడ్చుకుంటూ లోపలికెళ్ళారు. భార్య ఏడుస్తోంది. తనకీ దుఃఖం పొంగివచ్చింది.

"కొడుకు ఏదో ఉద్ధరిస్తాడనీ తవ్వితలకెత్తుతాడనీ ఆశిస్తే నిలువునా ఏడవమని శపిస్తున్నాడు!" అనుకుంటూ ఏమయ్యిందని అడిగాడు.

"అబ్బాయి వాళ్ళూ లేరు. అన్నంతినలేదు..."

ఆయన పితృహృదయంతల్లడిల్లింది.

"కిష్టయ్య మాస్టారింటికి వెళ్ళారేమో. కనుక్కొస్తానుండు"

పైపంచె భుజానవేసుకుని ఆ అపరాత్రి వేళ మాస్టారింటికెళ్ళారు వీరభద్రయ్య.

తలుపుతట్టి అడిగాడు.

మాలపల్లెలోని సూర్యం ఇంటికెళ్ళారని తెలిసి మ్రాన్పడిపోయారు. మొఖంలోని రక్తమంతా ఇంకిపోయింది. అవయవాలన్నీ స్వాధీనం తప్పినట్టుగా అయిపోయాయి. రెండడుగులు వేసేఓపిక కూడా లేనట్టు అక్కడే చతికిలబడిపోయారు!

★ ★ ★

అర్థరాత్రి అయినా మాలపల్లెలో మాదిగ గూడెంలో నిద్రపోయిన వాళ్ళు చాలాతక్కువ. అంతా ఎర్రెంకడి ఇంటిచుట్టూ చేరారు. వారిలో అన్నిరకాల దళితులూ వున్నారక్కడ!





బయట వెన్నెల్లో వేసిన మంచంమీద సారథి, సూర్యం, జాన్, మల్లిగాడు మొదలైన యువకులు కూర్చున్నారు. పక్కన చాపలమీదా కటికనేలమీదా జనం కూర్చుని తమతమ అనుమానాలని నివృత్తిచేసుకుంటున్నారు.

లక్ష్మి తమ కులస్తురాలని తెలీడంతో మొత్తం మాదిగగూడెం జనాన్ని తీసుకొచ్చాడు మల్లిగాడు. వారి ఆడవాళ్ళంతా లక్ష్మి చుట్టూచేరారు.

నిన్ను బాగా చూస్తున్నాడా? ఇంట్లోకీ దేవుడి గదిలోకీ రానిస్తారా? ఇరుగుపొరుగు మాట్లాడతారా? ఏం ఉద్యోగం చేస్తున్నావ్? జీతం ఎవరు ఖర్చుపెడతారు? నగర విశేషాలేమిటి? అంటూ రకరకాల ప్రశ్నలు గుప్పిస్తూ జవాబులు విని మురిసిపోతున్నారు. "అయితే బాబూ. కులాల్ని దేవుడు సెయ్యలేదంటావా? " ఒక మాల పెద్ద అడిగాడు సారథిని.

"లేదు దేవుడు చెయ్యలేదు. పూర్వకాలంలో అసలు కులాల్లేవు. స్వంత ఆస్తుల్లేవు. అంటే కూలీలూ రైతులూ రాజులూ అంటూ లేరన్నమాట. అంతా సమానంగా అన్నదమ్ముల్లా కలిసుండేవారు

"ఎప్పుడైతే వ్యవసాయం పెరిగిందో, మార్పు వచ్చిందో, అడవుల్ని కొట్టి పంటలు పండించడం ఆరంభమైందో అప్పుడే అక్కడ పనిచేయడానికి శ్రామిక బలగం అవసరమైంది. యుద్ధాలలో ఓడినవారినీ ఆక్రమిత రాజ్యాలలోని జనాన్నీ పన్నుకట్టని దాసుల్ని శ్రామికులుగా మార్చేశారు. శ్రమవిభజన పేరుతో కుల వ్యవస్థని ప్రవేశపెట్టారు.

"చాతుర్వర్ణాలంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులన్నమాట. క్షత్రియులు పాలకులు. బ్రాహ్మణులువారికి సలహాలిచ్చే మంత్రులూ మత గురువులూ. వైశ్యులు వుత్పత్తీ వాణిజ్యం చూసేవారు. ఇహ శూద్రులు శ్రమించి పంటల్ని పండించేవారు, సంపద సృష్టించేవారు. చేతి వృత్తులు చేబట్టి చాకిరీ చేసేవారు.

"వ్యవసాయం, చేతివృత్తులూ అభివృద్ధి చెందేసరికి శూద్రుల్ని మళ్ళీ చీల్చారు. శవ దహనం వగైరా దిగువస్థాయి పనులు చేసే కార్మికుల్ని విడదీసి అస్పృశ్యులని ముద్రవేశారు. గతజన్మలో చేసుకున్న పాపపుణ్యాలను బట్టి ఈ జన్మలో చేసేపని నిర్ణయింపబడుతుందని చెప్పి దానికి మతం రంగుపులిమి బలహీనుల్ని చేశారు.

"ఈ కులవ్యవస్థ అన్యాయమని చార్వాకుడు, బుద్ధుడూ మొదలైన వాళ్ళు దానికి వ్యతిరేకంగా కృషి చేశారుగాని ఆర్థిక అసమానతలు తొలగాల్సిన అవసరాన్ని వారు గుర్తించలేకపోయారు.

"అంచేత మీరంతా సాంఘికంగా ఎదగాలి. ఆర్థికంగా నిలబడాలి. అప్పుడే మీ స్థితిగతులూ మీ జీవన పరిస్థితులూ మెరుగుపడతాయి. అంతవరకూ దళితులమీద దాడులూ చిత్రవధలూ దోపిడీలూ హత్యలూ జరుగుతూనే వుంటాయి..."

సారథి మాటలకడ్డొస్తూ "మొన్నామధ్య బొండు చల్లయ్య తల్లిని వెంకటరెడ్డిగారు పట్టుకుకొట్టారండి. అది ఆ దెబ్బతో తీసుకు తీసుకు చచ్చింది" అన్నాడు జాన్.

"మరి మీరేం జేశారు? "

"వూరుకోలేదు సారథీ" అంటూ అవాళ జరిగిందంతా వివరించాడు సూర్యం.

"ఇలాంటి దౌర్జన్యకాండలు ఇక్కడేకాదు. చాలాచోట్ల చాలాసార్లు జరుగుతున్నాయి. ఇలాటివి జరక్కూడదంటే మీరంతా సుఖంగా స్వేచ్ఛగా బ్రతకాలంటే మీరు కులాలుగా మతాలుగా చీలిపోకూడదు. ఏ కులపువారైనా సరే పేదలంతా ఒక్కటే. శ్రామికులంతా ఒక్కటే. అని భావించాలి. వర్గస్పృహతో ఐకమత్యంగా పోరాడాలి. అప్పుడు మీరు సాధించలేనిదంటూ వుండదు" అన్నాడు సారథి ఆవేశంగా.

"గుళ్లోకి వెళదామంటే రాకూడదని వాళ్ళూ, వెళ్లకూడదని వీళ్ళూ పట్టుబడుతున్నారు. దేవుడిముందు కూడా అంటరానితనాన్ని ప్రదర్శించేవాళ్ళే అసలైన అస్పృశ్యులు. మీ మాటలు వింటోంటే ఏదో చేసెయ్యాలని రక్తం పొంగుతోంది." అన్నాడు జాన్.

"ఆ సంఘటనంతా తెలిసిందిలే. సరే. రేపే మనమంతా గుళ్ళోకి వెళదాం సరేనా? "

సారధి మాటలకి విస్తుబోయారు కొందరు. హర్షధ్వానాలు చేశారు కొందరు.

ఎర్రెంకడూ కొందరు పెద్దలూ గొణిగారు. కాని వారి మాటల్నెవరూ పట్టించుకోలేదు.

"ఎక్కడనొక్కితే ఎవరు దార్లోకొస్తారో నాకు తెలుసు. అంతా సవ్యంగా జరిగేట్లు నేను ఏర్పాట్లు చేస్తానుగా" అన్నాడు.

పెద్దమునసబుగారింటిముందు పోలీసు జీపు ఆగింది. అందులోంచి యస్సై, నలుగురు కానిస్టేబుళ్ళు దిగారు.

ఆ దృశ్యం కంటబడేసరికి పెద్దమునసబుగారి నోటిలోంచి చుట్ట జారి పడింది.

లేచి మర్యాదగా ఆహ్వానించారు. ఆసనాలు జూపారు. టీ టిఫిన్లయ్యాక అన్నారు మెల్లగా "వురుములేని పిడుగులా వచ్చారు"

"మీ ఊరి యువకులు మా సాయం కావాలన్నారు".

"నాదృష్టికి రాని విషయమేమిటైవుంటుంది? "

"ఈవూళ్ళోని వెంకటేశ్వరస్వామి గుడిలోకి హరిజనుల్ని రానివ్వటంలేదని ఫిర్యాదుచేశారు. గుడి వూరందరిదనీ గుడినిర్మాణానికి అన్ని కులాలవారూ చందా లిచ్చారనీ పేర్కొన్నారు. ఇవాళ గుడిలోకెళ్తామనీ గొడవలు జరక్కుండా చూడమనీ కోరారు. పెద్దమునసబుగారు మీ వూరికి పెద్దదిక్కుగా వుండగా మేమెందుకోయ్ అన్నా విన్పించుకోలేదు. దాంతో రాక తప్పలేదు" యస్సై అన్నాడు.

"అవునవును. అంతా తలోచెయ్యీ వెయ్యటంనిజమే. తర్వాతెవరెవరో మడులూ మాన్యాలూ ఇచ్చారనుకోండి. అది వేరే విషయంకదా. అయినా ఈరోజుల్లో కులాలంటూ దూరంగా వుంచడం అమానుషమని నేనూ చెప్పేను. కాని మా వూరిపెద్దలు వినలేదు. సరే. ఈ రకంగా ఒక మంచి కార్యం మా వూళ్ళో జరుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది."

ఆ యస్సై హరిజనుడని తెలుసాయనికి. అందుకని గ్రామనౌకర్లని పిలిచి మరింత హడావుడి చేశారు.

మాలమాదిగలంతా ఆడామగా పిల్లాపాపల్తో సహా స్నానాలు చేసి బొట్టు పెట్టుకొని పూలూపళ్ళతో గుడివైపు కదిలారు. విస్మయంగా చూసింది వూరు.

యస్సైతోబాటు పెద్దమునసబుగారు కూడా గుడిదగ్గరకెళ్ళారు. తానెంతో ఆనందపడుతున్నానంటూ సూర్యాన్ని పిలిచి మరీ చెప్పారు.

కాని ఇంతలోనే జనం లోపలికి రాకుండా గేటు వేయించేశారు కృష్ణమాచార్యులు.

అంతా నివ్వెరపోయారు. కేకలు పెట్టారు.

యస్సై కోపంతో అరవబోతోంటే ఆగమని సైగచేసి ముందుకెళ్ళారు మునసబుగారు.

"ఆచార్లూ! ముందు వాళ్లని లోపలికి వెళ్లనియ్యి. నీకంతా తర్వాత చెబుతానుగా" అన్నారు.

అపనమ్మకంగా చూశారు కృష్ణమాచార్యులు.

"ఈ మాటలంటున్నది మీరేనా? మునస





బుగారేనా? నా చెవుల్ని నమ్మలేకపోతున్నాను"

"నేనే గాని ముందుగేటు తీయించు" కసురుకున్నట్టుగా అన్నారు.

గేటు తీయించి అందర్నీ దారివదలమని చెప్పి వారిమధ్యలోంచి బయటికెళ్ళిపోయారాయన.

ఆయన్ని ఆగమన్లేక మిగతా పూజారులకి సైగచేశారు మునసబుగారు.

పొలోమంటూ జనం గుడిలో ప్రవేశించారు.

జేగంటలు మ్రోగాయి.

ఇంతలో సంగతెలా తెలిసిందో ఏమోగాని మునసబుగారి ప్రత్యర్థిగా ఎదగడానికి ప్రయత్నిస్తోన్న గోపాలం వచ్చాడు. బండినిండా ఒలిచిన కొబ్బరికాయలు వేసుకుని మరీ వచ్చాడు.

తలోటీ ఇస్తూ "దేవుడికి కొట్టండ్రా కొట్టండి. ఇక అడ్డొచ్చే పెద్ద ఎవడూలేడు" అన్నాడు హుషారుగానూ కాస్త వ్యంగ్యంగానూ.

ఎంతో అనుభవమున్న మునసబుగారు కూడా కాస్సేపాసంఘటనని జీర్ణించుకోలేకపోయారు. మొత్తం ఘనతని అతగాడు కొట్టేస్తాడేమో తద్వారా దళితుల్లో పేరు పెంచేసుకుంటాడేమోనని భయపడ్డారు.

గ్రామంలోవున్న తొమ్మిది వార్డుల్లో నాలుగు మాలమాదిగ ఎరుకయానాది వాళ్ళవి మరి! వారిని మంచి చేసుకోకపోతే సర్పంచి పదవేకాదు ఉపసర్పంచి పదవి కూడా తన వర్గానికి దక్కదు!

గబగబా పూజార్ల దగ్గరకెళ్ళి "అభిషేకాలూ గట్రా చెయ్యండి. వారి జన్మజన్మల పాపమంతా ఇవాళ కొట్టుకుపోవాలి" అన్నారు మునసబుగారు అందరికీ విన్పించేలా.

సారథీ, సూర్యమూ యస్సైకి కృతజ్ఞతలు చెప్పారు. అతడు కూడా తనవాళ్ళకి సహాయబడగలిగినందుకెంతో ఆనందించాడు.

యస్సైని భోజనానికంటూ తమింటికి తీసుకెళ్ళారు మునసబుగారు.

ఆ సంగతి యువకులకి ప్రత్యేకంగా చెప్పేడు సారథి.

"ఆ ఇన్స్పెక్టరూ హరిజనుడే. అయినా అతడ్ని ఇంటికి తీసుకెళ్తున్నాడు. మర్యాదగా చూస్తున్నారు. కారణం? అధికారి గనుక! పెరుమాళ్ళునీ అంతా గౌరవిస్తారు. మర్యాదగా పిలుస్తారు. కారణం? మాజీ యమ్మెల్యే. భూస్వామి. అంతేగా? ఆలోచించండి"

తీర్థానికెళ్ళినట్టు దళితులంతా గుడికెళ్ళడం వూరితోబాటు అగ్రహారమూ చూసింది. ఆపైన ముక్కుమీద వేలుంచుకుంది.

కృష్ణమాచార్యులు తమ ఇంటి అరుగు మీద అసహనంగా కూర్చుని ధుమధుమలాడుతున్నారు. ఒళ్ళంతా బ్లేడుతో చీరి కారం పూసినట్టుంది మరి!

"వెధవలు! వీళ్ళని అలగాజనం అని వూరికే అన్నారా. పోలీసుల అండ చూసుకుని దౌర్జన్యంగా పవిత్రతఆలయంలో ప్రవేశిస్తారా? అందుకే దేశం కరువుకాటకాలతో దారిద్ర్యంతో అల్లల్లాడిపోతోంది. పూర్వం బ్రాహ్మల్ని ఎంతగొప్పగా గౌరవించేవారు. రాజులుకూడా వారిమాటల్ని జవదాటేవారు కాదు. ఇప్పుడంతా తలకాయలకే విలువ. ఓట్లకాలంకదా. ఓటున్నవాళ్ళంతా మహారాజులైపోయారు. వాళ్ళని కాకాపట్టడానికి రిజర్వేషన్లూ పట్టాలూ పథకాలూనూ! ఛాఛా- అంతా కంగాళీ అయిపోయింది. ఎప్పటికో అప్పటికి ఈ పాప భాండం బ్రద్దలుకాకపోదు. మళ్ళీ రాజుల కాలం రాకపోదు. బ్రాహ్మల ప్రభవెలక్కపోదు...!"

అంతలో శతాధికవృద్ధుడైన నరసింహాచార్యులొచ్చారు. దాంతో ఆయన ఆలోచనా మాలిక తెగిపోయింది.

"కృష్ణమాచార్లూ! నువ్వు గుడికెళ్ళలా? మావాడెళ్ళాడే!"

"ఆ కడజాతి వాళ్ళిచ్చింది దేవుడి కర్పించడానికి, నేనెలా సిద్ధపడతాను? అందుకనే వచ్చేశాను"

"ఇదంతా మీ పాలేరు వల్ల వచ్చిన అనర్థం. వాణ్ణి తీసిపారెయ్యకూడదూ?"

గతుక్కుమన్నారు కృష్ణమాచార్యులు.

సూర్యాన్నెలా తొలగించగలరు? రొయ్యల చెరువు బ్రహ్మాండంగా వుంది. ఇదివరకు వరిపంటద్వారా పంటకి పాతికవేలు కూడా చేతికొచ్చేవి కాదు. ఇప్పుడేకంగా లక్షాపాతిక దాకా రావచ్చని అనుభవజ్ఞులు అంచనా వేస్తున్నారు. సిరిరా మోకాలడ్డుతారా ఎవరైనా?

"మీరు చెప్పింది సత్యమే పెద్దయ్యా. కాని పాలేర్ని మధ్యలో తొలగిస్తే చాలా గొడవలవుతాయి. అంచేత మళ్ళీ తొలిఏకాదశికి తొలగించేద్దామని నిశ్చయించుకున్నాను"

"అదీ నిజమే. అన్నట్టు ఇహవాళ్ళు రోజూ గుడికొస్తూనే వుంటారు కదా. మరటువంటప్పుడు గుడికెళ్ళడం మాని జీవనాధారం పోగొట్టుకుంటామా చెప్పు?" నరసింహాచార్యులన్నారు. కృష్ణమాచార్యులు మానేస్తే ప్రధాన అర్చక పదవి తనకొడుక్కి వస్తుందని ఆయన ఆశ!

ఆయనేం మాట్లాడలేదు. ముసలాయన కాస్సేపు చూసి వెళ్ళిపోయారు.

వారి సంభాషణ విన్న పుష్పవల్లి లోపల్నుంచి పరుగునొచ్చింది "పూజారి పని వదులుకుంటారా?" అంటూ.

"పాడి ఆవునెవరు వదులుకుంటారే పిచ్చిదానా. అయినా మనం వదులుకుంటే వాళ్ళకి లొంగినట్టుకాదూ? దాంతో వాళ్ళు మరీ బరితెగించిపోరూ? అంచేత వెనక్కి తగ్గినట్టు నటిస్తూనే వాళ్ళని లొంగదియ్యాలే. లేకపోతే ఇవాళ దేవుడికి పూజ చేస్తామనొచ్చిన వాళ్ళు రేపు పూజారులుగా మేమే వుంటామంటారే!!"

"కేరళలో హరిజనుల్ని పూజారులుగా నియమించారని చదివాను నాన్నా" అక్కడే వున్న అలివేలు అంది.

బుస్సున లేచారాయన.

"అందుకే ఆ చెత్త పుస్తకాలు చదవొద్దన్నాను. వాటిల్లో అంతకంటే మంచి రాతలేం తగులడ్తాయ్. నిక్షేపంలా భారత రామాయణాలు చదువుకోక ఆ పుస్తకాలెందుకు? ఇంకోసారి ఆ దరిద్రకొట్టు పుస్తకాలు చదివేవంటే కాళ్ళిరగ్గొడతాను జాగ్రత్త!!"

అలివేలు మౌనంగా నిష్క్రమించింది.



"మీరు మాకిచ్చిన ఆతిథ్యానికీ చూపిన ఆదరణకీ మా కృతజ్ఞతలు. మీ అందర్నీ విడిచి వెళ్ళాలంటే ఎంతో బాధగా వుంది. కాని వుద్యోగాలరీత్యా వెళ్ళక తప్పదుకదా"

అందరి దగ్గరా శలవు తీసుకుంటూ అన్నారు లక్ష్మి సారథీ.

తమ ఆప్తుడు దూరమౌతున్నట్టు బాధపడ్డారంతా. "మమ్మల్ని మర్చిపోకండేం" అన్నారు ఆర్ద్ర నయనాలతో.

"మిమ్మల్నీ మీ మంచితనాన్నీ మేమెప్ప

టికీ మరచిపోం. సంస్కృతికంగా ఆర్థికంగా రాజకీయంగా ముందడుగు వేయడానికి మీరు జరిపే పోరాటాలన్నీ విజయవంతం కావాలని మరసారా ఆశిస్తున్నాం. శలవ్"

చాలామంది కొంతదూరం సాగనంపి పనులకెళ్ళాలని చెప్పి వెళ్ళిపోయారు. సూర్యం మరికొందరు యువకులూ బస్సెక్కి స్తామంటూ వంతెనదాకా వెళ్ళేరు.

వీరభద్రయ్య వస్తారని అంతా ఎదురు చూసి నిరాశ పడ్డారు. కనీసం హైదరాబా దెళ్ళిపోతోన్న కొడుక్కి వీడ్కోలివ్వడానికైనా రావొద్దూ అని నొచ్చుకున్నారు.

ఇంతలో సారథి తమ్ముడు ఎనిమిదేళ్ళ శశి ఓ సంచీ భుజానేసుకుని పరుగున వచ్చాడు.

సారథి ఎదురెళ్ళి ఎత్తుకున్నాడు. "ఏరా శశీ బావున్నావా" అంటూ.

"ఓ" తలూపాడు.

"మీ వదినతో మాట్లాడతావా"

తలూపాడు మళ్ళీ

లక్ష్మి దగ్గరికొచ్చింది. "ఈవిడెవర్రా" అన డిగాడు సారథి.

"వదిన"

"నీకెవరు చెప్పేర్రా? "

"నువ్వే"

"అయితే పిలువు"

"వదినా!"

లక్ష్మి మహదానందపడిపోయింది. సారథి చేతుల్లోంచి తీసుకుని శశిని ఎత్తు కుంది. వాడి బుగ్గలు పుణికి ముద్దుపెట్టు కుంది.

"వదినా! నువ్వు మంచిదానివి. మా అమ్మ మంచిదికాదు"

"ఏం బాబూ. అమ్మకొట్టిందా? "

"వూహూ- ఎత్తుకోమంటే చిన్నపిల్లాడివా అని తిడుతుంది".

నవ్వేరంతా. లక్ష్మి శశి ముక్కుపట్టుకులా గింది కొంటెగా.

"మరేమో అన్నయ్యా- అమ్మ ఈ సంచినీ కిమ్మంది".

సంచిలోని పొట్లం బయటికి తీశాడు సారథి. తనకెంతో ఇష్టమైన కజ్జికాయలు. తల్లి కళ్ళముందు కదిలింది. కళ్ళు చెమ్మగి ల్లాయి.

"మరేమో అన్నయ్యా. అమ్మానాన్నా నిన్నుతిడుతూ ఏడుస్తున్నారేం? "

నిట్టూర్చి అన్నాడు "ఈ వదినని పెళ్ళిచే సుకున్నానని"

"పెళ్ళిచేసుకుంటే ఇంచక్కా కొత్తబట్టలు తొడుక్కుని బూరెలు తిని బాజాలు చూడా లిగానీ ఏడుస్తారా ఎవరైనా? "

"నువ్వు చిరుదేవుడివిరా. కులాల అడ్డుగో డలగురించి తెలిసేవయస్సుకాదురా నీదీ" అన్నాడు.

"నువ్వేంచెప్పేవో తెలీటంలేదన్నయ్యా".

"పెద్దయ్యాక తెలుస్తుందిలేరా" అక్కడున్న దుకాణంలో చక్కెరకేళీలో రెండు డజన్లు కొని సంచిలో పెట్టి "అమ్మకివ్వు" అన్నాడు.

అంతలో బస్సొస్తూ కనిపించింది.

లక్ష్మి శశిని ముద్దుపెట్టుకొని వాడిజే బులో యాభైనోటు కుక్కి "ఏమైనా కొనుక్కో" అంది, వాడు ఏనుగునెక్కినంత సంబరపడ్డాడు.

అందరికీ వీడ్కోలు చెప్పి బస్సెక్కేరు లక్ష్మి, సారథీ.

బస్సు వెళ్ళిపోయింది.

అంతా భారంగా కదిలారు.

వాళ్ళగురించే ముచ్చటించుకుంటూ నడు స్తున్నారు.

సారథి రాక సూర్యంలో నవ్యోత్సాహాన్ని

నింపింది. నూతనోత్తేజాన్ని కలిగించింది. తనుకూడా ఏదో చెయ్యాలి మరేదో సాధిం చాలన్న పట్టుదల పెరిగింది.

అలివేలు గుర్తొచ్చింది.

ఆమె నవ్వూ చూపూ కళ్ళముందు కది లాయి.

అప్పుడెప్పుడో అతడి మదిలోపడ్డ ప్రేమబీ జాలు గబగబా మొలకెత్తసాగాయి.

★ ★ ★

రొయ్యలు బాగా పెరిగాయి. ఇంకో పది పదిహేను రోజుల్లో పట్టేసి అమ్మెయ్యొచ్చు దొంగతనాలు జరక్కుండా చెరువుదగ్గరే కాపలా వుంటున్నాడు సూర్యం రాత్రీ పగలూ కూడా.

భోంచేసి వద్దామని మధ్యాహ్నం వేళ ఇంటికెళ్తోంటే దార్లోని ఓ పొదమాటునెవరో దాక్కునున్నట్టు అనిపించింది. అటు వెళ్ళి చూశాడు. సగంచీర గట్టుమీద పరచివుంది.

అరువిస్తోన్న నెపానికి షావుకారుకి తనని తాను సమర్పించుకున్న రంగి గుర్తొచ్చింది.

"ఎవరదీ" గట్టిగా పిలిచాడు.

జవాబు లేదుగాని చీర కొంగు లాగేసుకు న్నారు హడావిడిగా.

"ఎవరంటే మాట్లాడరేం? "

అప్పటికీ సమాధానం రాకపోయేసరికి, "ఏంజేస్తున్నారక్కడ" అంటూ బోదెదాటి వెళ్ళాడు.

సిగ్గుతో కుంచించుకుపోయి మోకాళ్ళలో ఒళ్ళు దాచుక్కూర్చున్న బంగారిని గుర్తిం చాడు.

"ఏమే బంగారీ- ఏంజేస్తున్నావిక్కడ? "

ఆమె మాట్లాడలేదుగాని తడిసిన చీరకొం గుని చుట్టుకుని ఒళ్ళంతా కప్పుకోవాలిఅని శతవిధాల ప్రయత్నిస్తోంది. కొంచెం దూరంలో ఎండలో ఆరవేసిన జాకెట్టు కన్పించేసరికి తుళ్ళిపడి చూశాడు. ఆమె సగం చీర తడిసివుంది. అంటే కట్టుబట్టలు తప్ప వేరే బట్టలు లేనందున సగం చీరక ట్టుకొని సగం వుతికి ఆరవేసుకొంటోందన్న మాట!

"చీర ఆరేసుకుంటున్నావా? "

తలాడించింది.,

గబగబా ఇవతలికొచ్చేశాడు.

అతడి గుండెల్నెవరో వుక్కుహస్తాలతో పిండేస్తున్నట్టుగా వుంది.

యాభైఏళ్ళ స్వాతంత్ర్యం సాధించిన ప్రగతి ఇంతేనా? తిండీ బట్టా ఇల్లూ లాటి కనీస అవసరాలు కూడా తీర్చుకోలేనంత దౌర్భాగ్యస్థితిలో జనం వున్నారంటే ఈ ప్రణాళికలూ పథకాలూ ఎవర్ని వుద్ధరిం చను? ఎవరి జేబులు నింపను?

అతడి అణువణువూ నిస్పృహతో వేగిపో తోంది. ఆవేదనా భారంతో కృంగిపోతోంది. అయినా ఏదో ఆశ, మరోకాంతిరేఖ ఇంకో ధైర్యం అతడ్ని ఓదార్చాయి. వెన్ను తట్టాయి.

"కనీసం ఎండావానల్నుంచి తలదాచుకో డానికైనా ఇల్లు ఏర్పాటుచెయ్యాలి" ధృడంగా అనుకున్నాడు సూర్యం.

అన్నం తింటోంటే మాస్టారినుంచి కబురొ చ్చిందని చెప్పిందితల్లి.

"పొలం వెళ్ళేప్పుడు మాస్టార్ని కలిసి వెళ్ళాలే ."

అన్నట్టుగానే వెళ్ళాడు.

"ఫరవాలేదు సూర్యం. కాగితాలకీ పనుల వుతున్నాయి. చూస్తోంటే జిల్లాకలెక్టరు కార్యసాధకుళ్ళా వున్నాడు" మాస్టారన్నారు.

"ఇళ్ళస్థలాల గురించి జవాబొచ్చిందా మాస్టారూ"

"స్థలాలివ్వడమేకాదు. పేదహరిజనులకి కనీసం యాభై ఇళ్ళు నిర్మించమని ఆదేశం





చారు. ఇదిగో వుత్తర్వుకాపీ."

"చాలా సంతోషంగా వుంది మాస్టారూ. ఇది అమలైతే మాత్రం చాలామందికి చుట్టు గుడిసెల్లో పడుకోవాల్సిన అగత్యం తప్పుతుంది".

"యమ్మీవో గారొచ్చారు. మిమ్మల్నీ సూర్యాన్నీ రమ్మన్నారు." గ్రామనౌకరు వచ్చి చెప్పేడు.

"అయితే యంత్రాంగం కూడా కదిలిందన్నమాట. పద వెళ్ళిమాట్లాడదాం".

పెద్దమునసబుగారింటికెళ్ళేరిద్దరూ

ఆయన్తోనూ సర్పంచ్ అయిన వారబ్బాయితోనూ మాట్లాడుతున్నారు యమ్మీవో.

వాళ్ళని చూసి ముఖం ఎర్రగా చేసుకుని లేచి వెళ్ళిపోయారు పెద్దమునసబుగారు.

"మీరు ఇళ్ళకోసం కలెక్టర్ని ఆశ్రయించాల్సిన పనేముంది. నాతో చెబితే పక్కాఇళ్ళు కట్టించే ఏర్పాట్లు చేద్దునుకదా" సర్పంచ్ అన్నాడు.

"మీతో ఎన్నిసార్లు చెప్పలేదు. మీరెన్నివాగ్దానాలు చెయ్యలేదు? !".

"అహ- అప్పటిసంగతి వేరు. శ్మశానం ప్రక్కన కేటాయిస్తే వద్దని గొడవచేశారుకదా"

"వద్దన్న మాటనిజమే. ప్రత్యామ్నాయం కూడా చూపించాం. అయినా మీరు పట్టించుకోలేదు. మీకు మేమెక్కడ గుర్తుంటాంలే అనుకుని అధికారులతో మొరపెట్టుకున్నాం".

సూర్యం మాటలు వింటూ అతడ్ని అంచనా వెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు యమ్మీవో.

"అబ్బే అలాటిదేంలేదు. మీకోసం ఏమైనా చేస్తాను. ఇంకేదైనా పనుంటే చెప్పండి. చెయ్యకపోతే అడగండి" సవాలు విసిరినట్లుగా అన్నాడు సర్పంచ్ చిట్టిబాబు.

"మురిక్కాలువ ప్రక్కనున్న పోరంబోకుకి పట్టాలిప్పిస్తే వెనకబడ్డ కులాల్లోని కొందరు కలిసి రొయ్యల చెరువు తవ్వుకుంటారు. మీరా పని చేసిపెడితే హీనపక్షం పాతికకుటుంబాలకి ఉపాధి కల్పించినవారవుతారు" మాస్టారన్నారు.

పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్లయ్యింది. ఆ పోరంబోకు మీద చాలా మంది కళ్ళుపడ్డాయి. అందర్నీ కాదని తామే ఆక్రమించేసుకోవాలని పెద్దమునసబుగారి ఆలోచన. దానికి సర్పంచి వంతపాడి అదనుకోసం నిరీక్షిస్తున్నాడు. లక్షలవిలువైన లక్షణమైన భూమిని తాడూ బొంగరంలేని వాళ్ళకి ధారబోస్తాడా? లేదుగాకలేదు!

"అదేమీ వీలుకాదు. స్వాతంత్ర్యసమరయోధులకో మాజీ సైనికోద్యోగులకో దాన్ని కేటాయిస్తానన్నారు ఆర్డీవోగారు. యమ్మీవో గారూ- మరి మనం వెళ్ళి తుమ్మలతోపుని సర్వే చేసొద్దామా" తొందరపెట్టాడు సర్పంచ్.

అంతా ఆ ప్రాంతానికెళ్ళి పరిశీలించారు. విషయం తెలిసి మాలపల్లె జనం చాలా మంది గుమిగూడారు.

సూర్యమేకాదు మాలపెద్దలు కూడా వచ్చి ఆ స్థలంలో ఇళ్ళు కట్టించి ఇమ్మనీ అన్నింటికీ అనుకూలంగా వుంటుందనీ చెప్పేరు.

మరేమీ అన్లేక ఆ స్థలాన్నే ఖాయంచేసి త్వరగా ఇళ్ళు కట్టేట్లు చూడమనీ ప్రారంభోత్సవానికి మంత్రిగార్ని పిలవాలనుకుంటున్నాననీ అందరికీ విన్పించేలా చెప్పేడు సర్పంచ్.

"యమ్మార్వోతో మాట్లాడి డీయమ్ హౌసింగ్‌కి అప్పగిస్తాం. మీరుకూడా కొంచెం శ్రమదానం చేస్తే పక్కాఇళ్ళు నిర్మించుకోవచ్చు". యమ్మీవో అన్నాడు.

"తప్పకుండా చేస్తామండి" హామీ ఇచ్చాడు సూర్యం.

"నీలాంటి కుర్రాళ్ళు దేశానికి చాలా అవస



రమోయ్. కీపిట్ అప్" సూర్యాన్ని అభినం దించి జీపెక్కాడు యమ్డీవో.

ఇళ్ళు శాంక్షన్ అవడానికి సూర్యమూ మాస్టారూ కారణమని అంతా వాళ్ళని మెచ్చుకొంటోంటే కందగడ్డ మొఖంతో తనూ జీప్ ఎక్కాడు సర్పంచ్ చిట్టిబాబు.

★ ★ ★

రొయ్యల బ్రోకర్ నోట్లకట్టల్ని టేబుల్ మీద పేరుస్తోంటే కళ్ళు తిరిగినంత పన య్యింది కృష్ణమాచార్యులకి.

వారంరోజుల క్రితం రొయ్యలు అమ్మేశారా యన. ఆ డబ్బు కోసం ఓ సంచీ తీసుకుని టౌన్‌కి వచ్చారు.

నోట్లకట్టలు కొండలా నిలిచేసరికి ఆనం దంతో వుక్కిరిబిక్కిరై పోయారాయన. ఎన్నడూ ఇంతడబ్బు చూసెరగడు.

అంతా రొయ్య బంగారమహిమ!

తను తెచ్చిన సంచీ సరిపోలేదు. ఇంకో రెండు వేరే బ్యాగులు తీసుకుని కూరగా యలు వేసుకున్నట్టు నోట్లకట్టలు వేసుకుని బయటికొచ్చారు. డబ్బుని మోయటం కూడా కష్టమే సుమా అనుకుంటూ రిక్షాని పిలిచారు.

బ్యాంకులో అడుగు పెట్టాకగాని ఆయన మనసు కుదుటపళ్ళేదు. టెన్షన్ తగ్గలేదు.

బ్యాంకు అప్పు నిమిత్తం కట్టాల్సిన వాయిదా కట్టేశారు. పెట్టుబడి నిమిత్తం బంగారం తాకట్టుమీద తీసుకున్న అప్పు కూడా కట్టేశారు. అన్నీ లెక్కవేస్తే లక్షా నల భైవేలు మిగులు కన్పించింది.

వరిమీద మూడు నాలుగేళ్ళలో వచ్చే లాభం ఒక్క పంటలో వచ్చేసింది.

చెప్పలేనంత ఆనందంతో ఉక్కిరి బిక్కిరై పోయారు.



ఒక్క పదివేలు మాత్రం దగ్గరుంచుకుని మిగతా సొమ్ము బ్యాంకులో దాచారు. ఇంటి ల్లిపాదికీ కొత్త బట్టలు కొని తీసుకెళ్ళాల న్పించి బట్టల దుకాణానికెళ్ళారు.

భార్యకీ, కూతురికీ, తిరుపతిలో చదువు తోన్న కొడుక్కీ తనకీ కూడా బట్టలు కొన్నారు.

ఏసీ దుకాణంలోంచి బయటికొచ్చేసరికి ఎండ చురుక్కుమంది. కోపంగా సూర్యుడి వంక చూశారు. అప్పుడు గుర్తొచ్చాడు సూర్యం.

పాపం కష్టం అంతా అతడిదే. భూమి తనది. పెట్టుబడి తనది. అంతే. చెరువు తవ్వించటంనుంచి పంట తీయడంవరకూ శ్రమించింది సూర్యమే. అసలతడ్ని నమ్మే చెరువు తవ్వేడు. ఇవాళింతలాభం కళ్ళజూ శాడంటే అందుకు ముఖ్యకారకుడు నిస్సందే హంగా సూర్యమే.

అతడిక్కూడా బట్టలు కొంటే?

రెండో ఆలోచనకి తావివ్వకుండా తిరిగి షాపులోకెళ్ళి కాస్త చవకరకంలో జతబట్టలు కొన్నారు.

మిఠాయీ, అలివేలికి కొత్త వెండిపట్టాలూ కొనుక్కుని బస్సెక్కారు కృష్ణమాచార్యులు.

బస్సుదిగి వూళ్ళోకి నడుస్తోంటే ఒక రైతు ఎదురయ్యాడు.

"కృష్ణమాచార్యులగారి ముఖం దివ్యకాం తితో వెలిగిపోతోందేవిటి కథ? రొయ్యల పంట బాగా అచ్చి వచ్చినట్టుంది"

"ఏదో ఫరవాలేదు. బాగానే మిగిలిందిలే"

"బాగానే అని నెమ్మదిగా అంటారేవిటి. వూళ్ళోని అన్ని చెరువులకన్నా మీ చెరువు లోనే బాగా దిగుబడి వచ్చిందిట. రొయ్యలు మంచి కౌంటు కొచ్చాయిట... వూళ్ళో అంతా అనుకుంటున్నార్లే. ఎంతైనా మీరు అదృష్టవంతులండి. రొయ్యల గురించి మీకేమీ తెలీకపోతేనేం అన్నీ తెలిసినవాడు అంతా స్వంతమని భావించి చూసే పాలేరు

దొరికాడు"

తలూపి ముందుకి సాగారు.

ఆయన్ని చూసి నీళ్ళచెంబుతో ఎదురొచ్చింది పుష్పవల్లి.

కాళ్ళూ, మొఖమూ కడుక్కున్నారు. దాహం తీసుకోమని ఇల్లాలు కోరినా తీసుకోకుండా తిన్నగా పూజాపీఠం దగ్గరికెళ్ళారు. బొట్టు పెట్టుకుని పదివేలలో మిగిలిన డబ్బుని దేవుడిముందు పెట్టి సాష్టాంగపడ్డారు.

తూగుడుబల్లమీద కూర్చుని కృష్ణమాచార్యులు కాఫీ తాగుతోంటే బట్టల పాకెట్లు విప్పింది పుష్పవల్లి. అలివేలు అప్పుడే కొత్త పట్టాలని కాళ్ళకి పెట్టేసుకుంది.

"చేతిలో కాసులు పడేసరికి వెనకా ముందూ చూడకుండా అందరికీ బట్టలు కొనుక్కొచ్చారన్నమాట. అమ్మాయి పెళ్ళికెదిగి కూర్చుందని గుర్తుందా అని"

"ఇంకో రెండు పంటలు చేతికి రానీయ్. రంగరంగ వైభోగంగా అలివేలు పెళ్ళి చేస్తాను. అలాటిలాటివాణ్ణి కాదు. ఆఫీసరు హోదాలో వున్నవాణ్ణి అల్లుడిగా చేసుకుంటాను. చక్కని డాబాని- ఈ ఇల్లు పడగొట్టి- ఇక్కడే కట్టేస్తాను. పెద్ద మునసబుగార్తో 'మీ లెక్కేమిటి' అనగల స్థాయికి ఎదిగిపోతాను. చూస్తుండవే"

"అబ్బో. చాలా లెక్కలు వేస్తున్నారే ఇదేవిటి? "

"అవి అబ్బాయికి"

"ఈ బట్టలెవరికి? "

"మన సూర్యానికి"

ఆ మాటలకి అలివేలు వులిక్కిపడింది.

అమితాశ్చర్యంగా నమ్మలేనట్లు చూసింది పుష్పవల్లి.

"పాలేర్ని కూడా మనింట్లోవాడిగా జమకట్టేస్తున్నారా? సిగ్గు సిగ్గు!"

"పిచ్చిదానా. ఇవాళ మనమింత డబ్బు కళ్ళ జూస్తున్నామంటే అందుకు ప్రధాన కారకుడు సూర్యం. అతగాడిమీద గోరంత అభిమానం చూపి కాసింత విదిలించామనుకో మన కొండలు తరగవు. సరికదా ఆ కొండల పక్కన మరికొన్ని కొండలు చేరతాయి. దీన్నే లౌక్యం అంటారే"

"ఏం లౌక్యమో ఏం పాడో. ఎవర్ని ఎక్కడ వుంచాలో అక్కడే వుంచాలి. మనల్ని మోస్తున్నాయికదా అన్చెప్పి చెప్పుల్ని తలమీద పెట్టుకుంటామా? "

"దానికీ దీనికీ పోలికే లేదసలు. నీవన్నీ ఉత్తభయాలూ తొందరపాటూనూ"

"అవున్నాన్నా. శ్రామికులకి తమ శ్రమని గుర్తించడాన్ని మించిన ప్రతిఫలం వుండదు. మీరు చాలా మంచి పనిచేశారు"

"ఇన్నాళ్ళకి అమ్మాయి మాటా నా మాటా ఒకటయ్యాయి. అది సరేగాని అమ్మాయి పెళ్లి తలపెట్టేకన్నా ఒకటి రెండెకరాలు అమ్మకానికొస్తే కొంటే మంచిదనుకుంటున్నాను. మన చెరువు సరిహద్దుల్లో దొరికితే మరీ మంచిది. అదీ తవ్వి మొత్తం ఏకచెరువుగా చేసేసుకోవచ్చు"

"ఏమాత్రం మిగిలిందేవిటి..."

"పెట్టుబడిపోను లక్షా నలభైదాకా మిగిలింది..."

"నిజంగానే? "

"మరేవిటనుకున్నావే" నవ్వేరాయన.

"రొయ్యల చెరువుల్లో ఇంత లాభం వుందాండీ"

"అందుకేకదా బాపన వ్యవసాయం అని నువ్వు నవ్వినా నేను దిగింది"

"మీరంటే అన్నీ తెలిసున్నవారు. ఇంట్లో పడుండేదాన్ని నాకేం తెలుస్తుంది చెప్పండి"

ఇంతలో సూర్యం వచ్చాడు.

"నువ్వు వచ్చిన వేళావిశేషం. మా ఇంటికి

సిరి నడచివచ్చిందనుకో. మనకి రావాల్సిన సొమ్మంతా ఇచ్చేశారు. ఇదంతా నీవల్లే సాధ్యమయ్యిందనుకో. అందుకే మా ఇంటి ల్లిపాదితోబాటు నీకూ బట్టలు తెచ్చాను..."

బట్టలకి పసుపుబొట్లు పెట్టి తెచ్చిచ్చింది పుష్పవల్లి. మిఠాయి కూడా తెచ్చిపెట్టి తిన మంటూ అభిమానం కురిపించిందామె.

"నా పని నేను చేశాను. ఇవన్నీ నాకెం దుకు చెప్పండి?"

"మా తృప్తికోసం తీసుకో"

తలెత్తి చూశాడు.

గుమ్మంలో నిలబడివున్న అలివేలు తీసు కోవాలని సైగ చేసింది.

సంబరంగా తీసుకొన్నాడు సూర్యం.

"మళ్ళీ రొయ్య పిల్ల తేవడానికి ఎప్పుడె ళ్తావ్..."

"వచ్చేవారం వెళ్తానండి"

"సరే. చెరువు బాధ్యత నీ కప్పగించే శాను. ఇహ నేను నిమిత్తమాత్రుణ్ణి"

"మీరేం ఇదవ్వొద్దు. అన్నీ నేను చూసు కుంటానుగా"

మరికాస్సేపు అదీ ఇదీ మాట్లాడి పాల తెపాలా తీసుకుని కొట్టంలోకెళ్ళాడు సూర్యం.

పాలు పితుకుతోంటే వచ్చింది అలివేలు.

"నిన్ను మా కుటుంబ సభ్యుడిగా చూసి నందుకు నాకు చాలా ఆనందంగా వుంది"

"ఇవాళ ఆచార్లుగారూ కొత్త మనిషిలా వున్నారు"

"మా న్నాన్నలోనే కాదు మా అమ్మలో కూడా మార్పొచ్చింది. అంతా డబ్బు మహత్యం!" నవ్విందామె.

"మీ నవ్వు ముత్యాలు ఒలకబోసినట్టుగా వుంటుంది"

"అంతేనా?"

"మీ మనస్సు ఈ పాలనురుగులాగే తెల్ల నైనది"

"కొంచెం ఫర్లేదు. ఇంకా?"

"మీ చూపు తీయని భావాల తేనెటీగల్ని రేపుతుంది"

"అమ్మో! జాగ్రత్త! కుట్టేస్తాయి- ఇంటినీ మనస్సునీ"

ఇన్ని మాటలు మాట్లాడింది తనేనా అని విస్తుబోతూ లేచి పాల తెపాలా ఆమెకం దిస్తూ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆమె కనురెప్పలు బరువుగా వాలిపో యాయి.

"నువ్వంటే నాకిష్టం. నీ ప్రతి మాటా, ప్రతి చేష్టా ఎక్సైటింగా వుంటుంది నాకు. నువ్వే నా హీరోవి"

అతడు దిమ్మెరబోయాడు. తేరుకుని చూసేసరికి ఆమె లేదు.

"యాహూ!" అని పిచ్చి సంబరంతో అరి చాడు సూర్యం!



హౌసింగ్ కార్పొరేషన్‌కి చెందిన అసి స్టెంటు ఇంజనీరూ, వర్కు ఇన్స్‌పెక్టర్లూ, వీఏఓ అంతా వచ్చారు. తుమ్మలతోపుని సర్వే చేశారు. ప్లాట్లుగా విడదీస్తూ గుర్తులు పెట్టారు.

సర్పంచ్, సూర్యం తదితరుల సూచనల మేరకు ఇళ్ళ కేటాయింపుకి అర్హులైన అభ్యర్థుల్ని గుర్తించారు. వారి వేలిముద్రలు తీసుకున్నారు. ఇతర కాగితాలు తయారుచేశారు.

ఉద్యోగుల్నీ అభ్యర్థుల్నీ సమన్వయపరచడానికీ, పనిని తనిఖీ చెయ్యడానికీ సూర్యం నాయకత్వంలో అరడజను మందితో ఓ కమిటీని ఏర్పాటుచేశారు.

"త్వరలో పనిమొదలు పెట్టేస్తారు. అందుకు తగ్గ ఏర్పాట్లన్నీ చేసేశాను" అని చెప్పి వెళ్ళిపోయాడు సర్పంచ్ చిట్టిబాబు.

ఏఈ సూర్యాన్ని ఓ పక్కకి తీసుకెళ్ళాడు.

"మీ వాళ్ళకోసం ఒక మోడల్‌గా నిలిచిపోయేలా ఇళ్లు నిర్మించాలనుకుంటున్నాం. మొదటి విడతగా యాభైమందికి ఇళ్లు కట్టిస్తున్నా రెండోవిడతలో మరింతమందికి కట్టిస్తాం. అంతేకాదు. నాణ్యమైన స్టీలునీ, సిమెంటునీ వాడాలని నిర్ణయించుకున్నాం. పనులు కూడా త్వరత్వరగా ముగించాలని ప్లాన్ చేస్తున్నాం. ఎంచేతంటే ఆలస్యమైతే రేట్లు పెరుగుతాయి. అందుకనుగుణంగా బడ్జెట్ పెరగదు. దాంతో మెటీరియల్స్ విషయంలో రాజీ పడాల్సొస్తుంది. కొన్ని కొన్ని అసంపూర్తిగా వదిలెయ్యాల్సొస్తుంది. అంచేత అన్నీ సక్రమంగా జరగాలంటే మీ సహకారం మాక్కావాలి"

"ఆ విషయంలో మీరేం దిగులు పడాల్సిన పనిలేదు. మొత్తం దళితవర్గమంతా కలిసొస్తుంది. కనీసం అయిదార్రోజులు శ్రమదానం చెయ్యడానికి సిద్ధంగా వున్నారంతా"

"మీ కోసం ఇళ్లు నిర్మిస్తున్నప్పుడు ఆ మాత్రం సహకారం మీ దగ్గర్నుంచొస్తుందిలే. దాని గురించి కాదు నేననేది. ముసుగులో గుద్దులాట ఎందుక్కాని సూటిగా చెప్పేస్తున్నాను. మీకు గృహాలు వూరికే లభిస్తున్నాయి. అందుకని మాకు తృణమో పణమో ఇస్తే... అహ- మా సహకారం కూడా మీక్కావాలికదా. బెదిరించట్లేదు. అపార్థం చేసుకోకు. వున్న సంగతి చెబుతున్నా. అంతా నేనే బొక్కెయ్యను. కింది నుంచి పైదాకా అందరికీ వాటాలుంటాయి. నువ్వు తెలివైనవాడివి. నీ మాటంటే అందరికీ గురి గనుక అందరి దగ్గరా తలో కాస్తా వసూలు చెయ్యి. నీ కష్టం మా కొద్దులే. నువ్వూ అదనంగా కాస్త వసూలు చేసుకో. ఏమంటావ్? "

"పెద్ద చదువులు చదివిన ప్రభుత్వ అధికారి మీరు. చదువూ సంధ్యాలేని కూలోడ్ని నేను..."

"అందుకేకదా ఇంత విడమర్చి చెబుతున్నాను. ఇదంతా మామూలేనోయ్. మీ వాళ్ళకొచ్చే లాభంముందు ఇదో లెక్కా చెప్పు? "

విషాదంగా నవ్వేడు సూర్యం. "పిట్టని కొట్టా పొయ్యిలో పెట్టా. అదీ మా బతుకు. కూలిదొరకనినాడు మడతకుడుములే గతి. కట్టుకున్న బట్ట తప్ప మారు బట్టలేనివాళ్లు కూడా వున్నారు. అలాటివాళ్లు మీ దాహాన్నెలా తీర్చగలరు చెప్పండి? "

"అలాంటి కల్లబొల్లి కబుర్లు నా దగ్గిర కాదు. రోగం వస్తుంది. పెళ్లి వస్తుంది. చావు వస్తుంది. వాటన్నిటికీ డబ్బు పుట్టడం లేదూ? అలాగే ఇదీనూ. ఏ అప్పో, సప్పో చేసివ్వాలిగాని బీరాలుపోతే నష్టపోయేది వాళ్ళే" కోపంగా అన్నాడు ఏఈ.

"ప్రజల దగ్గర నానారకాల పన్నుల రూపేణ డబ్బు గుంజి ప్రభుత్వం మీకు జీతాలిస్తోంది. అసలు పన్నుల రాబడిలో సగంపైన మీ జీతభత్యాలకే సరిపోతోందిట. అంటే కేవలం మిమ్మల్ని పోషించడానికే పన్నులు వసూలు చేస్తున్నట్టుంది పరిస్థితి. అయినా మీరింకా ఏదో ఆశిస్తూ నిరుపేద నిర్భాగ్య దళితుల్ని కూడా లంచాల పేరుతో దోచెయ్యాలనుకోవడం దారుణం.

వాళ్ళేమీ ఇవ్వలేరు. ఇవ్వగలిగినా ఇవ్వని వ్వను. అవినీతి తలే కాదు వేళ్లు నరకడం కూడా మాకు చేతనవును" ఆవేశపడ్డాడు సూర్యం.

అసిస్టెంట్ ఇంజినీర్ ఉగ్రుడయ్యాడు.

"ఏదో అర్థం చేసుకుంటావని చెబితే... సరే- అదీ చూస్తాం. మీ కాలనీ ఎలా తయారవ్వుద్దో, ఎప్పటికి తయారవ్వుద్దో నేనూ చూస్తాను"

"మా రక్తాన్ని ధారబోసైనా సరే మేం సాధించుకుంటాం"

అధికారులంతా బిలబిలమంటూ వెళ్ళిపోయారు.

ఏం జరిగిందో అర్థంగాక సూర్యం వంక చూశారంతా. అతడు చెప్పింది విని 'ఔరా!' అనుకున్నారు జనం.

"అదేదో సినిమాలో చూపించినట్టు ఇలాటి చీడపురుగుల్ని నరికిపారెయ్యాలి" ఉద్రేకపడ్డాడు జాన్.

"వాళ్ళీ వ్యవస్థ వేసిన కుక్కమూతి పిందెలు. అసలు మూలాన్ని వదిలేసి వాళ్ళనేదో చేస్తే మారేదేం వుండదు. వివిధ కుంభకోణాల్లో, కాంట్రాక్టుల్లో, పైరవీల్లో ఎన్నోవేల కోట్లు మింగేస్తూ కూడా పెద్ద మనుషుల్లా చెలామణి అవుతోన్న అవినీతిపరుల్ని వీధిలో కీడ్చాలి. కాంట్రాక్టర్లనే దళారీల్ని, పదవుల్ని దుర్వినియోగం చేసే వినాయకుల్ని అధికారాల్ని తమ ఇష్టం వచ్చినట్లు వినియోగించే అధికార యంత్రాంగాన్ని సమూలంగా ప్రక్షాళనం చెయ్యాలి"

"ఓయబ్బో. అదంతా జరిగేపని కాదుగాని పదో పరకో పారేత్తాననకపోయావుట్రా. పని ఆలస్యమైతే ఆడిదేం పోదు. పోయేది మనకే కదా" ఓ మాలపెద్ద అన్నాడు.

"అలాగని తలొంచితే అడుగడుగునా తినేస్తారు. సరుకుల్ని మింగేస్తారు"





"మరేం చేద్దామంటావ్?"

"మన నిఘా పెంచుదాం. మన తడాకా చూపిద్దాం. మనం ఒక్కత్రాటిమీద నడిస్తే వాళ్ళెన్ని మెలికలు వేసినా తిప్పి కొట్టడం చిటికెలోపని. ఎంతైనా వాళ్ళూ ఉద్యోగులే కదా?"

"సరే. నువ్వెలాగంటే అలాగ సేస్తాంగాని ఓపాలి సర్పంచిగోరి సెవినేత్తే మంచిదిగదా. ఏదైనా ఒత్తే ఆయనే సూసుకుంటాడు"

అంతా బలపరచడంతో తలూపి కదిలాడు సూర్యం.

విషయం విని ఆశ్చర్యం నటించాడు సర్పంచ్. "నా వూరి కొచ్చి నా వెనుక ఇన్ని వేషాలేస్తాడా? వాడి సంగతి నేను చూసుకుంటాన్లే. అవసరమైతే డీయమ్‌తో మాట్లాడతాన్లే. అయినా తోక జాడిస్తే మన యమ్మెల్యేగార్తో చెప్పి ట్రాన్స్‌ఫర్ చేయించేస్తాను. మనవాళ్ళేం ఇవ్వక్కర్లేదు. ధైర్యంగా వుండమన్నానని నా మాటగా చెప్పు"

"మంచిదండి. పోరంబోకు స్థలానికి పట్టాలిప్పించే సంగతి ఏం జేశారు?"

అతడి నుదురు ముడివడింది. 'ఇంకా ఆ సంగతి మర్చిపోలేదా' అన్నట్టు చూశాడు. 'మీ ఆశకి అంతుండదుకదా' అన్నట్టు ముఖం చిట్లించాడు.

"అది కుదరదని అప్పుడే చెప్పేనుగా. ప్రభుత్వం ఎవరికో కేటాయించబోతోంది"

"వారికి ఇంకోచోట ఇప్పించి అది మనూరి నిరుపేదలకిప్పిస్తే మీ పేరు చెప్పుకుని రెండు మెతుకులు తింటారు ఓ పాతిక కుటుంబాలవాళ్లు. కనీసం లీజుకింద ఇప్పించినా చెరువు తవ్వుకుని..."

"చెరువు తవ్వడం అంటే మాటలనుకున్నావేంట్రా. రొయ్యల ద్వారా లక్షలు సంపాదించడానికి లక్షలు పెట్టుబడి పెట్టాలి తెలుసా? ఎక్కడ్నుంచి తెస్తార్రా అన్ని లక్షలూ?"

"మీరు పట్టాల ఏర్పాటుచేస్తే మరొకరి

ద్వారా పెట్టుబడికి ఏర్పాటు చేసుకుంటాం. వస్తానండి"

సూర్యం వెళ్ళిపోయాడు.

ఆ మరొకరెవరైవుంటారు? తన ప్రత్యర్థి గోపాలం కాదుకదా?

ముచ్చెమటలు పోశాయతడికి.

"గాభరా పడొద్దొరేయ్. వీడు అంతకంతకీ తోక లేపుతున్నాడు. కీలకంమీద దెబ్బ కొట్టక తప్పదు" అన్నారతడి భుజంతట్టి పెద్ద మునసబుగారు!

★ ★ ★

ఏదో గొడవగా గోలగా విన్పించేసరికి మెలకువ వచ్చింది సూర్యానికి.

లేచి బయటికొచ్చాడు. దూరంగా చెట్టు కింద జనం గుంపు కన్పించింది. జోళ్ళైనా వేసుకోకుండా అటువెళ్ళాడు.

పరంధామయ్యని చెట్టుకి కట్టేస్తున్నారు జాన్, దావీదు మరికొందరూ. మిగిలినవాళ్ళంతా ఆసక్తిగా భయంగా చూస్తూ నిలబడ్డారు.

"ఏమిట్రా జాన్ ఏం జరిగిందీ"

జాన్ జవాబివ్వకుండా కడుతూనే వున్నాడు. పరంధామయ్య వంక చూశాడు సూర్యం. ఆయన తలొంచుకున్నాడు.

ఆయన వూళ్ళోని పెద్దల్లో ఒకడు. మోతుబరి రైతు. అటువంటాయన్ని మాలపల్లెలో బంధిస్తున్నారంటే ఏదో పెద్ద ఘోరమే చేసుంటాడనుకున్నాడు.

"ఇంతకీ ఏం జరిగిందిరా? " మళ్ళీ అడిగాడు.

కట్టడం పూర్తిచేసి ఒంటికి పట్టిన చెమటని తుడుచుకుంటూ "ఆయన్నే అడుగు" అన్నాడు జాన్.

"నువ్వు చెప్పకూడదేవిటి? "

"చెప్పడానికి సిగ్గేస్తోన్న సిగ్గుమాలిన పని చేశాడీ పెద్దమనిషి"

"అంటే..."

"ఎవర్లేరుకదాని నరిసిగాడింట్లో దూరి ఆడి కోడలి సెయ్యట్టుకున్నాడు. అది కేక లేత్తే మేమంతా వచ్చేం. పారిపోతావుంటే పట్టుకున్నాం" దావీదు చెప్పాడు.

సూర్యం మొఖం ఎర్రబడింది. పరంధామయ్యని ఎడాపెడా వాయించెయ్యాలన్నంత ఆవేశం వచ్చింది. బలవంతాన నిగ్రహించుకున్నాడు.

"అరె! ఎంత పొరబాటు జేశార్రా. ఈయనెవరనుకున్నార్రా? పరంధామయ్యగారనీ పెద్ద మనిషిరా. అలాటి ఆయన్ని పట్టుకుని కట్టేస్తార్రా? తప్పుకదూ. ఆయన సామాన్యులు కాదురా పరమపవిత్రులు. పవిత్రత అనేది ఆయన నోట్లోంచే వూడిపడిందట. అటువంటి పవిత్రులు అంటరానివాళ్ళమైన మనింట్లో దూరతారా? మన ఆడవారిమీద చెయ్యేస్తార్రా? ఛస్తే చెయ్యరు. ఒకవేళ చేస్తే అందులో ఏదో సదాశయం వుండివుంటుంది. బహుశా తమ పవిత్ర హస్తాలతో తాకి పవిత్రురాలిగా మార్చెయ్యడానికలా చేసుంటారు. అంతేనాండి? మీ శుచీ, మీ శుభ్రతా మీ పవిత్రతా- అబ్బో. అసలు వాటి గురించి మాట్లాడగల అర్హత కూడా మాకు లేదుకదండీ? మాట్లాడరేం పవిత్ర పరంధామయ్యగారూ? "

అందరిముందూ తాళ్ళతో కట్టేసినందుకన్నా మాటల కొరడాలతో కొట్టినందుకు ఎక్కువ అవమానంగా ఫీలయ్యారు. ఆ మాటలకి విన్పించిన నవ్వులకి చిత్రవధ చేయబడ్డట్టు కుమిలిపోయారు. తల భూమిలో దాచుకుని చచ్చిపోవాలన్పించింది. అదే సమయంలో అతడ్ని చంపి అతడి పేగులు మెడలో వేసుకోవాలనీ అన్పించింది.

"ఇప్పుడేం జేద్దాం సూర్యం" జాన్ అడిగాడు.

"వదిలేంద్రా. ఆరితో ఏంట్రా పరాసి కాలూ. తెల్లారి లేస్తే ఆరికాళ్ళకి మొక్కాల్సి నోళ్ళం. ఆరికింద పనిచేయాల్సినోళ్ళం" అన్నారు ముసలోళ్ళు. కాని వాళ్ళనెవరూ పట్టించుకోలేదు.

సూర్యం ఏంచెబుతాడోనని అంతా ఆత్రంగా చూశారు.

"ఇంతవరకూ మనల్ని తక్కువ కులస్తులంటూ హీనంగా చూసిన వారందరికీ గుణంలో, ప్రవర్తనలో, నడవడిలో ఎవరు ఎక్కువో ఎవరు తక్కువో తెలియజెప్పాలి. పేదవారికీ మానాభిమానాలుంటాయని వాటికి దెబ్బతగిలితే వాళ్ళూ సహించరని చాటాలి. సెక్స్ దోపిడీతోసహా అన్ని రకాల దోపిడీని సహించే కాలంపోయిందని చెప్పాలి. ఇలాటి సంఘటన మళ్ళీ జరక్కుండా తగిన చర్య తీసుకోవాలి. ప్రేమిస్తున్నానన్నందుకు రామదాసు ప్రాణాలు తీశారొకప్పుడు. అప్పుడు నిలదీయడానికి మనకి నోరు లేకపోయింది. ఇప్పుడు మనకో అవకాశం వచ్చింది. మన తడాఖా చూపిద్దాం"

"అంటే ఏంచేద్దామంటావ్?"

"కాస్త ఓపిక పట్టండి" అని చెప్పి కొందరు యువకుల్ని ఎక్కడికో పంపించాడు సూర్యం.

మరో అరగంటకి వెనుకబడ్డ కులాల ముఖ్యులందర్నీ తీసుకొచ్చారు వాళ్ళు.

మాదిగల గూడెంనుంచి మల్లిగాడూ ఎరుకల వీరయ్యా, యానాది చల్లయ్యా ఇలా అంతా వచ్చేరు. జరిగింది తెలుసుకుని కాండ్రించి వూశారు.

"ఇవాళ ఇక్కడ జరిగిందే రేపు మీ గూడెంలో, ఎల్లుండి వాళ్ళ వాడలో జరగొచ్చు. ఇలాటిది గాకపోతే ఇంకో రకపు దౌర్జన్యం జరగొచ్చు. ఎవరికి వాళ్ళం కులాలుగా చీలిపోతే మనమేం చెయ్యలేం. ఎవరినీ ఎదిరించలేం. అంచేత మనమంతా ఒక సంఘంగా ఏర్పడాలి. మనకో ఐక్యవేదికని నిర్మించుకోవాలి. తదనంతరం కులమత ప్రసక్తి లేకుండా అందర్నీ కూడగట్టుకోవాలి. అప్పుడు మనం కూలిరేట్లకోసం, మిగులు భూమి పంపకం కోసం, మన జీవన ప్రమాణాలు మెరుగుపరచడం కోసం పోరాడొచ్చు.."

"పెద్దకులాలవాళ్ళు కలుస్తారా?" ఎవరో అడిగారు.

"ఒకేరకం పక్షులన్నీ ఒకచోట చేరక తప్పదు. దోపిడికి గురవుతోన్న వర్గపు ప్రజ అంతా ఒక గొడుగు కిందికి రాకతప్పదు"

సూర్యం మాటలకి చప్పట్లు కొట్టారంతా.

"ముందు మనమంతా ఓ సంఘంగా ఏర్పడదాం. మన సమస్యల్ని కలిసి ఎదుర్కొందాం. ఎవరికే అన్యాయం జరిగినా ఎవరిమీద ఎలాటి అఘాయిత్యం జరిగినా సంఘంతో చెప్పుకోవచ్చు. ఇహ పెద్ద మునసబుగారి పక్షపాత తీర్పుల కోసం ఆశ్రయించాల్సిన పనీ వుండదు. మనకీ, మన వూరి పెద్దలకీ గొడవొస్తే మన తరఫున మన సంఘమే వాదిస్తుంది. మనకోసం మన సంఘాన్ని మనం ఇప్పుడే ఏర్పాటు చేసుకుందాం. ఆ తర్వాత సంఘనిర్ణయాను సారం నడుచుకుందాం. మన భవిష్యత్తునీ, మన పిల్లల భవిష్యత్తునీ తీర్చిదిద్దుకుందాం"

హర్షధ్వానాలు చేశారంతా.

ఆ వెంటనే సూర్యం అధ్యక్షుడిగా అన్ని కులస్తులూ సభ్యులుగా ఓ సంఘం ఏర్పాటయ్యింది. యువకుల్తో ఓ కమిటీ రూపొందించబడింది.

కమిటీ సమావేశమై ఇకనుంచెవరూ సారా త్రాగరాదనీ, వ్యభిచారం జోలికి పోకూడదనీ తీర్మానించారు. వాటినతిక్రమిస్తే జరిమానా విధించబడుతుందని హెచ్చరించారు. సంఘ కార్యకలాపాల నిమిత్తం నెలకి తలకో రూపాయి చొప్పున





ఇవ్వాలన్నారు. చివరిగా పరంధామయ్యకి విధించాల్సిన శిక్ష గురించి చర్చించి తమ నిర్ణయం ప్రకటించారు.

సూర్యోదయంవరకూ ఆయన్నలాగే కట్టి వుంచాలనీ తెల్లారేక ఆయన చేసిన తప్పుడు పని గురించి ఆయనింట్లో చెప్పి వంద రూపాయలు జరిమానా చెల్లించాక వదలిపెట్టాలని నిర్ణయించారు.

"భేష్ బాగుంది. కుక్క కాటుకి చెప్పు దెబ్బ" అని ప్రశంసించారంతా. "పెద్దోరితో పని. మాలపల్లెకేం ముప్పు తెస్తారో" అన్న భయాల్ని త్రోసిపుచ్చారు.

పరంధామయ్య తలని చెట్టుకేసి కొట్టుకున్నారు.

మర్నాడు వార్త వింటూనే ఆయన తమ్ముడొచ్చి డబ్బు కట్టాడు. పులిలా తిరిగిన అన్నగారు పిల్లిలా దీనంగా మారిపోవడం చూసి కళ్లనీళ్ళెట్టుకుని తీసుకుపోయాడు.

★ ★ ★

కిష్టయ్య మాస్టారికి ట్రాన్స్‌ఫర్ వచ్చిందన్న సంగతి క్షణాల్లో వూరంతా పాకిపోయింది.

ఎన్నో ఏళ్లనుంచి వూళ్ళో వుంటూ వూరివాడైపోయారు. వూరి జనానికి తలలో నాలికయ్యారు. ఎందరెందరో పిల్లలకి విద్యాబుద్ధులు నేర్పారు.

ఇప్పటికీ దీక్షాబద్ధులై విద్యబోధిస్తూంటారు. యువతీయువకుల్లో ఉత్తమ సంస్కార బీజాలు నాటుతుంటారు. వూరివాళ్ళకి సలహా సహకారాలందిస్తుంటారు.

అటువంటి మాస్టారికి చింతలపూడి దగ్గరి మారుమూల గ్రామానికి ట్రాన్స్‌ఫర్ వచ్చింది. ఆ వార్తని జీర్ణించుకోడానికి చాలా టైము పట్టింది జనానికి. అప్పటికీ నమ్మలేక ఆయనింటికెళ్ళారు కొందరు.

"పొట్ట చేతబట్టుకొచ్చిన ఉద్యోగులం. ఏ ఊరికి బదిలీ చేస్తే ఆ వూరికి వెళ్ళక తప్పదుకదా" అన్నారు మాస్టారు.

"రిటైర్మెంటు వయస్సు దగ్గరపడిందికదా. ఈ వూళ్ళోనే స్థిరపడిపోదాము. ఈ అయినవాళ్ళ మధ్యే మిగిలిన జీవితం గడిపేద్దాం అనుకున్నాం. ఏమిటో మధ్యలో ఇలాంటి అవాంతరం వచ్చిపడింది" అందా యన భార్య చూడవచ్చిన అమ్మలక్కల్తో.

"పెద్ద మునసబుగారికి చెప్పి బదిలీ ఆపించేస్తాం" అన్నారు కొందరు రైతులు.

"మీ అభిమానానికి కృతజ్ఞుడ్ని" అని చేతులు జోడించారు మాస్టారు.

ఎవరూ ఏమీ అన్లేక నీళ్లు నములుతూ మౌనంగా ఉండిపోయారంతా.

సూర్యం వచ్చాడు. ఆగ్రహంతో రగుల్తోన్నాడతడు.

"ఇదెందుకు జరిగిందో నాకు తెలుసు మాస్టారూ. మమ్మల్ని నిర్వీర్యం చేద్దామని మీ మీద దెబ్బకొట్టారు. ఇటువంటి దెబ్బలకి రాటుదేలామని పాపం వాళ్లకి తెలీదు" అన్నాడతడు.

"చైతన్యతరంగాన్నెవరూ ఆపలేరు. ఇవాళగాకపోయినా రేపైనా ఆ సంగతి గ్రహించక తప్పదు. ఇకపోతే నా వ్యక్తిగత సమస్యని మీ అందరి సమస్య చెయ్యడం నాకిష్టం లేదు"

"అదేవిటి మాస్టారూ. అన్యాయాన్ని ఎదిరించమని చెప్పిన మీరే ఇలా తలొంచడం ఏమీ బాగోలేదు"

"అలా ఎందుకనుకోవాలి? చాలా ఏళ్ళ నుంచి ఇక్కడే వున్నందున ట్రాన్స్‌ఫర్ చేశారనుకోవచ్చుగా"

"తప్పకుండా అనుకునేవాళ్ళం. మీలాగా ఒకేచోట అనేక ఏళ్లుగా వున్న అందర్నీ బదిలీ చేసుంటే. ఎక్కడో వున్న మారుమూల పల్లెకి గాకుండా మరెక్కడికైనా బదిలీ చేసుంటే తప్పకుండా అలాగే అనుకు

నేవాళ్ళం. కానిది అలా జరగలేదు. అడ్డు తొలగించుకోవాలన్న కక్షతో చేసిన ట్రాన్స్ ఫర్ ఇది. ఇందులో సందేహంలేదు"

"నీ మాట అక్షరసత్యం సూర్యం. మన సర్పంచ్ పనిగట్టుకుని చేయించాట్ట. ఆఫీసులో వాళ్లు చెప్పేరు" అన్నారు అప్పుడే వచ్చిన గోపాలం.

అంతా నివ్వెరపోయారు.

"ఇంతమంచి మాస్టారిని ఎక్కడికో పంపించెయ్యడానికి సర్పంచికేం తెగులొచ్చింది?" అని ఒకరంటే, "వూరి బాగు పట్టించుకోడుగాని ఇలాటివి చేస్తాడన్నమాట" అని వ్యాఖ్యానించారింకొకరు.

"తండ్రి పేరూ పలుకుబడీ వుపయోగించుకుని గెలిచిన వెన్నెముక లేనివాడు" అని నిందించారొకరు. శాపనార్థాలు పెడుతూ తిట్టిందొకావిడ.

"వెళ్ళి అతడ్ని నిలదీద్దాం" అన్నాడు గోపాలం రెచ్చగొడ్తూ.

పరిస్థితి కొత్తమలుపు తిరిగేట్టుందని మాస్టారు కల్పించుకున్నారు. "మీరింత చిన్న విషయానికి ఆవేశపడాల్సిన అవసరం లేదు. నిజానిజాలు తెలీకుండా ఒకర్ని నిందించడమూ మంచిది కాదు"

"మీరు ధర్మరాజుగనుక అలాగంటున్నారు. విలన్ ఎవరో అందరికీ తెలుసు" గోపాలం అన్నాడు.

"చూడండి. ట్రాన్స్ఫర్ వచ్చినంత మాత్రాన అంతా అయిపోయిందనీ చేతులు దాటి పోయిందనీ ఆవేశపడాల్సిన పనిలేదు. మనమంతా కలిసి అర్థిస్తే ట్రాన్స్ఫర్ ఆగిపోతుంది"

సూర్యం మాటలకి వత్తాసుపలికారంతా.

క్షణాల్లో సంతకాల ఉద్యమం మొదలైంది. కొంతమంది కుర్రాళ్ళు ముందుకొచ్చి ఇంటింటికీ తిరిగి సంతకాలు సేకరించసాగారు

విషయం పెద్దమునసబుగారికి తెలిసింది.

ఇది ఎన్నడూ వినని, వూహించని పరిణామం!

గతంలో ఇలాటిదేదైనా జరిగితే అంతా వచ్చేవారు. తనకి చెప్పి బదిలీరద్దు చేయించమని అర్థించేవారు. తన పలుకుబడి ఉపయోగించి పనిచేయించేవారు.

కానిప్పుడు...?!

"ట్రాన్స్ఫర్ నేనే చేయించానని ఆ గోపాలంగాడు వూళ్ళో ప్రచారం చేస్తున్నాడు నాన్నా" అంటూ వచ్చాడాయన కొడుకూ సర్పంచీ అయిన చిట్టిబాబు.

"అలాటి మలుపు తిరిగిందన్నమాట"

"వూళ్ళో రకరకాలుగా అనుకుంటున్నారు. చూస్తూ వూరుకుంటే అంతా మనకి వ్యతిరేకమైపోతారు"

నవ్వేరాయన.

ఆయన భావం అర్థమైంది. మాస్టారింటికెళ్ళాడు సర్పంచ్.

ట్రాన్స్ఫర్ సంగతి కొద్ది నిమిషాలక్రితమే తెలిసి ఆఘమేఘాలమీద వచ్చానన్నాడు. దాన్ని ఆపించే బాధ్యత తనదని హామీఇచ్చాడు.

ట్రాన్స్ఫర్ చేయించిన వారే దాన్ని రద్దు చేయించక తప్పలేదు!

★ ★ ★

చీకటిపడి చాలా సేపయ్యింది.

"సూర్యంగాడింకా రాలేదేమిటి చెప్మా?" కృష్ణమాచార్యులన్నారు.

"సర్కారు భూమిని పేదలకి పంచే కార్యక్రమం చేబట్టేడన్నారుగా. ఆ పనిమీద పట్నం వెళ్ళాలంటే పంపించింది మీరే కదా. ఏమైనా ఈమధ్య నాగాలు ఎక్కువ పెట్టేస్తున్నాడు. అన్నీ తనకే కావాలాయె!" నిష్ఠూ




రంగా అంది పుష్పవల్లి.

"ఎన్ని నాగాలు పెట్టినా ఎన్ని గొడవలు మీదేసుకున్నా మన పనికేం లోటు చెయ్యటంలేదుకదా"

'నిజమే కానండీ పాలేరుతనం చేసుకునే వాడికి రాజకీయాలెందుకు చెప్పండి? లీడరై పోదామని ఆశ కాబోలు!"

తల్లి మాటలకి అలివేలు కల్పించుకుంది. "ఇప్పటికే లీడరైపోయాడమ్మా. ఇవాళో రేపో పదవి చేబట్టినా పట్టొచ్చు!"

ఆశ్చర్యంగా చూసిందావిడ కూతురివంక.

"ఈ కాలపు పిల్లల బుర్రల్లో ఏం పురుగు తొలుస్తుందోగాని ఒహ పట్టాన అర్థంకాదు అంతుబట్టదు. ఆ గొడవకేంగాని వేళమించి పోతోంది మీరెళ్ళి పాలు పితక్కూడదూ? "

"అలాగే. అలివేలూ పాల తెపాలా తీసుకురా"

తండ్రీ కూతుళ్ళు పశువులశాలలోకెళ్ళారు. అంతా శుభ్రంగా అద్దంలా వుంది. అక్కడికి చానాళ్ళ తర్వాత వచ్చారేమో చాలా ఆశ్చర్య పడ్డారాయన.

"ఇంత పని చెప్పక్కర్లేదు. అన్నీ తనే చేసుకుపోతాడు. మొత్తానికి భలే మనిషి" అన్నారు.

అలివేలు ఆవుదూడని వదిలింది. పాలు కుడిచేక దూడని లాగి కట్టేసింది. పొదుగు దగ్గర కూర్చున్నారాయన.

తెపాలా నిండిపోయింది.

ఇదివరకెన్నడూ ఇన్ని పాలివ్వలేదు. అలాటిది...!

దభీమని పచ్చగడ్డి మోపు తెచ్చిపడేశాడు సూర్యం.

పాల పెరుగుదలకి కారణం బోధపడింది.

"బస్సు దిగి అట్నించి పొలంవెళ్ళి పచ్చగడ్డికోసుకొచ్చే సరికి ఆలస్యమైపోయిందండి"

"దానికేంలే. వెళ్ళిన పనేమయ్యింది"

"పోరంబోకుని పంచేది లేదని తెగేసి చెప్పేరండి ఆర్డీవోగారు"

"మరేం చేస్తారట? "

"అదేమీ చెప్పట్లేదండి"

"ఈలోగా ఏ పెద్దమునసబో ఆక్రమించేసి చెరువు తవ్వేస్తాడు. కోర్టులూ కచేరీలూ తీర్పు చెప్పేసరికి పది పంటల్తీసేస్తాడు. హు- బలవంతుడిదే రాజ్యం"

ఆలోచనలో పడ్డాడు సూర్యం.

ఆయనా అలివేలూ వెళ్ళిపోయారు. మరి కాస్సేపటికే ఏదో పనున్నట్టు తిరిగొచ్చింది అలివేలు.

"శివస్వామిమీద ఎదురు తిరగటం, వెంకటరెడ్డికి బుద్ధిచెప్పడం, ఆలయంలో ప్రవేశించడం, మాస్టారి ట్రాన్స్‌ఫర్ ఆపడం, పరంధామయ్యకి జరిమానా విధించడం, ఇళ్ళ నిర్మాణం, సంఘస్థాపన, పేదలకి పట్టాల పంపిణీకి కృషి... భేష్, చకచకా మెట్లెక్కేస్తున్నావ్. ఇలాగే అందర్నీ కూడగట్టుకుంటూ పోతే వచ్చే ఎన్నికల్లో గ్రామ పెత్తనం నీదే సూర్యం"

"మమ్మల్ని మేం బాగుజేసుకుంటే చాలు వూరి పెత్తనాలెందుకు లెండి"

"ఏం? వూరి పెత్తనం అగ్రవర్ణాలవారి గుత్తసొమ్మా? అసలు నీలాటి యువకులు పదవుల్ని చేబడితే గ్రామాల స్వరూపమే కాదు దేశముఖచిత్రమే మారిపోతుంది తెలుసా? "

"మిమ్మల్ని చూస్తోంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది. బ్రాహ్మల ఇంట్లో పుట్టారు. బయటి ప్రపంచంతో పెద్దగా సంబంధాల్లేవు. అయినా ఎంతో ముందుచూపుతో ప్రగతి దృక్పథంతో మాట్లాడుతూంటారు!"

"నాలో అలాటి బీజాలు వేసింది కిష్టయ్య మాస్టారు. వాటిని మొలకెత్తించింది మా

పిన్నిగారమ్మాయి కామేశ్వరి. ఆవిడ రాసిన పుస్తకాలూ ఆవిడిచ్చిన పుస్తకాలూ నా పరిశీలనా నాకు తెలీకుండానే నన్ను మార్చేశాయి"

"ఓహో, అంచేతిప్పుడు మమ్మల్ని మార్చే పనిలో పడ్డారన్నమాట. మీరాశించినట్టు మారానా? "

"ఇంకా చాలా మారాల్సుంది. ముఖ్యంగా..."

అతడి గుండెలు ఝల్లుమన్నాయ్.

"మీభావం నాకు తెలుసు. నా భావమూ మీకు తెలుసు. కాని మీకూ మాకూ మధ్య...!"

"పిరికి వారికి ప్రేమ అనవసరం. ఎంచేతంటే అది విషాదాంతమవుతుంది గనుక. ప్రేమకి కులలూ మతాలూ వర్గాలూ గోడలూ ఏవీ అడ్డు నిలవలేవు. ప్రేమ విజయం సాధించాలంటే పోరాడాలి. గెలవాలి. చేజిక్కించుకోవాలి"

"చేజిక్కించుకుంటాను" స్వగతంలా అన్నాడు సూర్యం. రామదాసు గుర్తొచ్చాడు. 'నీకల నిజంచేస్తాను' అనుకున్నాడు.

"గుడ్ లక్" బొటనవ్రేలు చూపించి హుషారుగా వెళ్ళిపోయింది అలివేలు.

అటుగా వచ్చిన చాకలిమంగి "అమ్మాయిగారు తూనీగలా ఎగిరిపోతున్నారేంటి? " అనడిగింది గెడ్డంకింద చేయి వుంచుకుని.

"చుక్కలలోకంలోకి ఎగిరిపోదామని!"

అయోమయంగా చూసిందామె.

★ ★ ★

పెద్దమునసబుగారు పడకకుర్చీలో కూర్చుని గుప్పుగుప్పుమని చుట్టకాలుస్తున్నారు.

మల్లిగాడొచ్చి దండంపెట్టేడు.

"నువ్వు..."

"మాదిగ ఎంకటేశు కొడుకు మల్లిగాడ్నండి..."

"నువ్వే నన్నమాట. మాదిగల్లో చురుకైన వాడెవరంటే నీ పేరు చెప్పేరు. అందుకనే కబురంపాను"

పనేమైవుంటుందో బోధపల్లేదు. తల గోక్కుంటూ నిలబ్డాడు.

"నీలాంటి మెరికల్లాంటి కుర్రాళ్ళు మీ కులంలో వుండగా ఆ సూర్యాన్ని నెత్తినెట్టుకుని వూరేగిస్తున్నారేమిట్రా"

అతడికేమీ అర్థంకాలేదు.

అతడి కర్థంకాలేదని ఆయనకి అర్థమైంది.

"మీరు మాలలకన్నా కూడా బాగా వెనకబడ్డారు. వాళ్లల్లో చదువుకున్నవాళ్ళు వుద్యోగాలు చేస్తున్నవాళ్ళు వూళ్ళేలుతున్నవాళ్ళు కొందరైనా వున్నారు. కాని మీలో? నూటికో కోటికో ఒక్కడున్నారేమో. మీకు రావాల్సినవన్నీ వాళ్ళు తన్నుకుపోతున్నారు. ఉద్యోగాలు, ఇళ్ళు, పదవులు ఒకటేమిటి అన్నీ వాళ్ళే తీసేసుకుంటున్నారు. ప్రభుత్వం మీ అందరికోసం ఎన్నెన్నో చేస్తోంటే మీకు న్యాయంగా రావాల్సిన వాటాని కూడా మీకు రానివ్వకుండా వాళ్ళే స్వాహాచేసేస్తున్నారు. నిజమా కాదా? "

ఎటూ చెప్పలేక తలొంచుకున్నాడు.

"అయినా మీరు గ్రహించట్లేదు. వాళ్ళ మాటలకి లొంగిపోతున్నారు. వాళ్ళని భుజాలకెక్కించుకుని జై కొడుతున్నారు. ఇలా అయితే ఇంకెప్పుడు మీరు పైకొస్తారు? కనీసం మీ వాటా కూడా మీరు దక్కించుకోకుండా ఎన్నాళ్ళు అణచబడతారు? "

ఆయన చెప్పింది సబబే అన్పించింది. మాలల కొచ్చిన ఫలాల్లో నాలుగోవంతు కూడా తమవాళ్ళకి అందట్లేదు! చూస్తోంటే వాళ్ళు తమమీద కుట్రపన్నుతున్నట్టే వుంది!

ఇనుము వేడెక్కిందని గ్రహించారు.




సమ్మెట అందుకున్నారాయన.

"మీ అందర్నీ పిలిచి సంఘం పెట్టాన న్నాడు సూర్యం. దానికి తనే లీడరై కూర్చు న్నాడు. ప్రభుత్వం యాభైమందికి ఇళ్ళు కట్టిస్తానంది. నేనూ మావాడూ అవి మీకు దక్కాలన్నాం. కాదని గొడవచేసి తన వాళ్ళకి కట్టిస్తున్నాడు. ఇప్పుడు వాడి దృష్టి ప్రభుత్వ పోరంబోకుమీద పడింది. మీ అందర్నీ తోలుకెళ్ళి దాన్ని ఆక్రమించి తనో తనవాళ్ళో కాజెయ్యాలని అతగాడి పథకం"

"సూర్యంగాడెంత గుండెలుతీసిన బంటో తమరు సెబుతోంటే తెలుస్తోందండి"

"నువ్వు మీ వాళ్ళ బాగుకోరేవాడివి గనుక నేను ఇచ్చే సలహా ఒక్కటే. నువ్వు నిజంగా మీవాళ్ళ బాగుకోరితే సంఘంనుండి విడిపో. సూర్యాన్ని పక్కకి గెంటెయ్. ఇక నుంచి ప్రతి ప్రభుత్వసాయంలో సగం మీకు దక్కాలని గర్జించు చాలు. నిన్ను నేను సపోర్టుచేస్తాను. మీకు ఇళ్ళు కట్టించి ఇప్పిస్తాను. బ్యాంకు రుణాలిప్పిస్తాను. వచ్చే ఎన్నికల్లో నిన్ను ఉపసర్పంచి పదవిలో కూర్చోబెడతాను"

పొంగిపోయాడు మల్లిగాడు. ఆయనెంతో మంచివాడు గనుక తనని పిలిచి మరీ సపో ర్టిస్తున్నారనుకున్నాడు. ఇకనుంచి మరొకరి తోకలాగా వుండకూడదనుకున్నాడు. తనే నాయకుడిగా నిలబడాలనుకున్నాడు.

"వత్తానండి. ఇయాల్నుంచి మల్లిగాడు కొత్త మల్లిగాడైపోతాడండి"

అతడెళ్ళిపోతోంటే పెద్దమునసబుగారి గుబురుమీసాలమాటున నవ్వు కదలాడింది!

మల్లిగాడు ఇంటికెళ్ళేసరికి ఆ రాత్రి సంఘ సమావేశం వుందని సూర్యం చెప్పేడని తల్లి చెప్పింది. 'ఇవాళ అటో ఇటో తేల్చేస్తాను' అనుకున్నాడతడు.

సంఘం సమావేశమయ్యింది. కమిటీ సభ్యులేగాక చాలామంది పెద్దలూ ఇత రులూ కూడా వచ్చారు. మల్లిగాడొచ్చి మౌనంగా కూర్చున్నాడు.

సూర్యం గొంతు విప్పాడు. "మురిక్కా లువ పక్కన పోరంబోకు వున్న సంగతి మీకందరికీ తెలుసు. అది సర్కారోడిది. దాన్ని భూమిలేని పేదోళ్ళకి పంచితే చెరువు తవ్వుకుని కొన్ని కుటుంబాలు జీవనాధారం చేసుకుంటాయని ప్రభుత్వానికెన్నో విజ్ఞ ప్తులు చేశాం. అధికారుల్ని ఆశ్రయించాం. మన సర్పంచిగార్ని అభ్యర్థించాం. కాని ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది. పెద్ద మునసబుగారి దృష్టి ఆ భూమిమీదపడిం దని సూచాయిగా తెలిసింది. అంచేత మనం మీనమేషాలు లెక్కిస్తూ కూర్చోకుండా దానిని ఆక్రమించుకోవడం మంచిదంటాను. మన మాస్టారు కూడా అదే చెప్పేరు"

"అంతా పోగుజేసి పది పదకొండెకరా లుండదు. దాన్నంతా ఆక్రమించేస్తే ఎవడికి పంచుతావ్?" సూటిగా అడిగాడు మల్లి గాడు.

తుళ్ళిపడి చూశారంతా. అతడి ధోరణి కొంచెం చిత్రంగా అన్పించింది.

"మల్లిగాడు చెప్పింది నిజమే. ఆ సంగతి స్పష్టపరచడానికే ఈ సమావేశం ఏర్పాటుచే శాను. బహుశా పాతిక కుటుంబాలవారికి పంచొచ్చు. అంతా కలిసి చెరువు తవ్వుకుని సమిష్టి వ్యవసాయం చెయ్యాల్సుంటుంది"

"ఆ పాతిక మందీ ఎవరన్నది నా ప్రశ్న"

"అక్కడికే వస్తున్నాను. అన్ని కులాలవా రికీ అన్నితరగతులవారికీ అందులో అవ కాశం కల్పిద్దాం. జనాభా నిష్పత్తి ప్రకారం గాని అందరికీ నచ్చిన మరో పద్ధతిమీదగాని కేటాయిద్దాం. యస్సీ, యస్టీ, బీసీ అందరూ వుండాలి. ఏ కులంలోని ఎవరికి కేటాయిం చాలన్నది అభ్యర్థుల స్థితిగతుల్నిబట్టి ఆయా కుల పెద్దలు నిర్ణయిస్తారు. మనతో బాటు బెస్తవారిక్కూడా స్థానం కల్పించాలి.



వాళ్ళవల్ల రొయ్యపిల్ల లభ్యమవుతుంది. సంరక్షణా బాగా చెయ్యగలరు"

మల్లిగాడికి ఇంకేమనాలో తోచక గమ్మునుండిపోయాడు.

"రొయ్యల సెరువులంటే మాటలేంటి. డబ్బు మూటలు కావాలి. తిన్డానికే లేనోళ్లు డబ్బెక్కడ తెత్తరు? " దావీదు అన్నాడు.

"ఆ స్థలాన్ని ఆక్రమించి పట్టాలు తెచ్చుకోగలిగితే యస్సీ కార్పొరేషన్ వారూ బీసీ కార్పొరేషన్ వారూ బ్యాంకువారూ అప్పివ్వడానికి అంగీకరించారు"

బాగుంది బాగుందంటూ అంతా గుసగుసలు పోతోంటే శాంతంగా వుండమని చెప్పి అన్నాడు సూర్యం, "ముందే చెప్పినట్టు మనమంతా ఐక్యంగా వుండాలి. మనల్ని చీల్చడానికి వేసే ఎత్తుల్ని పారనివ్వకూడదు. మనకి రాకపోయినా మన వాళ్లకి సాయం అందింది కదాని సంతోషించాలి. మరోసారి మనకీ వస్తుంది కదా అని పెద్దమనసు చేసుకోవాలిగాని అసూయ పడకూడదు. సంఘాన్ని చీల్చి బలహీన పరచకూడదు. మీరంతా నా ప్రతిపాదనకి ఒప్పుకున్నట్టేనా? "

"భేషో" అన్నారు. తప్పట్లు కొట్టారు కొందరు. 'సెబాష్' అని మెచ్చుకున్నారింకొందరు.

"పోరంబోకుని ఆక్రమించడం, పట్టాలు సాధించడం, చెరువు తవ్వడం, సమిష్టిగా వ్యవసాయం చెయ్యడం మొత్తం ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించే బాధ్యతని మల్లిగాడిమీద పెడుతున్నాను"

తప్పట్లు కొట్టారంతా. మాదిగలెవరో డప్పు వాయించారు సంతోషం పట్టలేక.

"నాకెందుకు. నువ్వుండు సూర్యం" మొహమాటపడ్డాడు.

"అన్నిటికీ నేనే అయితే ఎలా చెప్పు? అవతల ఇళ్ళ నిర్మాణం చూట్టం, ఇవతల సంఘం పనులు ఆపైన పాలేరు తనం వుండనేవుంది. అదేకాకుండా మన యువకులంతా సుశిక్షిత నాయకులు కావాలి. అంచేత ఇకనుంచి ఒకో కార్యక్రమానికి ఒక్కొక్కర్ని నాయకుడ్ని చేద్దాం"

సూర్యం ప్రతిపాదనకి ఈలలతో చప్పట్లతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది.

మల్లిగాడు సూర్యం చేతులు పట్టుకుని "సెమించరా" అని ఏడ్చేశాడు. ఏమిటని అడగ్గా పెద్దమునసబుగారి మాటలన్నీ ఏకరువు పెట్టాడు.

"ముసలిముండాకొడుకు ఎంతకి దిగజారాడూ! మనలో మనకే తగువులెట్టి సీల్చాలని సూత్తాడా" అని వుద్రేకపడ్డారందరూ.

వార్ని శాంతపర్చాడు సూర్యం.

"విభజించి పాలించడమనే పాత పద్ధతులలోనే ఈ నాటి నాయకులూ మనల్ని కులాలుగా శాఖలుగా చీల్చి నిరుద్యోగుల్ని చెయ్యాలని చూస్తూంటారు. వారి ఎత్తుల్ని చిత్తుచేస్తూ మనం ఏక శక్తిగా నిలవాలి. అప్పుడే ఏమైనా సాధించగలం. ఇకపోతే రేపే మనమంతా వెళ్ళి పోరంబోకుని ఆక్రమించబోతున్నాం. ఒక రోజు కూలి పోతుందని ఇదవ్వకుండా మీరంతా ముందుకి రావాలి. మనోళ్ళకి రక్షగానిలవాలి"

మళ్ళీ ఈలలూ చప్పట్లూ మార్మోగాయి.

"రేపటి పోరాటానికి సిద్ధంకండి" సైన్యాధికారిలా ఆదేశించాడు సూర్యం.

★ ★ ★

దళితులూ వెనుక బడిన తరగతుల వారూ ఆడా మగా అంతా కలిసి సైన్యంలా కదనుతొక్కుతూ కదిలారు. పారలు, గునపాలులాంటి పరికరాలతో వెళ్ళారు.

వూరికోపక్కన మురిక్కాలువనానుకుని వుందాపోరంబోకు. వూబి గురబడెక్కల్తో కొంత, పిచ్చి మొక్కల్తో దుబ్బుల్తో కొంతా





నిండివుంది.

మల్లిగాడు సరిహద్దు వివరించాడు. అందర్నీ గ్రూపులుగా విభజించి తలోపనీ అప్పగించాడు. మారుమాట్లాడకుండా కార్యక్రమంలోకి దిగిపోయారంతా.

వార్త విని గుండెమీద సమ్మెటపోటుపడి నట్టుగా విలవిల్లాడారు పెద్దమునసబుగారు.

కనీవినీ ఎరగంది జరిగింది!

ఇన్నేళ్ళుగా పెద్దపులిలా వూరిని ఏలుతూ వస్తోన్న తన అధికార పీఠం గజగజ వణికేలా చేస్తోన్న ఘటన!

అంతేనా?

పదకొండెకరాల ప్రభుత్వభూమి. పదిహేను లక్షలు ఖరీదు చేసే భూమి. తనచేతివ్రేళ్ళ సందుల్లోంచి జారిపోతోంది.

ఆ స్థలం తన పూర్వులదని రికార్డులు సృష్టించాలనుకున్నాడు. వీలుపళ్ళేదు. స్వాతంత్రసమరయోధుడ్నంటూ ప్రయత్నించారు. ఆ ఎత్తూ పారలేదు. రెవెన్యూ డిపార్ట్మెంటుని తినిపించి ఆక్రమించుకుందామనుకున్నారు. వాళ్ళు వుత్తుత్తి కేసుపెడితే హైకోర్టునుంచి స్టే తెచ్చుకుని చెరువు తవ్వి సంవత్సరాలపాటు రొయ్యలసాగు చేద్దామనుకొన్నారు.

కాని ఆ కలలన్నీ కల్లలు చేసేశారు!

కింకర్తవ్యం?

మథనపడిపోతున్నారు పెద్దమునసబుగారు.

"ఇంకా చూస్తూ వూరుకుంటే నా పదవికే ఎసరుపెట్టేస్తారు నాన్నా. మన రౌడీల్ని పిలుద్దాం. కత్తికో కండ చొప్పున నరికిద్దాం. లేదా వారి గుడిసెలకి నిప్పెట్టేద్దాం. ఇంకెప్పుడూ ఎక్కడా మన్లాటి పెద్దలకి ఎదురుతిరక్కుండా బుద్ధిచెబుదాం" నిప్పులు గక్కాడు సర్పంచ్ చిట్టిబాబు.

"ఆవేశం వద్దు. ఆలోచనకావాలి"

"అంటే ఏం చేయమంటారు"

"చెప్పినట్టు వినే రూల్సున్నాయి కదా. వాటిని అడ్డంవెయ్యి, చట్టవిరుద్ధం అని ముద్రవెయ్యి. మిగతా పని పోలీసులూ కోర్టులూ చూసుకుంటారు"

మరోగంటకి పోరంబోకు భూమిలో స్త్రీలకి మరుగుదొడ్డిని నిర్మించడానికి పంచాయితీ బోర్డు నిర్ణయించిందని పాత తారీఖుతో తీర్మానం నమోదైపోయింది!

పంచాయితీ ఈఓ, గుమస్తా, సర్పంచ్, వీఏఓ, గ్రామనౌకర్లూ అంతా కట్టుకట్టుకుని వెళ్ళారు.

ఆక్రమణ స్థలంలో చకచకా జరుగుతోన్న పనులు చూసి గుడ్లుమీదకొచ్చాయందరికీ.

వారినోసారి చూసి మళ్ళీ తమతమ పనుల్లో పడిపోయారంతా.

నీడపట్టున నిలబడి సూర్యాన్ని పిలిచారు. అతడు మల్లిగాడ్ని పంపించాడు.

"నువ్వొచ్చేవేంటి. మీ లీడర్‌కి కొమ్ములొచ్చాయా?" ఈవో అడిగాడు.

"ఈ పనికి నేనే లీడర్నీ. మీరేం సెప్పాలనుకుంటే అది నాకు సెప్పొచ్చు"

అతడ్ని ఎగాదిగా చూసి గొంతు సవరించుకున్నాడు. "ఇది ప్రభుత్వ భూమి. ఇలా ఆక్రమించడం నేరం. ఇక్కడ స్త్రీలకి మరుగుదొడ్లు నిర్మించాలని పంచాయితీ నిర్ణయించింది. కావలిస్తే తీర్మానపు కాపీ చూపిస్తాను. అంచేత మీరంతా ఇక్కడ్నుంచి వెళ్ళిపోవాలి. మీరు ఇదంతా శుభ్రపరచినందుకు మీకందరికీ పంచాయితీ కూలి ఇస్తుంది"

"ఖాళీగా వున్న ప్రభుత్వ భూమి. చెరువు తవ్వుకుంటున్నాం"

"అది కుదరదని చెప్పడానికే వచ్చాం" వీఏఓ కల్పించుకున్నాడు.

"కుదరందెవరికి?"

"ప్రభుత్వానికి"



"దాన్నే రమ్మనండి"

"వేళాకోళంగా వుందా? "

దూసుకెళ్ళబోయిన అన్నగార్ని ఆపి అన్నాడు సర్పంచ్ "ఇది మంచి పద్ధతికాదు. ప్రభుత్వనిబంధనలకి అనుగుణంగా మసలుకోవాలిగాని ఆటవికన్యాయం ప్రదర్శిస్తే ఎలా? మీవాళ్ళందర్నీ వచ్చెయ్యమను. మరో మంచి మార్గం నేను చూస్తాను"

"మేం రావటం కల్ల. మాకు పట్టాలిప్పించడంలో సాయపడి పెద్దరికం నిలుపుకుంటారో స్వార్థంకోసం రెచ్చిపోతారో మీరే తేల్చుకోండి" విసవిసా వెళ్ళిపోయాడు మల్లిగాడు.

పడగమీద దెబ్బతగిలిన తాచులా కొట్టుకున్నాడు సర్పంచ్ చిట్టిబాబు. అక్కడ్నుంచతడు తిన్నగా పట్నం వెళ్ళిపోయాడు.

పెద్దమునసబుగారికి జరిగిందంతా వివరించాడాయన పెద్దకొడుకు.

'అటోఇటో తేల్చుకోవాల్సిందే!' ఒక నిశ్చయానికొచ్చారాయన.

యమ్మెల్యేనీ ఇతర నాయకుల్నీ ఫోన్లో కాంటాక్ట్ చేశారు. పరిస్థితిని అతిగా చిత్రించి చెప్పేరు. వాళ్ళేదో సాయం అందించకపోతే వూళ్ళో పరువుండదనీ అగ్రవర్ణాల వారంటే భయమూ భక్తీ వుండవనీ చెప్పేరు. ముగ్గులు పెడతామంటూ అంతా హామీలైతే ఇచ్చారు.

సర్పంచ్ చిట్టిబాబు తిన్నగా యంపీపీ ఇంటికెళ్ళాడు. ఆయన్తో మంతనాలాడి సర్కిల్ ఇన్స్పెక్టర్ వీర్రాజుని పిలిపించారు.

వీర్రాజుకి మొండి ఘటమని పేరు డిపార్ట్‌మెంట్లో. ఇద్దరు నక్సలైట్లని చెట్టుకి కట్టేసి కాల్చి చంపి ఎన్‌కౌంటర్లో చచ్చేరన్నాడు. ఎలాంటి సాక్ష్యాలూ లేకుండా చేసి దర్యాప్తు నుంచి బయటపట్టమేగాక ప్రమోషన్ కూడా కొట్టేశాడు.

అతడెంత నల్లగా తుమ్మమొద్దులా వుంటాడో అంత బండగానూ ప్రవర్తిస్తాడు. నోరు విప్పితే చాలు బూతులు దొర్లుకుంటూ వచ్చేస్తాయి. విదేశీ మద్యమన్నా స్వదేశీ మగువన్నా పడిచస్తాడు!

ఆయనకంతా చెప్పేరు. ఇంద్రుడూ చంద్రుడూ అని పొగిడారు. అగ్రకులాభిమానం రెచ్చగొట్టారు. జేబునింపారు.

"కాల్చేస్తాను చంపేస్తాను" అని రంకె వేస్తూ మర్నాటి వుదయమే తన బలగంతోసహా వూళ్ళో దిగిపోయాడు వీర్రాజు.

అలాటి ఎత్తేదో వేస్తారని ముందే గ్రహించిన సూర్యమూ తదితరులంతా రెండో రోజున కూడా పనికొనసాగించారు.

"ఏరా దొంగనాకొడుకుల్లారా. ఇది మీబాబు సంపాదించిన ముల్లె అనుకున్నారుట్రా. ఫొండెహే" గర్జించాడు వీర్రాజు.

అంతా నాటకం చూసినట్టు చూసి పనిలోపడ్డారు తప్ప కదల్లేదు మెదల్లేదు.

"మిమ్మల్నేరా లమ్డీకొడకల్లారా!"

వుహూ- వాళ్ళలో చలనం లేదు.

జవానులవంక చూశాడు. వాళ్ళేమో పదిమంది. జనమేమో సుమారు వెయ్యిమంది. అందుకే గుక్కలు మింగుతూ దిక్కులు చూస్తూండిపోయారు వాళ్ళు.

"ఏరా బద్మాష్. ఫోవేరా" అంటూ దగ్గర్లోని ఒకడ్ని బూటుతో తన్నాడు వీర్రాజు.

అతడు వెర్రిగా అరిచి విరుచుకుపడ్డాడు.

అంతా చూశారు. లేచారు. మొఖామొఖాలు చూసుకున్నారు. ప్రవాహంలా కదలి వచ్చారు.

సి.ఐ.కి ముచ్చెమటలుపోశాయి. వాళ్ళు కష్టజీవులు. ఆయుధం పడితే ఆడపులులవడం ఖాయం. తను తొందరపడితే తన శవాన్నెవరూ గుర్తించలేనట్టుగా చేసేస్తారు!

"వీళ్ళేవళ్ళు? బొత్తిగా అడవిమనుష్యుల్లా వున్నారు. వీళ్ళ వెనకేదో పెద్దముఠా వుందేమోనని నా అనుమానం"

"అబ్బే అలాంటిదేం లేదు. మీమీదకొస్తున్నారుగనుక ఓ పట్టు పట్టెయ్యండి" సర్పంచ్ అనుచరుడన్నాడు. ఎందుకైనా మంచిదని సర్పంచ్ పట్నంలోనే వుండిపోయాడు!

"నక్సలైట్లనే బెదరగొట్టినోడ్ని వీళ్ళో లెక్కా నాకు? చీమల్ని నలిపినట్టు నలిపెయ్యనూ. కాని ఫైరింగ్ ఆర్డరివ్వడానికి పర్మిషన్ లేదే"

"మరేదో దారిచూడండి. అంతా కట్టగట్టుకుని ఇటే వస్తున్నారు"

అంతా సమీపించి కాల్చేసేలా చూస్తూ నిలబడ్డారు.

జనసంద్రాన్ని చూసి వుక్కిరిబిక్కిరయ్యాడు వీర్రాజు. జవాన్ల వంక చూశాడు. వాళ్ళు పరుగెట్టడానికి సిద్ధంగా వున్నారు.

"ప్రభుత్వ భూమిని ఆక్రమించుకోవడం నేరం. మీరంతా రెండుక్షణాల్లో ఇక్కడ్నుంచి వెళ్ళిపోండి. లేకపోతే లాఠీఛార్జీ చెయ్యాల్సొస్తుంది. అప్పటికీ లొంగకపోతే ఫైరింగ్ ఆర్డర్ ఇస్తాను. పిట్టల్లా కాల్చిపడేస్తారు" బింకంగా అన్నాడు.

"మేం కదలం. అరెస్ట్ చేసి తీసుకెళ్ళగలిగితే తీసుకెళ్ళండి" సూర్యం అన్నాడు.

అవునవునంటూ అరిచారంతా.

"నా సంగతి మీకు తెలీదు. చిర్రెత్తుకొచ్చిందంటే వెనకాముందూ చూడను. నాతో పెట్టుకోకండి"

అంతా మౌనం వహించారు.

మరోసారీ ఇంకోసారీ హెచ్చరించాడు వీర్రాజు.

మౌనాన్నే జవాబుగా ఇచ్చారు.

అతడిలో సహనం నశించింది. పళ్ళు నూరుతూ చెడామడా తిట్టాడు. ఎవరైనా తొందరపడితే కాల్చేద్దామనుకున్నాడు. కానె వరూ కదల్లేదు. పెదవి విప్పలేదు.

నెత్తి కొట్టుకున్నాడు.

ఇంతలో కిష్టయ్య మాస్టారొచ్చారు. స్టే మంజూరయ్యిందనీ వారినా స్థలంనుంచి తొలగించరాదనీ చెప్పేరు.

స్టే ఎవరిచ్చారో అసలది నిజమో కాదో తెలుసుకోవాలన్పించలేదు వీర్రాజుకి. మర్యాదగా బయటపడే మార్గం లభించినందుకు సంతోషిస్తూ వెళ్ళి జీపు ఎక్కాడు. జవాన్లంతా బిలబిలమంటూ ఎక్కారు. జీపు కదిలివెళ్ళిపోయింది.

జనం హర్షధ్వానాలు చేశారు.

విషయం చెవినబడేసరికి బీపీ పెరిగి కూలబడ్డారు పెద్ద మునసబుగారు. అయినా లెక్కచెయ్యకుండా తనే స్వయంగా హైదరాబాద్ పయనమయ్యారు తమ వర్గపు మంత్రిద్వారా స్టే ఆర్డర్ రద్దుచేయించడానికి!



"సూర్యం! మనం ఎట్టైనా వెళ్ళిపోదాం"

"కానీ..."

"ఎన్నాళ్ళీ దాగుడుమూతలు? నీకు దూరంగా వుండాలంటే నరకంగా వుంది"

"మనం పెళ్ళిచేసుకుంటే ఆచార్లుగారు తట్టుకోగలరా? తలెత్తుకోగలరా?"

"తప్పదు. గుండె దిటవు చేసుకోవాలి.

ఎదురీదలేనప్పుడు తలొంచాలి. ఆ సంగతి నాన్న గ్రహించక తప్పదు. ఎదురుగా వుంటే ఎక్కువ బాధ అనుకుంటే కొన్నాళ్ళ పాటు ఎక్కడికైనా వెళ్ళిపోదాం"

"మావాళ్ళు.. మా అమ్మా నాన్నే కాదు చాలామంది నామీద చాలా ఆశలు పెట్టుకున్నారు. నేను ప్రారంభించిన ఉద్యమాలన్నీ మధ్యలోనే వున్నాయి"

"ఒకటి, రెండు నెలల్లో తిరిగొచ్చేస్తాంగా"

"కావొచ్చు కాని మనం వెన్నిచ్చి పారిపోవడం నాకిష్టంలేదు. అది మావాళ్ళలో అధైర్యం కలిగించొచ్చు. అభద్రతాభావం సృష్టించొచ్చు. మునసబుగారు రెచ్చిపోవచ్చు. ఇన్నాళ్ళూ కూడగట్టిన ఐకమత్యం బద్దలైపోవచ్చు"

"అవును సుమా. నేనంతదూరం ఆలోచించలేదు. పిరికితనం ప్రదర్శించడం నాకూ ఇష్టంలేదు. ఏం ఎదురొచ్చినా సరే ఎలాటి పరిస్థితి ఎదురైనా సరే కలిసి ఎదిరిద్దాం. ఈ వూళ్లోనే మా ఇంట్లోనే కాపురం పెడదాం"

"నేను రెడీ. నీదే ఆలస్యం"

"నాకెప్పుడో మైనార్టీ తీరిపోయింది. ఇంకెలాంటి సమస్యలూ వుత్పన్నం కావు. నువ్వెప్పుడంటే అప్పుడు పెళ్ళిచేసుకుందాం. ఆ రోజుకోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తూంటాను. మనసంగతి నలుగురికీ తెలీక ముందే మా నాన్న మరో సంబంధం నిశ్చయం చెయ్యకముందే మన పెళ్లైపోవాలని గుర్తుంచుకో! వస్తాను"

చెంబు పట్టుకుని బహిర్భూమికి బయల్దేరిని గోపాలాచార్యులు పాకలోంచేవో మాటలు విన్పిస్తోంటే ఆగాడు. నక్కి విన్నాడు. అమితాశ్చర్యపోతూ వాళ్ళెవరై వుంటారా అని పొంచివున్నాడు. బిందె తీసుకుని గబగబా రేవువైపెళ్ళిపోతూ కన్పించింది అలివేలు. రెండో వారెవరో వూహించేశాడు. అయినా రూఢి చేసుకుందామనుకుని "లోపలెవరూ" అని కేకేశాడు.

"నేనండీ" అంటూ సూర్యం బయటికొచ్చాడు.

అతడ్నదోలా చూసి తలపంకించి వెళ్ళిపోయాడు గోపాలాచార్యులు.

సూర్యం పాల తెపాలా తీసుకువెళ్ళి పెరటిగుమ్మంలో నిలబడి పిలిచాడు. అతడి చేతిలోంచి అందుకుంది అలివేలు. అది చూసింది పుష్పవల్లి.

"అదేవిటే అమ్మాయ్. తెపాలా కింద పెట్టమనకూడదూ? అలా పుచ్చుకుంటే చేయి తగల్దూ? ఏం పిల్లలో ఏమో ఒక అంటూ లేదు ఒక సొంటూ లేదు" అని గొణుక్కుందావిడ.

సూర్యానికెంతో బాధగా అన్పించింది.

తాను పితికిన పాలు తాగుతారు. తాను పండించి తెచ్చిన కూరగాయలు తింటారు. తను పండించిన ధాన్యం మాలలచేత దంపించుకుని తింటారు. తను పెంచిన రొయ్యల్ని అమ్మి ఆ డబ్బుతో నగలూ వస్త్రాలూ కొనుక్కుంటారు. అక్కడెక్కడా లేని అంటు శరీరాలు తాకితే వస్తుందిట!

అది అమాయకత్వమా? మూర్ఖత్వమా?

★ ★ ★

గోపాలాచార్యులు తను విన్న విషయమంతా భార్యకి పూసగుచ్చినట్టు చెప్పేశాడు.

ఆమె ముక్కుమీద వేలేసుకుంది. "మీరు చెప్పిందంతా నిజమే? " అనడిగింది పూర్తిగా నమ్మకం చిక్కక.

"అబద్ధం ఎందుకు చెబుతానే. నీతోడు. సరేనా? "

"అమ్మో అయితే అలివేలు గ్రంథసాంగురాలేనన్నమాట. ఆ మాటలూ ఆబడాయీ చూసి ఇలాటిదేదో చేస్తుందని ఎప్పుడో అనుకున్నానేండి"





"ఈ మాటెక్కడా చెప్పకు సుమీ. పెదవి దాటితే పృథివి దాటుతుందంటారు. నా ద్వారా బయటికి పొక్కిందని తెలిస్తే బాబాయి అగ్గిమీద గుగ్గిలమైపోతాడు. వీలు చూసుకుని నేనే ఆయన చెవిన వేస్తాన్లే"

"అలాగేనండి. నేను నోరు జారనుగా. అయినా ఎవరెలా పోతే నాకెందుకూ!"

కాని భర్త వెళ్ళేక తిరిగి ఆ విషయం మననం చేసుకునేసరికి "అమ్మో!" అన్పించింది. సరిగ్గా అప్పుడు చాకలిమంగి వచ్చింది. యథాప్రకారం చతికిలబడి కూర్చుని తన సొద, వూరిగొడవలూ ఏకరువు పెట్టసాగింది.

తనకి తెలిసిన రహస్యం మంగికి చెప్పడమా మానడమా అని కాస్సేపు వూగిసలాడింది. ఆ వెంటనే చెప్పకుండా వుండటం సాధ్యంకాదనుకుంది.

"ఇదిగో మంగీ! నీకో రహస్యం చెప్పనా? ఎవ్వరికీ చెప్పకూడదుసుమా!"

"నేనెందుకు చెప్పుతాను అమ్మగారూ! ఎక్కడి వూసులక్కడే మర్చిపోతాను. నా సంగతి మీకు తెలీదూ"

"మా పినమావగారు అదేనే కృష్ణమాచార్యులగారమ్మాయి అలివేలు లేదూ! అది ఓ మాలోడ్ని ప్రేమించిందిట! లేచిపోయి పెళ్ళి చేసుకుంటార్ట!"

"ఎట్టెట్టా? " బుగ్గలు నొక్కుకుంది.

"నిజమే. వాళ్ళ మాటల్ని మీ అయ్యగారు స్వయంగా విన్నారే"

"ఆయమ్మకేం పోయేకాలం పచ్చిందీ? ఓలమ్మో! తలచుకుంటేనే గుండెలు గుభేలు మంటున్నాయ్. ఇంతకీ ఆ సచ్చినోడెవడంట? "

"ఇంకెవరూ వాళ్ళ పాలేరే. మా బ్రాహ్మల్లో ఎక్కడా లేనిది ఆయన రొయ్యల వ్యవసాయం చేస్తున్నాడుగా!"

"అయ్యో! అయ్యో! బ్రాహ్మలింట్లో పుట్టి... అదేం పోయేకాలం అమ్మగారూ"

"వాళ్ళ పినతల్లి కూతురు కూడా ఇలాగే కులంతక్కువోడ్ని కట్టుకుంది. ఆ బుద్ధులెక్కడికి పోతాయి చెప్పు"

"సిగ్గుసిగ్గు!"

మంగి బట్టలు తీసుకుపోతోంటే, "ఎక్కడా అనకే మంగీ" అని చెప్పింది మళ్ళీ.

"నేను చెప్పనుగాని అమ్మగారూ ఈ సంగతి కడుపులో దాగుద్దా అని!" అంటూ వెళ్ళిపోయింది.

ఆమె సమాధానానికి నిశ్చేష్టయై గుమ్మంలో నిలబడిపోయింది రెండు క్షణాలపాటు.

ఆ తర్వాత పక్కింటి స్నేహితురాలు గుర్తురాగా అటు పరుగెత్తింది రహస్యం కక్కెయ్యడానికి!

★ ★ ★

జానపద గేయం పాడుతూ చకచకా వరి కోతకోస్తున్నారు ఇరవైమంది కూలీలు. వారిలో చంద్రి కూడా వుంది.

యాంత్రికంగా కోత కోస్తున్నదన్న మాటే గాని ఆమె దృష్టి చేస్తున్న పనిమీద లేదు. ఇంట్లో వదలివచ్చిన ఏడాది బిడ్డమీదే వుంది.

"బిడ్డ ఏం సేత్తన్నాడో! ఆకలికి గుక్కెట్టి ఏడుత్తున్నాడో ఏవో! ముసిలోడు సరిగ సూత్తన్నాడో లేదో!"

కోతలో వెనకడిబోయిన చంద్రిని చూసి "ఏంటే ఆ పరజ్ఞానం? సేతులు కోసుకోగలవు జాగర్త" అంటూ మందలించింది మంగమ్మ.

"గుండెలు బరువెక్కాయి మంగమ్మవ్వా. బిడ్డకి పాలు తాపాలి"

"ఎలాగోలా ఓపిక సేసుకో. ఇప్పుడు సేలొంచి లేత్తే కామందు వూరుకోడు. అనం

తయ్యగారికంటే కటికోడు ఆరి కొడుకు"

మరి మాట్లాడలేకపోయింది చంద్రి.

మళ్ళీ ఏమన్పించిందో మెల్లగా అంది మంగమ్మ "పొద్దువాలుతోందిలే. ఈ కాంతా కోసేక ఎల్లువుగాన్లే. పాలేరు నర్సిగాడికి సెబుతాన్లే"

"ఆ పని చేసి పున్నెం కట్టుకో మంగమ్మవ్వా"

"ఏం పున్నేలో ఏం బతుకులో! ఇంతప్పట్నుంచి పనిసేత్తన్నాను. రెక్కలు ముక్కల్జేసుకోడాలేగాని నాలుగేళ్ళూ నోట్లోకి పోయిందిలేదు. పని దొరక్కపోయినా కూలికెళ్ళకపోయినా పస్తులేనాయె. బాలింతరాలనీ లేదు చూలింతరాలనీ లేదు. ఎప్పుడూ పనే. ఎప్పుడూ అర్ధాకల్లే. ఈ బతుకు లెట్టా బాగుపడ్తాయో ఎట్టా తెల్లార్తాయో ఏవో..." స్వగతంగా చెప్పుకుపోతూనే వుంది మంగమ్మ.

కాస్త దూరాన మురుక్కాలువ గట్టుమీద జీపు దిగారు సురేష్, ఫిషరీస్ ఇన్‌స్పెక్టర్ పాండు, మేస్త్రి సూరయ్యానూ.

భూస్వామి అనంతయ్యగారబ్బాయి సురేష్. ఆయనుండగానే పట్నంలో రైస్ మిల్లు కాంట్రాక్టుకు తీసుకున్నాడు. ఆయన పోయాక పట్నం మకాం మార్చేశాడు. పాలేర్లనీ, పైమనుషుల్నీ పెట్టి వ్యవసాయం చేయిస్తున్నాడు.

ఇప్పుడా ప్రాంతంలో ప్రాన్ కల్చర్ ప్రవేశించింది. ప్రతీవాళ్లూ రొయ్యల చెరువుల మీదకి ఎగబడుతున్నారు. పెట్టుబడి అధికమే. అయితేనేం లక్షలకి లక్షలు లాభం వస్తోంది. పెట్టుబడి నిమిత్తం వడ్డీరేటు గురించి పట్టించుకోకుండా అప్పుచెయ్యడానికి సిద్ధపడుతున్న వాళ్ళెక్కువయ్యారు.

అంచేత సురేష్ కూడా మళ్ళీ గ్రామానికొచ్చేశాడు. రొయ్యల చెరువుల రైతులకి విపరీతమైన వడ్డీలకి అప్పు ఇస్తున్నాడు. విశాఖపట్నం హేచరీనుంచి 'సీడ్' తెచ్చి అమ్ముతున్నాడు. మెల్లగా రొయ్యలు కొని అమ్మే దళారిగా మారాలని చూస్తున్నాడు. ఈలోగా తమ పొలాల్ని చెరువుగా మార్చే ప్రయత్నం లోపడ్డాడు.

అందులో భాగంగానే పాండునీ సూరయ్యనీ తీసుకునొచ్చాడు.

"అదిగో ఆ కోత కోస్తున్న చేను మాదే. దాదాపు ఇరవై ఎకరాలుంటుంది" అన్నాడు సురేష్.

"అరె. మురిక్కాలువకి అతి చేరువగా వుందండీ. ఉప్పు నీరు పడటం ఖాయం. మరి ఇంతకాలందాకా చెరువు తవ్వకుండా ఏం చేస్తున్నారండీ. అబ్బెబ్బే మీ పద్ధతేం బాగోలేదు. అప్పుడే మీ వూళ్ళో బోల్డుమంది చెరువులు తవ్వేస్తే ఈ వూరి భూస్వామి అయ్యుండి మీరు తవ్వకపోవటం ఏం బాగోలేదు" అన్నాడు పాండు.

"అయితే ఇక్కడ చెరువు తవ్వేయొచ్చంటారు"

"భేషుగ్గా. కోతలైపోతున్నాయి గనుక రేపోమాపో కట్టేత కట్టించేసి చెరువు తవ్వకానికి కొబ్బరికాయ కొట్టేసెయ్యండి. ఏహోయ్ సూరయ్యా"

"తవ్వేద్దామండి. కాలవపక్కనున్న ఈ కాస్త ముక్కని కూడా తమరు కలిపేసుకుంటే నీటి రాకపోకలకి దివ్యంగా వుంటాది" అన్నాడు సూరయ్య.

"కలిపేసుకుందాంలే. మనల్ని కాదని ఏ రైతు బట్టకట్టగలడూ!" నవ్వేడు సురేష్.

"బాగా చెప్పేరు. ఇంకో సంగతండి. మీరు చెరువు తవ్వేక ఈ పక్క చేనతను కూడా చెరువు తవ్వాల్సిందేనండి. తవ్వలేదనుకోండి ఉప్పు తప్ప మరేమీ పండదండి"

పాండు మాటలకి పగలబడి నవ్వేడు సురేష్. సూరయ్య శృతికలిపాడు.

"ముందే కలిపేసుకుంటే ఏకంగా తవ్వేయొచ్చండి" అన్నాడు సూరయ్య.




"ఈ రాత్రికే కబురంపి సెటిల్ చేసేస్తాన్లే. మాకో నారాయణకో బాకీ వుండని వాడె వడూ వూళ్ళో వుండడు. అంచేత అట్నించి నరుక్కొస్తాం. బాకీకక్కమని పీకనొక్కుతాం. మాకు రాసిచ్చేస్తూ వేలిముద్రవేసేస్తాడు" పెదాలు తడుపుకున్నాడు సురేష్.

"మీబోటి పెద్దోరి దగ్గర అప్పు తీసుకున్నోడు అయినకాడికి అమ్మేసి నెత్తిన గుడ్డేసుకుని పోవాల్సిందే" అన్నాడు పాండు.

సురేష్ నవ్వలేదు. గతుక్కుమన్నాడు పాండు. వెర్రిగా నవ్వుతూ "నా ఉద్దేశ్యం ఏమిటంటే మీబోటివారిని కాదని ఎవడూ బతకలేడు. బతికినా బట్టకట్టలేడు. ఏవంటారు? " అన్నాడు.

"చిన్నరైతులైనా కూలీలైనా సరే మా దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి బతకాల్సిందే. మేం కళ్ళెర్రచేస్తే మలమల మాడాల్సిందే. అందుకే పల్లెల్లో ఇప్పటికీ మాదే రాజ్యం. మీకో సంగతి తెలుసా? "

"ఏ సంగతండీ? "

"ఇరవై ఏళ్ళనాటి సంగతి. ఈ వూరికి మకుటంలేని మహారాజు మా నాన్నగారు అనంతయ్య. ఆయన మాటకీ చేతకీ ఎదురుండేది కాదు. ఆయన ఆజ్ఞ లేనిదే చీమ కూడా చిటుక్కుమనడానికి వీల్లేదు. ఎన్నికల్లో ప్రచార నిమిత్తం వివిధ పార్టీలవారూ మానాన్న అనుమతి తీసుకున్నాకే వూళ్ళో అడుగుపెట్టే వారంటే నమ్మండి..."

"ఎందుకు నమ్మం? ఇప్పుడు మాత్రం వూళ్ళో మీ మాట వేదవాక్కే కదా" పొగిడాడు పాండు.

"అప్పట్లో రామదాసు అని ఒక మాల యువకుడు మా పనిలో ఉండే వాడు. ఒక రోజున మా అక్కతో నేను ప్రేమిస్తున్నానూ అన్నాట్ట..."

"హమ్మో హమ్మో! ఎంతధైర్యం! సినిమాలు చూసి జనం చెడిపోతున్నారండీ" గుండెలు బాదుకున్నాడు పాండు.

"నువ్వు కాస్త తగ్గవయ్యా" సూరయ్య వారించాడు పాండుని.

పళ్ళికిలించాడు పాండు. ఏదోరకంగా సురేష్ని కాకాపట్టాలనీ తద్వారా వూళ్ళోని రొయ్యల చెరువు రైతులకి సాంకేతిక సలహాలిచ్చే అవకాశం చేజిక్కించుకుని నాలుగు రాళ్ళు కూడేసుకోవాలని అతగాడి తాపత్రయం!

"ఆ సంగతి మా నాన్నగారికి తెలిసింది. వెంటనే వాడ్ని రచ్చబండ దగ్గరి చెట్టుకి కట్టేసి కొట్టేయించారు..."

"అలాటివాడ్ని ప్రాణాల్తో వదలకూడదు..." గబుక్కున అనేసి సూరయ్యవంక చూసి నాలిక్కరుచుకున్నాడు పాండు.

"వదల్లేదు. కిరసనాయిలు పోసి వూరంతా చూస్తూండగా నిలువునా తగలబెట్టేశారు. ఒక్కరుంటే ఒక్కరు నోరెత్తితే ఒట్టు. అప్పటికీ ఇప్పటికీ మేమన్నా మా కుటుంబమన్నా అందరికీ హడల్!" గర్వంగా నవ్వేడు సురేష్.

"ఆ హహ... ఎంత ధైర్యం! ఎంత ధీమా! ఆ గొప్ప, ఆ రాజసం ఆ కాలం వారికే చెల్లిందండి"

పాండు మాటలకి చురుగ్గా చూశాడు సురేష్. "మేం చెయ్యలేమంటారా? "

"అహహ... అలా అనటంలేదండి. మీ గురించి అన్నీ తెలిశాక కూడా ఈ నోటితో అలా ఎలాగంటాను చెప్పండి? "

మీసాలు దువ్వుకున్నాడు సురేష్.

సరిగ్గా అప్పుడు చంద్రి చేలోంచి లేచి వెళ్తూ కన్పించింది. తప్పట్లు కొట్టాడు. ఆమె బెరుగ్గా చూసింది. ఇటు రమ్మని చేత్తో సైగ చేశాడు.

ఆమె గుండెల్జారిపోయాయి. అయినా పిలుస్తోంది కామందు గనుక తడబడుతూ

వచ్చింది.

"నీ పేరేంటే" సురేష్ గద్దింపుగా అడిగాడు.

"సెంద్రి"

"ఏవిటప్పుడే వెళ్ళిపోతున్నావ్?"

"సీకటి పడతాందండి..."

"ఓహో. టైము ప్రకారం పనిచేస్తున్నారా? ఇదెప్పట్నుంచి?"

భయంగా చూసింది.

"వెళ్లు. వెళ్ళి ఆ మిగిలిన కాస్తా పూర్తయ్యాక వెళ్ళు..."

"ఆళ్ళు కోసేత్తారండి. మీ పాలేర్తో సెప్పేనండి..."

"వాడెవడు నీకు పర్మిషన్ ఇవ్వడానికి? ఆ పొలం నాది. ఆ పంట నాది. మీకు కూలిచ్చేది నేను..."

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతోంటే బేలగా చూసింది.

"అవునూ. అందరికన్నా ముందెళ్ళిపోతున్నావ్. వెళ్ళి ఎవడికి పక్కెయ్యాలేంటి?"

సురేష్ మాటలకి కిసుక్కున నవ్వేడు పాండు.

చంద్రి మొహం ఎర్రబడింది.

"బిడ్డకి పాలియ్యాల సావీ..."

"ఓహో. బాలింతరాలివా. అందుకు సాక్ష్యం ఏమిటి?" సురేష్ అన్నాడు. తన ఆధిక్యత నిరూపించుకోవాలన్న యావ అతడ్ని వున్మత్తుడ్ని చేస్తోంది!

"మావోళ్ళందరికీ తెలుసండి. పిలవనాండి..."

"మీరంతా తోడుదొంగలే. వాళ్ళ సాక్ష్యాలు నమ్మను..."

"నా బిడ్డమీద ఒట్టండి..."

"ఇలాటి ఒట్లు సవాలక్ష నేనూ వెయ్యగలను"

మరింకెలా చెప్పి ఒప్పించాలో తెలీక సతమతమైపోతోంది చంద్రి.

"నువ్వు నిజంగా బాలింతరాలివే అయితే నీ దగ్గరే ఉన్న సాక్ష్యం చూపించు వదిలేస్తాను" పాండువంక చూసి నవ్వుతూ అన్నాడు సురేష్.

పాండుకి వెంటనే అర్థంకాలేదు. అర్థమయ్యాక "మీ తెలివితేటలు అమోఘం సార్" అని మెచ్చుకున్నాడు.

సూరయ్య ఇబ్బందిగా చూస్తూ "వదిలేయండి బాబయ్యా. ఆడకూతుర్తో తమలాటోరికి పరాచికాలేంటి. పొద్దువాలితే పన్లోంచి లేచిపోడం రివాజండి" అన్నాడు.

"వెళ్ళొద్దనడంలేదు. అందరికన్నా ముందు వెళ్తున్నప్పుడు తగిన కారణం చూపాలి కదా అంటున్నాను. త్వరగా చూపించవే వదిలేస్తానూ"

సురేష్ మాటలకి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యింది. చేతులు జోడించి "బేగీ వదిలెయ్యండి సావి. బిడ్డ ఏడుత్తావుంటాడు. మీకు వేనవేల దండాలండి..." అంది అభ్యర్థనగా చూస్తూ.

"నాక్కావాల్సింది దండాలూ కన్నీళ్లూ కాదు. నువ్వు బాలింతరాలివన్న రుజువు"

"అవునంతే. త్వరగా చూపించేసి వెళ్ళిపో" వంతపాడాడు పాండు.

"తవరికెలా సెప్పను సావీ..." ఏడ్చేసింది చంద్రి.

అవతల ఆకలితో బిడ్డ ఏడుస్తుండి వుంటాడన్న ఆందోళన. ఇవతల పాలు నిండిన రొమ్ముల్లో తీపు. ఆ రెంటిమధ్యా నలిగిపోతోంటే మధ్యలో ఇతగాడి ఎకసక్కాలు!

"ఏవుందీ వెరీసింపుల్. బాలింతరాలివైతే పిండి చూపించు. పాలొస్తే వదిలేస్తాను"

"వదిలీండిబాబూ" సూరయ్య అన్నాడు.





"సురేష్‌గారు చెప్పింది పాయింటేకదా. పని ఎగ్గొట్టి. వెళ్తున్నప్పుడు కారణం చూపించక తప్పదు మరి" అన్నాడు పాండు.

"పనివేళ అయిపోయిందండీ"

సూరయ్యవంక విసుగ్గా చూశాడు సురేష్. అతడు మరి మాట్లాడలేకపోయాడు.

"త్వరగా చూపిస్తావా లేకపోతే ఆ పని నన్నే చెయ్యమంటావా?" నవ్వుతూ ఒక్కడుగు ముందుకేశాడు.

దెబ్బతిన్నట్టు చూసింది చంద్రి. అతడ్నే విషప్పురుగులా చూసింది. 'థూ' అని ఉమ్మబోయి నిగ్రహించుకుంది.

"ఒక తల్లికి పుట్టినోరు, ఇంకోర్ని తల్లిని సేసినోరు, అలా మాటాడ్డం మర్యేదకాదు సావీ..."

"డైలాగులొద్దు. సార్ చెప్పినట్టు చేసేయ్ చీకటిపడిందిలే ఎవరికీ తెలీదు" పాండు అన్నాడు.

"వు కానియ్..."

ఒక్కక్షణం వారివంక పిచ్చిగా చూసింది. మరుక్షణం హుక్స్ తెగిపడేలా జాకెట్టుని ఫట్‌మని లాగింది. పాలిండ్లు బయటపడ్డాయి. పాలు ధారలుకట్టాయి. అరచేతుల్లో మొఖం దాచుకుని మోకాళ్ళమీద కూలబడి బావురుమంది చంద్రి.

"హుర్రే!" విజయోత్సాహంతో అరిచాడు సురేష్.

"మీరెలాగైనా గ్రేట్ సార్. మీకీవూళ్ళో తిరుగులేదని ఒప్పుకుంటాన్సార్" అన్నాడు పాండు.

సూరయ్య మొఖం చాటేశాడు.

కామందు చంద్రిని పిలవడం, నిలబెట్టి మాట్లాట్టం, ఆమె మోకాళ్ళలో తలదూర్చి ఏడవటం దూరాన్నుంచి గమనిస్తూనే వుంది మంగమ్మ.

"సెంద్రినేదో సేత్తన్నార్రా. ఎల్లి సూద్దాం పదండర్రా" కోత కోస్తూన్న ఆడంగుల్తో అంది మంగమ్మ.

పాలేరు నరిసిగాడు మిగిలిన కాస్త కోత పనీ పూర్తిచేసెళ్ళమన్నాడు గాని ఎవరూ విన్పించుకోలేదు. చకచకా కాలువగట్టు ఎక్కారు.

"వెళ్ళిపోదాం సార్" పాండు, అన్నాడు కదలి వస్తోన్న జనాన్ని చూసి. తన పరువు నిలవాలంటే వుడాయించడమే ఉత్తమం అనుకున్నాడు సురేష్.

"అలగాజనంతో మనకేంటి. పదండి" అంటూ వెళ్ళి జీపు ఎక్కాడు. పాండు, సూరయ్య కూడా ఎక్కగానే జీపు కదిలింది.

"పారిపోతున్నారు సచ్చినోళ్ళు" అంటూ చంద్రిని సమీపించారంతా.

"ఏవయ్యిందే. ఏవన్నారే..."

మంగమ్మని వాటేసుకుని "నేను బతకను. సచ్చిపోతాను" అంటూ భోరున ఏడ్చేసింది చంద్రి.

★ ★ ★

చంద్రి ఇంటిముందుకి సంఘ సభ్యులూ నాయకులే కాదు దళిత జనం యావత్తూ కదలి వచ్చింది.

విషయం తెలుసుకుని భగభగమండారు.

ఒక బాలింతరాలిమీద ఇంతటి దుర్మార్గమా? !

మాతృత్వానికింత నీచమైన అవమానమా?

దెబ్బతిన్న పులుల్లా రగిలిపోతున్నారంతా.

"ఆయాల ఆడి బాబు రామదాసుకి నిప్పెట్టి సంపేడు. ఇయాల ఈడు మన ఆడకూతుర్ని సంపినంత పన్జేసేడు. ఏదైనా సరే ఆడి బుర్ర రామకీర్తన పాడించాల్సిందే"

రెచ్చిపోయాడు జాన్.



సూర్యం వారించాడు.

"గాజులు తొడుక్కుందామా!" మల్లిగాడు ప్రశ్నించాడు.

"ఆవేశకావేషాలొద్దు. జరిగింది దారుణమే. కాదనను. మళ్ళీ అలాటివి జరక్కుండా చూడాల్సిందే. ఒప్పుకుంటాను. కాని ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో మనమంతా కలిసి చర్చించి నిర్ణయించుకుందాం. వూరికే వుద్రేకపడి తొందరపాటు చర్యకి పూనుకోవద్దు" అన్నాడు సూర్యం.

"రక్తం మరిగిపోతావుంటే పిరికి కబుర్లు సెబుతావేంది? " చల్లయ్య అడిగాడు.

అందరిలోనూ ఏదో చేసెయ్యాలన్న తపన సెలవేస్తోంది.

ఆ దురహంకారాన్నీ దురాగతాల్నీ ఎదిరించాలన్న ఆవేశం వేళ్ళు తన్నుతోంది.

"చెరువు గురించి మాస్టారు తెచ్చిన స్టేని రద్దుచేయించడానికి మునసబుగారు హైదరాబాదెళ్ళారు. మనల్ని చట్టం సాయంతో నొక్కి పారెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. ఆయనే కాదు మనం సంఘటితంగా వున్నంతకాలం ఏ శక్తీ మనల్నేం చెయ్యలేదు"

హర్షధ్వానాలు చేశారు జనం.

"అదంతా బాగానే వుంది. ముందిప్పుడేటి సెయ్యాడవో అది సెప్పు" ఎవరో అన్నారు జనంలోంచి.

"ఆడి పేగుల్తీసి మెడలో ఏసుకోవాలి. ఆ నాకొడుకు నా పెళ్లాన్నట్టుకుని అంతమాటంటాడా. ఆడ్ని ఒదల్నొరేయ్. సందకాడ మాటేసి పొడిసేత్తాను. కసాబిసా తొక్కేత్తాను..." చంద్రి మొగుడు నాగన్న వీరంగం మొదలెట్టాడు. పూటుగా సారా తాగేశాడేమో సరిగ్గా నిలబడలేకపోతున్నాడు.

మద్యనిషేధం పాక్షికంగా సడలించడంతో బ్రాందీలతో బాటు సారా కూడా పల్లెల్లో సైతం ప్రవహిస్తోంది.

ఒకప్పుడు ప్రభుత్వ సారా అమ్మిన దాని కన్నా ఇప్పుడు దొంగ సారా అమ్మకంలో లాభాలెక్కువగా వుంటున్నాయి మరి!

నాగన్నకి సర్దిచెప్పి లోపలికి తీసుకెళ్ళారు కొందరు.

"ఆ సచ్చినోడికి బుద్ధి సెప్పాల. ఆడో అమ్మకీ అయ్యకీ పుట్టలేదు కామాల. ఆడి కళ్ళు పేలిపోను. అలాటి ముదనష్టపోళ్ళని భూమ్మీద నడవనీకూడదు" లేచి ఆగ్రహంగా అంది మంగమ్మ.

"నువ్వన్నదినిజమే మంగమ్మవ్వా. ఇది మన ఆడోళ్ళ పరువు సమస్యే కాదు మన మనుగడ సమస్యకూడా. ఇంతలా అవమానాన్ని సహించి వూరుకోవడమన్న ప్రశ్నే లేదు" అన్నాడు సూర్యం.

"అయితే ఆలీశందేనికి. కత్తి అందుకో" ఆవేశంగా లేచాడు దావీదు.

"ఇదొరకు బొండు సల్లయ్య తల్లిని కొట్టినప్పుడు వెంకటరెడ్డి గారి బుర్రబద్దలుకొట్టుంటే ఇప్పుడిలా జరక్కపోను. అప్పుడు తొడకొట్టిఎళ్ళి ఆరు దాక్కున్నారనొచ్చేసాం" జాన్ దెప్పిపొడిచాడు.

"ఈసారి మనభుజబలంకాదు మనశక్తి ఏమిటో చూపిద్దాం" ధృడస్వరంతో అన్నాడు సూర్యం.

"ఏంచేద్దాం? " ఒక్కసారే పదిమంది అడిగారు.

"సురేష్ గారిచేత చంద్రికి క్షమాపణ చెప్పేవరకూ మనం వూళ్ళోని ఎవరిపనికీ పాటకీ వెళ్ళం. పాలేర్లు కూడా వెళ్ళరు. ఒక రకమైన సమ్మె అన్నమాట".

అంతా గుసగుసలు పోయారు. ఎవరి అనుమానాలు వాళ్ళు ఎవరిభయాలు వాళ్ళు వెలిబుచ్చారు.

"కూలికెళ్ళకపోతే పొయ్యిలో పిల్లిలేచేదెట్లా? " ఒకామె అడిగింది.





"పిల్లా పాపలోల్లం. ఎట్టా బతుకుతాం." మరొకరన్నారు.

"మన పొట్టమాడ్చుకునేకన్నా వెళ్ళి వాళ్ళ పొట్టకొట్టడమే మంచిది" కోపంగా అన్నారింకొకరు.

అందరిమాటలూ అన్ని వ్యాఖ్యానాలూ విన్నాడు సూర్యం. అందరి అభిప్రాయాలూ కనుక్కున్నాడు.

"ఇది పరీక్షా సమయం. మనసంఘటిత శక్తి ఏమిటో మనం లేకపోతే ఎన్ని పనులాగిపోతాయో భూస్వాములకి తెలిసిరావాలి. పూర్వంలా మన మీదెక్కి స్వారీ చెయ్యాలనుకుంటే శరీరాంగాలు చచ్చుబడిపోతాయన్న నగ్నసత్యం తెలియాలి. మనల్నిఆషామాషీ గానో వందనోటు కీ, సారాసీసాకి, ఓట్లేసే మట్టిముద్దలుగానో భావించేవాళ్ళు కళ్ళుతెరవాలి. మనమూ అందర్లాటివారమేననీ మనకీ చీమూనెత్తురూ వున్నాయని మనం ఎవరికీ ఏరకంగానూ తీసిపోమని ఋజువుచేసుకోవాలి. అందుకిదే సరైన మార్గం. ఒకటిరెండ్రోజుల్లో వాళ్ళు కాళ్ళ బేరానికి రావడం ఖాయం. అంతవరకూ మనలోమనం సాయంచేసుకుందాం. కష్టనష్టాల్ని కలిసి పంచుకుందాం".

"సూర్యం కీ జై" అన్నాడు జాన్. మరికొందరు గొంతుకలిపారు.

"ఇన్నాళ్ళూ ఇతరులకి జై కొట్టాం. ఇప్పుడు మనోడికే జై కొడదాంరా. కొట్టండ్రా జై" మల్లిగాడు అరిచాడు.

జైజై నినాదాలు ప్రభంజనంలా మార్మోగాయి.

★ ★ ★

రోజూలానే తెల్లవారింది.

కాని రోజూలా పనులు మొదలవ్వలేదు. ఎక్కడి పనులక్కడే నిలిచిపోయాయి.

పెద్ద పాలేర్లేకాదు చిన్నపాలేర్లుకూడా పనికి రాలేదు. పశువులు తొక్కేసిన గడ్డినీ పేడనీ తీసి పశువుల కొట్టాల్ని శుభ్రం చేసే వాళ్ళు లేరు. పశువులకి నీళ్ళు తాపేవాళ్ళు లేరు. ఆఖరికి పాలు పితికిచ్చేవాళ్ళు కూడా లేకపోయారు.

ఇహ కోతలపనులు, కట్టేతపనులు, కుప్పనూర్పిళ్ళు అన్నీ ఎక్కడివక్కడే ఆగిపోయాయి.

ఏవిటి ఏమైందొక్కసారే అని ఆరా తీశారు. క్షణాల్లో పొలంలో జరిగిన ఉదంతం గురించందరికీ తెలిసిపోయింది.

"వాడిజిమ్మడ! వాడికదేం పోయేకాలం. పురుగులు పడిచస్తాడు" అని ఆడవాళ్ళు సురేష్‌కి శాపనార్థాలు పెట్టారు.

"పెద్దవాళ్ళూ బాగానే వుంటారు. చిన్నవాళ్ళూ బాగానే వుంటారు. మధ్యన మాలాంటి బక్కోళ్ళమే. అంబోతులమధ్య లేగదూళ్ళలా నలిగిపోతూంటాం" అని వాపోయారు సన్నకారురైతులు.

"ఆ మాత్రానికే ఇంతగొడవా! అక్కడికి వాళ్ళేదో పతివ్రతలైనట్టు! ఈ అలగాజనానికి బొత్తిగా కండకావరంగా వుంది. అసలు వాళ్ళిలా కావడానికి సర్కారోడే కారణం. ప్రతిదానికి వాళ్ళని నెత్తికెక్కించుకునేసరికి వారికళ్ళు నెత్తికెక్కాయి" అని వుక్రోషపడ్డాడు వెంకటరెడ్డి.

కాని ఆ మాటలు పైకి అనలేదు. ఒకనాడు తనింటి మీదికి కర్రలతో వచ్చిపడ్డ 'దండు'ని ఆయన మర్చిపోలేదు.

"ఊరికేదో అయ్యింది. వినాశకాలే విపరీతబుద్ధి అన్నారు. పాదుచెడే కాలానికి కుక్కమూతిపిందెలే కాస్తాయి. జనానికి దేవుడంటే భక్తీ విశ్వాసం లేకపోయాయి. తామే గొప్పవాళ్ళమనుకుంటున్నారు. అనుకోనీ. ప్రళయం వచ్చి అంతా తుడిచిపెట్టేయాల్సిందే" అనుకున్నారు శ్రీరాములునాయుడు.

నారాయణకి మాత్రం ముచ్చెమటలు



పోశాయి. ఒకనాడు తనతండ్రి అకాలమర ణానిక్కారకుడైన సూర్యమే ఇవాళ ఏకు మేక య్యాడని తెలిసి కలవరపడ్డాడు.

"ఇదివరకు ఇదే సురేష్ తండ్రి అనం తయ్య రామదాసుని పట్టపగలు సజీవద హనం చేసినా ఎవరూ పెదవి మెదపలేదు. ఇదేం అన్యాయమని ప్రశ్నించలేదు. ఇవాళ సురేష్ ఏదో చిన్న దుందుడుకు పనికి పూనుకునేసరికి అంతా ఒక్కటై కయ్యానికి కాలు దువ్వుతున్నారు. చూస్తోంటే ముందు ముందు నా వడ్డీవ్యాపారానికి ముప్పువచ్చే ట్టుంది!" అని మధనపడ్డాడు నారాయణ.

"ఎన్నాళ్ళు పని ఎగ్గొడతారో ఎగ్గొట్టనీ. కడుపుకాలేక వాళ్ళే దార్లోకొస్తారు. వాళ్ళకీ మధ్య కన్నూ మిన్నూ కానటంలేదు. పెద్దంత్రం చిన్నంత్రం లేదు" అన్నారు పరం ధామయ్య.

తనని మాలపల్లెలో చెట్టుకి కట్టేసి అవ మానించిన ఘటనని మరిచిపోలేకుండా వున్నారాయన!

విషయం సురేష్‌కీ తెలిసింది. "జాన్‌దేవ్! నా వెంట్రుక పీకలేరెవరూ" అన్నాడు అను చరగణంతో.

మధ్యాహ్నానికి ఒక్కొక్కరూ మునసబుగా రింటికెళ్ళేరు. ఆయన హైదరాబాదు నుంచి రాలేదని తెలుసుకుని హతాశులయ్యారు. సర్పంచ్ చిట్టిబాబుకి మొరబెట్టుకున్నా రంతా. వారిలో సన్నకారు చిన్నకారు రైతులే ఎక్కువ!

"ఏదోటి చేస్తాను. వాళ్లకి కబురంపి మాట్లాడతాను" అని హామీ ఇచ్చి పంపించే శాడు కాని అతడికంతా అయోమయంగా వుంది.

బంజరుభూమి ఆక్రమణ విషయంలో దళితుల్తో తలపడి తలబొప్పి కట్టించుకు న్నారు. ఆఖరికి ఇళ్ళ నిర్మాణ విషయం లోనూ తను నామమాత్రమై పోయాడు. ఇప్పుడు తగుదునమ్మా అని తను కల్పించు కుంటే వాళ్ళు వింటారనుకోవడం అత్యాశే.

ఒకవేళ విన్నా సురేష్ చేత క్షమాపణ చెప్పించమని పట్టుబడతారు.

సురేష్ ససేమిరా ఒప్పుకోడు. ఇక్కడుండ లేకపోతే పట్నం పోతానంటాడు తప్ప చెంపలేసుకోడానికి అంగీకరించడు.

మరేదిదారి?

జుట్టుపీక్కొంటోంటే దేవుళ్ళా వచ్చారు పెద్దమునసబుగారు.

"హమ్మయ్య! మీరొచ్చేశారు. నాకింకేం ఫర్లేదు. మీరెళ్ళిన పనేమయ్యింది నాన్నా. కాయాపండా? " ఎదురెళ్ళి అడిగాడు చిట్టి బాబు.

"కాయేరా" నీరసంగా జవాబిచ్చారు.

నిర్ఘాంతబోయాడు. "మీరు నోరుతెరచి అడిగినా మంత్రిగారు సాయపళ్ళేదా? "

"దళితులకి వ్యతిరేకంగా ఏమైనాచేస్తే అప్రతిష్ఠ పాల వుతామని అంతా భయపడు తున్నార్రా. లోపాయికారీగా కారాలూ మిరి యాలూ నూరుతున్నారు. కాగితంమీద మాత్రం ఏమీ పెట్టనంటున్నారు. ఈ నాయకులంత మహానటులెక్కడా వుండర నుకో".

"అయితే వాళ్ళింకా రెచ్చిపోతారన్నమాట"

"ఏమైందిరా".

జరిగిందంతా ఏకరువు పెట్టేడు సర్పంచ్.

కాళ్ళక్రింది భూమి కంపిస్తున్నట్టుగా అన్పించింది. అధికారపీఠం బ్రద్దలవుతున్న భావన వూపేసింది.

గుండెలదుద్దుకుంటూ కూలబడ్డారు మునస బుగారు.

"నాన్నా" కలవరపడ్డాడు.

కోడలు ఒకటాబ్లెట్ తెచ్చి నాలిక్కింద





పెట్టింది. కొడుకాయన చొక్కా విప్పేసి ఫాన్ స్పీడు పెంచాడు. ఇద్దరూ కలిసా యన్ని మంచంమీద పడుకోబెట్టారు.

"డాక్టర్‌కి ఫోన్ చేస్తాను..."

వద్దొద్దని సైగ చేశారు.

తడిబట్టతో ముచ్చెమటలు తుడుస్తూ కూర్చున్నారు.

కాస్సేపటికి కోలుకున్నారాయన.

"నాకేం ఫర్లేదురా. శత్రువుమీద చావు దెబ్బతీయకుండా నేను పోను" ముసలిపు లిలా నవ్వేరు.

"సురేష్ వింటాడంటారా? ".

"వినకపోవడానికి వాడి బాబు కాలంకా దిది".

"కబురంపనా? "

"అప్పుడేవద్దు. మరికాస్తవేడెక్కనీ చెబుతా"

ఆయనేదో పథకరచనలో వున్నాడని అర్థ మైపోవడంతో మరి రెట్టించలేదెవరూ.

సురేష్ తండ్రి అనంతయ్య పెత్తనానికి ఒకప్పుడు వూళ్ళో తిరుగుండేదికాదు. ఆయన మరణానంతరం మునసబుగారు పెద్దరికాన్ని చేజిక్కించుకున్నారు. అందు కంతా సుముఖులుగా లేరని గ్రహించి కొందరు ముఖ్యుల్ని పెద్దలుగా పేర్కొని ఆకట్టుకొన్నారు. తనకి వంతపాడేట్లు మల చుకున్నారు.

అప్పట్లో సురేష్ పట్నం వెళ్ళిపోయినం దున అతడ్ని పట్టించుకోవాల్సిన అవసరం లేకపోయింది. కానిప్పుడు తిరిగొచ్చాడు. ఆర్థికంగా మరింత బలపడ్డాడు. రేపుగ్రామ రాజకీయాల్లోనో మండల రాజకీయాల్లోనో ప్రవేశించొచ్చు లేదా ఏకంగా యమ్మెల్యే గిరీనే చేజిక్కించుకోవచ్చు

అతడు బరిలో వుంటే తన కొడుకు చిట్టి బాబు రాజకీయంగా ఎదగలేడని పెద్దమున సబుగారికి బాగా తెలుసు. అంచేత ఈ సంఘటనాధారంగా అతడి కోరలు పీకెయ్యా లని ఆలోచించసాగారాయన!

ఆ సాయంత్రానికి హఠాత్తుగా ఆకాశంలో మబ్బులు ప్రత్యక్షమయ్యాయి. ఎవరో తరు ముతున్నట్టు నల్లమబ్బులు పరుగులు పెడు తోంటే రైతుల గుండెలు జారిపోయాయి.

కోతలకొచ్చివున్నాయి కొన్ని చేలు. కొన్ని పనలమీద వున్నాయి. కుప్పనూర్చడానికి కల్లం సిద్ధం చేసుకున్నారింకొకరు.

ఇలాటప్పుడు వర్షం వస్తే?

హమ్మో! ఇంకేమైనా వుందా! పండిన పంట చేజారిపోదూ! ఇకరైతునోటమట్టే!.

చిన్నా పెద్దా రైతులంతా మునసబుగారిం టికొచ్చారు.

"ఏదో దారి చూడండి. లేకపోతే నాశన మైపోతాం." అన్నారు.

పరిస్థితి గ్రహించారాయన. మెల్లగా అన్నారు. "వర్షం వస్తుందేమో పంటకొట్టుకు పోతుందేమోనని నాకూ ఆందోళనగానే వుంది. కానివాళ్ళు జరిగిందానికి సురేష్ క్షమాపణ చెప్పాలని కూర్చున్నారు. సురేషేమో వాళ్ళకి నేను క్షమాపణ చెప్పేదే విటని భీష్మించుక్కూర్చున్నాడు. ఈ చిక్కు ముడి విడివడేదెలా? ".

"తప్పు చేసినోడే లెంపలేసుకోవాలి. అత గాడెంత గొప్పోడైనా తప్పుచేసినప్పుడు తలొంచాల్సిందే. అతగాడు ఎగిరి పడ్తే అత గాడి మీద ఎదురు తిరగమనండి. అందర్నీ ఒకేగాట కడ్తే ఎలాగ? " అన్నాడో రైతు.

"నేను మాత్రం దళితుల్నే సపోర్టు చేస్తు న్నాను. న్యాయంవాళ్ళ పక్షానవుంది. వాళ్ళ పరువుని, వాళ్ళమర్యాదని దెబ్బతీసిన వాళ్ళు ఎంత గొప్పవాళ్ళైనా సరే క్షమించమని కోరా ల్సిందే. అంతవరకూ వాళ్ళపోరాటం ఆగదు. ఆరదు. ఏం చేస్తారో చెయ్యండి" అని లేచి మాలపల్లె వైపెళ్ళాడు గోపాలం.



అతడి పన్నాగం మునసబుగారెప్పుడో గ్రహించారు. ఎలాపోలా దళితుల సానుభూతి కొల్లగొట్టి గ్రామరాజకీయాన్ని హస్తగతం చేసుకోవాలని యత్నిస్తున్నాడు. అందుకోసం ప్రతి విషయంలోనూ వారికి అండగా నిలుస్తున్నట్టు నటిస్తున్నాడు. వాళ్ళని నిచ్చెన మెట్లుగా వుపయోగించుకుని పైకెగబ్రాకాలని ప్రయత్నిస్తున్నాడు!

మిగతా పెద్దల్ని కూడా పిలిచారు. అందరి అభిప్రాయాలూ కనుక్కొన్నారు.

సురేష్‌చేత తప్పైపోయిందని చెప్పించేస్తే పోయేదానికి రాద్ధాంతం చెయ్యడం అనవసరమని అభిప్రాయపడ్డారంతా.

"సురేష్‌ని పిలిచి మాట్లాడిచూద్దాం" అంటూ కొడుకువంక చూశారు పెద్దమునసబుగారు.

అతడు లేచెళ్ళి ఫోన్‌చేశాడు.

మొదట రావాల్సిన అవసరం లేదన్నాడు సురేష్. తర్వాత పెద్దలంతా సమావేశమయ్యారనీ వచ్చి నీ అభిప్రాయం చెబితే మంచిదనేసరికి రావటానికి అంగీకరించాడు.

ఒక అరగంటకి జీపులో వచ్చాడు సురేష్.

"చూడు సురేష్. నీగురించి మాకు తెలుసు. నీ పరిస్థితీ మాకు తెలుసు. కాని ప్పుడుగాలి వారికనుకూలంగా వుంది. చట్టం వాళ్ళకి సహకరిస్తోంది. నాయకులూ మంత్రులూ వాళ్ళకి వ్యతిరేకంగా పల్లెత్తు మాటనడానికి సాహసించటంలేదు. వాళ్ళు ఇదివరకట్లా చీలిపోయిలేరు. చేవచచ్చిలేరు. సంఘటితశక్తిగా ఆవిర్భవించారు. అంచేత మనం తాత్కాలికంగానే అయినా తలొంచక తప్పదు. ఎదురీదితే వాళ్ళు కులంపేరెట్టి దూషించారని కేసుపెడితే మనం కటకటాలు లెక్కించాల్సిందే. శిరోముండనం గొడవలో యమ్మెల్యే కూడా లొంగిపోయి జైలుపాలైన సంగతి నిన్నగాక మొన్ననే జరిగిందని మర్చిపోకు..."

గుటకలు మ్రింగి అయోమయంగా మునసబుగారి వంకచూశాడు సురేష్.

"మనం రాజీపడకపోతే వాళ్ళు రెచ్చిపోతారు. వాళ్ళు పనిపాటలకి రాకపోతే మన సర్వవ్యాపారాలూ స్తంభిస్తాయి. అంచేత తప్పైపోయిందని నువ్వొక్కమాట చెబితే చాలు మిగతాది నేను ముగ్గులుపెడతాను. కాదూ కూడదన్నావనుకో ఈ రాత్రికి ఒక్క చినుకు పడినా తెల్లారేసరికి రైతులంతా వెళ్ళివాళ్ళతో కలిసిపోతారు. వాళ్ళతోబాటే మేమూ వుండకతప్పదు. ఇహ అప్పుడు నువ్వొక్కడివీ ఒంటరిగా సంఘబహిష్కరణకి గురై..."

కంగారుపడ్డాడు సురేష్. "ఇప్పుడేం చెయ్యమంటారు తాతయ్యా".

చిన్నగా నవ్వుకున్నారు మునసబుగారు. "వాళ్ళని పిలుస్తాను. తప్పైపోయిందని రెండుముక్కలు చెబుదువుగానంతే. సమస్య వుఫ్‌మని వూదేసినట్టు తేలిపోద్ది".

సంగతి వివరించి సంఘనాయకుల్నం దర్నీ రమ్మన్నానని తన మాటగా చెప్పమని గ్రామోద్యోగిని తరిమారు మునసబుగారు.

అతడెళ్ళి సమస్తం వివరించేసరికి అంతా ఎగిరిగంతేశారు. 'మనంగెలిచాం' అంటూ హర్షధ్వానాలు చేశారు.

"దెబ్బతినున్నది మనం. మనం ఆళ్ళకాడికెళ్ళేదేంటి. ఆళ్ళనే ఈడకి రమ్మను" అన్నాడు దావీదు.

"మనం అక్కడికెళ్ళడమే న్యాయం. ఊరికి రచ్చబండలాంటిది మునసబుగారిల్లు. అన్నిటితో బాటు ఈ వ్యవహారాన్నీ అక్కడ తేల్చుకోవడమే మంచిది. అందులో తలొగ్గటమూ లేదు, తక్కువదనమూ లేదు. పైగా ఇక్కడికి రమ్మంటే ఒకళ్ళో ఇద్దరో రావచ్చు అక్కడైతే ఇంచుమించు వూరంతా వుంటుంది. అందరి ముందరా లెంపలేసు




కుంటే మన విజయం అందరికీ తెలుస్తుంది. మనమంటే అందర్లోనూ భయమేర్పడుతుంది. మళ్ళీ ఎప్పుడూ ఇలాటి దౌర్జన్యాలు చెయ్యసాహసించరెవ్వరూ"

సూర్యం మాటల్తో అంతా ఏకీభవించగా పొలోమంటూ కదిలారంతా.

కదలివచ్చిన దళితదండుని చూసి మునసబుగారూ మిగతా పెద్దలూ ప్రముఖులూ అదిరిపడ్డారు.

'చూస్తోంటే తనకొడుకుని యమ్మెల్యేగా ఎదగనిచ్చేట్టులేరు. సర్పంచిగిరీని కూడా వూడబీక్కునేలా కన్పిస్తున్నారు సుమా!" అని గొణుక్కున్నారు పెద్దమునసబుగారు.

వాళ్ళని తనగుప్పిట్లోనైనా పెట్టుకోవాలి. లేదా అణచివేయనైనా వెయ్యాలి. ఆ రెండూ జరక్కపోతే తమ వంశానికే రాజకీయాధికారం లేకుండా పోవడం ముమ్మాటికీ ఖాయం!.

ఆ వూహరావటం ఆలస్యం ఆయన మొఖం పాలిపోయింది. బుర్రలో ఎన్నెన్నో పథకాలు సుళ్ళు తిరగసాగాయి. ఏదోటి చెయ్యాలి. లేకపోతే ఈ వామనుళ్ళు త్రివిక్రములై తన తలమీదే పాదంమోపి పాతాళానికి తొక్కేయడం ఖాయం!.

గుటకవేసి, "ఒరే సూర్యం ఇలారారా" అని పిలిచారు మునసబుగారు. పీలగా వచ్చాయి మాటలు. ఆయన కంఠస్వరంలో వచ్చిన మార్పుకంతా అచ్చెరువంది వింతగా చూశారాయనవంక.

ఎప్పుడూ అధికారం ఆధిక్యత నిండి ఆజ్ఞాపిస్తున్నట్టుగా వుండే ఆయనస్వరం సాదాసీదాగా వుంది మరి!

సూర్యమూ తదితరులూ దగ్గరికొచ్చారు.

"ఊర్నించి రాగానే జరిగిన ఘటనగురించి తెలిసింది. వెంటనే అందర్నీపిలిచి మాట్లాడాను. అనేక ఏళ్ళుగా మనమంతా కలసిమెలసి వుంటున్నాం ఆనందంగా వుంటున్నాం. సమస్యలూ, మనస్పర్థలూ వచ్చినా మనలో మనమే పరిష్కరించుకుంటున్నాం తప్ప వూరుదాటిపోనివ్వడంలేదు. జరిగింది దారుణమే. కాదన్ను. కాని దానికోసం ఇంతటి వుద్యమం చేబట్టక్కర్లేదు. నాతో చెప్పుకునివుంటే పరిష్కరించేవాడ్ని. పోనీలే ఇప్పుడైతేనేం. వూరందరికీ కావాల్సినవాడ్నీ దశాబ్దాలుగా వూరికి పెద్దగా వుంటున్నవాడ్నీ గనుక నేనే పూనుకున్నాను. వూరి ఐక్యతకాపాడటం నాబాధ్యత కదా. సురేష్ కూడా ఇక్కడే వున్నాడు. మీకు క్షమాపణ చెప్పడానికి సిద్ధంగావున్నాడు".

మునసబుగారు గుక్కతిప్పుకోడానికన్నట్టు ఆగారు.

"మాకు కాదు చంద్రికి చెప్పమనండి" దృఢంగా అన్నాడు సూర్యం.

ఆయనచిన్నగా తడబడ్డాడు. "అలాగలాగే. అలాగే చెప్పిద్దాం. నష్టపరిహారం కూడా ఇప్పిద్దాం...".

"మాపరువు వెలకట్టలేనిది. మా అభిమానం అమూల్యమైంది".

"అవునదీనిజమే. అలాగే కానియ్. చంద్రి నిరమ్మను...".

చంద్రిని కొందరాడవాళ్ళు ముందుకి తీసుకొచ్చారు. తలొంచుకుని నిలబడింది. ఎవరి మొఖం చూడలేకుండా వుందామె.

మునసబుగారు సురేష్‌వంక చూశారు. అతడు అయిష్టంగానే లేచివచ్చాడు.

"నేను నిన్ను అవమానించాలని అన్లేదు. ఏదో సరదాగా అంటే నువ్వు సీరియస్‌గా తీసుకున్నావు. సరే. అంతా సారీ చెప్పమంటున్నారు గనుక చెబుతున్నాను. తప్పైపోయింది. ఇంకెప్పుడూ ఎవర్తోనూ ఇలా ప్రవర్తించను..."

సురేష్ మాటలంతా విన్నారు. వుత్సాహతరంగాల్లా వుప్పెత్తున పొంగారు. జయ



జయ నినాదాలు చేశారు. నర్తించారు. ఈలలు వేశారు.

సూర్యాన్నీ తదితరుల్నీ వూరేగిస్తూ తీసు కెళ్ళిపోయారు.

సురేష్ తోకతొక్కిన త్రాచులా రెచ్చి పోతూ విసురుగా వెళ్ళిపోయాడు.

అతడ్ని గమనించిన పెద్దమునసబుగారి మొఖంలోకి ఇంకిపోయిన రక్తం గబగబా వచ్చేసింది.

కళ్ళల్లో ఆశ తళుక్కుమంది.

సురేష్‌కిది భరించరాని అవమానమే. దాన్ని భరించి మన్నుతిన్న పాములా వుండనివ్వదా వయస్సు. అంచేతతడు రెచ్చి పోతే? సూర్యాన్నో మరొకర్నో లేక మొత్తం మాలపల్లెనో దెబ్బతీయడానికి ఎత్తువేస్తే?

కాగల కార్యం గంధర్వులే తీర్చినట్టు తన పని సుళువవుతుంది. తన శత్రువుల బలం వుడిగిపోతుంది. తనుమళ్ళీ మీసం మెలేసి చుట్టకాలుస్తూ కూర్చోవచ్చు.

వూహలల్లుకుంటున్నారు మునసబుగారు.

మిగతా గ్రామస్తులు మాత్రం "బాపురే. జాగ్రత్తగా వుండాలిసుమా. వీళ్ళిదివరకటి వానపాములు కాదు" అనుకున్నారు!.

★ ★ ★

"మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లా డాలి. ఓ సారలా దేవుడి వాహనాల గదిద గ్గరికొస్తారా? "

గోపాలాచార్యులివంక అయోమయంగా చూస్తూ అనుసరించారు కృష్ణమాచార్యులు.

"నేన్చెప్పేది· మీరు కాస్త స్తిమితంగా వినాలి. ఇందులో అబద్ధం లేదు. కల్పన లేదు. స్వయంగా నా చెవుల్తో విని నాక ళ్ళతో చూసింది చెబుతున్నాను".





కృష్ణమాచార్యులికి ఒళ్ళంతా ముచ్చెమ టలు పోశాయి. ఏదో జరక్కూడనిది జరిగిం దని సిక్త్‌సెన్స్ చెబుతోంది!.

దేవుడి మాన్యంలో వచ్చిన పంటని కొంత మునసబుగారూ తనూ కలిసి కాజేస్తు న్నారు, ఆ సంగతి తెలిసి అందులో తన పాత్ర లేదనుకొని తనకి చెప్పబోవటం లేదు కదా? .

"ఏవిటో చెప్పరా" సన్నగా వణుకుతూ అన్నారు.

"మన అలివేలూ మీ పాలేరు సూర్యం గాడూ ప్రేమించుకుంటున్నారు. పెళ్ళి కూడా చేసుకోవాలనుకుంటున్నారు".

నడినెత్తిమీద పిడుగుపడ్డట్టు అదిరిప డ్డారు.

"గోపాలా!" కీచుగా అరిచారు.

"నిజం బాబాయ్. ముందే చెప్పేనుగా. మీరు కాస్తగుండె చిక్కబట్టుకోవాలి. మొన్న ప్రొద్దున్న చెంబు పట్టుకెళ్తోంటే మీ పాక లోంచి మాటలు విన్పించాయ్. ఎవరా అని చూస్తే అలివేలూ వాడూనూ!".

"ఒకవేళ చీకట్లో ఇంకెవర్నేనా చూసి..."

"వూహు. పొరబడే అవకాశమే లేదు బాబాయ్. అలివేలుని స్పష్టంగా చూశాను. వాడ్ని పలకరించానుకూడా. వాళ్ళు త్వర లోనే ఇక్కడో లేక లేచిపోయో పెళ్ళి చేసు కుంటార్ట. ఈ మాటమీకు చెబితే మంచి దనీ...".

కొన్ని క్షణాలపాటు శిలలా వుండిపో యారు. కోపం, దుఃఖం కట్టకట్టుకొస్తోంటే కంపించిపోయారు.

దుఃఖాన్ని అదుపులో పెట్టుకోజూస్తూ "ఈ సంగతి ఎవరికీ తెలీదుకదా? " అనడి గారు.

"మీకూ నాకూ తప్ప మూడో కంటికి తెలీదు".

"తెలీనివ్వకు. నీలోనే సమాధి చేసెయ్యి"

అని చెప్పి విసవిసా ఇంటికెళ్ళిపోయారు. ధారలుగా కారుతోన్న కన్నీళ్ళని తుడుచుకునే ప్రయత్నం కూడా చెయ్యకుండా కూతుర్ని కేకేశారు.

ఆ దుఃఖంలో ఆ కేకకూడా స్పష్టంగా లేదు.

అలివేలూ పుష్పవల్లీ వచ్చారు ఏంజరిగిందో అర్థంగాక. విషాదమూర్తిలావున్న ఆయన్నిచూసి స్థాణువులయ్యారు.

"ఏమే! నీకేం లోటుచేశాననే ఇలాటి పాడుపనిచేశావ్? ఆ మాలవాడితో- ఛీఛీ- నా కడుపున చెడబుట్టావే దౌర్భాగ్యురాలా! అగ్నిహోత్రంలాంటి వంశంలో పుట్టిన నీకిలాటి బుద్ధి పుట్టిందేమే పాపిష్టిదానా!" కూతురిమీద విరుచుకు పడ్డారు.

పుష్పవల్లికేమీ అర్థంకాలేదు. ఇద్దర్నీ మార్చిమార్చి చూస్తోంది.

తమ ప్రేమ సంగతి తెలిసిపోయిందని గ్రహించింది అలివేలు. సమాధానం సిద్ధం చేసుకొంటోంటే అన్నారాయన "ఇంకా చూస్తూ వూరుకుంటే ఎంతకైనా తెగిస్తావే నా పర్వువుకి నిప్పెడతావే భ్రష్టురాలా!".

తనని గదిలోకి ఈడ్చుకుపోతోంటే "ఆగండీ నాన్నా. నేను చెప్పేది వినండి...." అంటూ పెనుగులాడిందామె.

"నాకు చెప్పేంత మొనగత్తెవయ్యావన్నమాట. చేసిన పనికి సిగ్గుతో చావక ఇంకా చెప్పడాలు కూడానా" అంటూ గదిలో వుంచి గొళ్ళెం పెట్టేశారు.

"భోజనానికి తప్ప మరిదేనికీ బయటికి రానీకు. రానిచ్చావంటే నేను చచ్చినంత ఒట్టు!" ఒగురుస్తూ అన్నారు.

"అయ్యో శుక్రవారం పూటా అవేం మాటలండీ! అసలింతకీ అమ్మాయిచేసిన పాపమేవిటండీ..."

"చెప్పడానికి నోర్రావడంలేదే. అలాంటి ఛండాలపు పనిచేసిందది. బ్రాహ్మలింట పుట్టానన్న ఇంగిత జ్ఞానమైనా లేకుండా ఆ పాలేరుగాడితో లేచిపోవాలనిచూస్తోందే!" దుఃఖంతో ఆయన కంఠం పూడుకుపోయింది.

మొదలు తెగిన వృక్షంలా కూలిపోయిందామె. ఆ వెంటనే తేరుకుని గుండెలు బాదుకుంది.

"రామారామా! హవ్వా! అయ్యో! ఎంతకి తెగించిందండీ. ఇప్పుడు ఇప్పుడెలాగండీ? ఈ మాట నలుగురికీ తెలిస్తే- హవ్వ- ఇంకేమైనా వుందా? మొఖంమీద వుమ్మేయరూ! నాకు కాళ్ళూ చేతులూ ఆడటంలేదండీ. స్వచ్ఛమైన బ్రాహ్మలింట్లో పుట్టిన దానికి ఈ వర్ణసంకరబుద్ధులేంటండీ. అసలిదంతా ఆ సూర్యంగాడివల్లే వచ్చింది. వద్దు మొర్రో అంటే వినకుండా తెచ్చి నెత్తిమీద పెట్టారు. ఇప్పుడు తల తీసేపని చేశాడు!".

"గట్టిగా అరవకే. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఏదో వీలైన సంబంధం చూసి వారంరోజుల్లో దాని పెళ్ళి చేసేస్తాను. నువ్వు మాత్రం బయటికేం పొక్కనీకు. గోడలకి చెవులుంటాయి జాగ్రత్త" అని హెచ్చరించారు.

వెంటనే పయనమై బావమరిది వూరికెళ్ళారు కృష్ణమాచార్యులు.

హఠాత్తుగా వూడిపడ్డ బావగార్ని చూసి ఆశ్చర్యపోయాడు తిరువేంకటాచార్యులు.

కాళ్లు కడుక్కున్నాక దాహం ఇచ్చారు. ఆయన కాస్త సేద దీరేక మెల్లగా అన్నాడు "అక్కా పిల్లలూ అంతా క్షేమమేకదా బావగారూ"

తలపంకిస్తూ అన్నారు "మన అలివేలుకి వేగిరం పెళ్లి సంబంధం చూడాలయ్యా"

"ఈ వేసవిలో కళ్యాణం జరిపిద్దామన్నారుగా. వీలైన సంబంధం గురించి వాకబు చేస్తున్నాను"

"అప్పటిదాకా ఆగటానికి లేదు. వారంప

దిరోజుల్లో పెళ్లి చేసెయ్యాలి"

విడ్డూరంగా చూశాడతడు. "ఏమంత తొందరపడుతున్నారు?"

"నీకెలా చెప్పాలో తెలీటంలేదయ్యా. చెప్పడానికి నోర్రావటంలేదనుకో"

ఏదో జరిగిపోయిందని అర్థమైంది. తన మేనగోడలి గురించి బాగా తెలుసు. ఆమె తొందరపడే మనిషి కాదు. నీతినియమాలకి విలువిచ్చే సాంప్రదాయపు అమ్మాయి. మరింకేం జరిగుంటుంది?

"నీ దగ్గర దాచకూడదనుకో. కానీ సంగతి ఎవరికీ తెలీనివ్వకూడదు సుమా. నీ ఇంట్లో వాళ్ళకి కూడా తెలీనివ్వకూడదు"

"నామీద భరోసా వుంచండి. ఏం జరిగిందో చెప్పండి"

"అలివేలు ఒక... నిమ్న కులస్తుడితో ప్రేమలో పడిందయ్యా. నీ మేనకోడలు ఎంత సిగ్గుచేటుపనికి తలపడిందో చూడు"

"నమ్మలేకపోతున్నాను. అలివేలు అలా... అతగాడేం చేస్తాడు?"

"కలెక్టరో, ఆఫీసరో కాదు మా పాలేరు"

"చిత్రంగా వుందే"

"చిత్రం కాదు పిదపకాలపు బుద్ధులు"

"వాణ్ణి పనిమానిపించేశారా"

"ఇంకా లేదు. సమయం చూసి ఉద్వాసన చెప్పాలి. లేకపోతే వాళ్ళతో పడలేం. మరొకర్ని పనిలోకి రానివ్వరు. అసలే చెరువుల మీద లక్షలు పెట్టుబడి పెట్టాను"

"అదీ దీనికంతటికీ కారణం"

"ఏది?"

"మీరు మరోలా అనుకోకండి. నా మనస్సులోని మాట చెబుతున్నాను. మీరు రొయ్యల పంట పండించడమే ఈ అనర్థానికి మూలకారణం. వేదవేదాంగాలు అభ్యసించిన మనం అలాంటి తుచ్ఛ కార్యానికి తలపడినందున కలిగిన అరిష్టం ఇది!

కృష్ణమాచార్యుల మొఖం ఎర్రబడింది.

"కాలానికి తగ్గట్టే మనమూనూ. వరి పంట ఏమిటి రొయ్యల పంట ఏమిటి. ఏదైనా ఒకటేకదా. రెండూ కూడా మనం పైనుండి ముగ్గులు పెట్టడమేగాని పనిలోకి ఒంగి చేసేదేం లేదుకదా. పాలేర్లే అన్నీ చేసుకుపోతారు. వాణిజ్య పంటకదా నాలుగు రూపాయలు మిగుల్తాయని స్వయంగా చేస్తున్నానుగాని కౌలుర్రైతైనా అదేపని చేస్తాడుకదా. పక్క పొలాల్లో చెరువులు తవ్వేశాక మనం వరి నాటితే ఒడ్లు పండవు ఉప్పు పండుద్ది"

"ఏమో బావగారూ. నాకు మాత్రం సమంజసంగా అన్పించట్లేదు"

"ఈ పంట తీశాక కౌలుకిచ్చేస్తాన్లే. అసలైనా ఎకరానికి పదిహేడువేలదాకా ఇస్తున్నారు. ఏ రకంగా చూసినా వరికన్నా లాభదాయకం. అందుకనే వ్యవసాయంలోకి దిగాను. అంత మాత్రాన నేనేదో భ్రష్టుణ్ణైపోయినట్లు మాట్లాడతావేంటి. మా ప్రాంతంలో భూములున్న ప్రతి కులస్తులూ చేస్తున్నపనే ఇది తెలుసా?" కాస్త కోపంగానే అన్నారు.

"నా మనస్సులోని మాట చెప్పేనంతే. అంతేగాని మీకు చెప్పగలిగేంతవాణ్ణా"

"ఆ సంగతలా వుంచి సంబంధాల విషయం చెప్పు"

"ఒక సంబంధం సిద్ధంగానే వుంది. కుర్రాడు స్కూలు టీచర్‌గా పనిచేస్తూనే పౌరోహిత్యం చేసుకుంటున్నాడు. సంపాదన బాగానే వుంది. కట్నమూ తక్కువే"

"ఇంకాస్త పెద్ద సంబంధం చూద్దాం. కట్నం బాగా ఇద్దాం. క్రితం పంటలో బాగానే మిగిలింది..."

"లక్ష రూపాయలిస్తారేవిటి" నవ్వుతూ హాస్యమాడాడు.




"లక్ష ఏమిటి ఈ పంట కూడా చేతికొస్తే రెండు లక్షలిస్తాను"

అతడి తల గిర్రున తిరిగి ఆగింది. నవ్వు ఎగిరిపోయింది.

"ఏమిటి నిజంగానే..."

"రొయ్యలపంట అంటే మజాకా కాదు. ఎలాంటి వాణ్ణైనా అమాంతం ఆకాశానికెత్తె య్యగలదు. చుక్కలు చూపించగలదు"

ఆయన అదృష్టానికి అసూయపడ్డాడు తిరువేంకటాచార్యులు. తమకీ రొయ్యల చెరువులకనుకూలమైన భూములుంటే బావు ణ్ణనుకున్నారు.

"ఎందరికి చెబుతావో ఎలా చెబుతావో నీ ఇష్టం. మొత్తానికి ఈ నెలలోనే వీలైన సంబంధం చూసి ఖాయం చెయ్యాలి. వెంటనే అలివేలు పెళ్లి చేసెయ్యాలి. మేన మావవి గనుక ఈ పెళ్ళిభారం నీమీద పెడుతున్నాను"

కృష్ణమాచార్యులి మాటలకి తలాడించాడా యన బావమరిది.



సూర్యాన్ని చూస్తూనే బుస్‌మంటూ లేచింది పుష్పవల్లి.

"ఒరి పాపిష్టివాడా! ఎంత పన్జేశావురా. తిండిపెట్టిన చేతినే కరుస్తావుట్రా? నీకిదేం పోయేకాలంరా? వూళ్ళో ఇంత మందుం డగా నీ చూపు మా ఇంటిమీదే పడిందిట్రా దౌర్భాగ్యుడా! నువ్వు చేసిన ఈ పనికి భగ వంతుడు వూరుకోడురా. పురుగులు పడి ఛస్తావురా..."

సూర్యం నిశ్చేష్టుడై కళ్ళప్పగించి చూస్తూం డిపోయాడు. ఆమె ఏ విషయమై తిట్టిపో స్తోందో అర్థం కాలేదు.

లోపల్నుంచి కృష్ణమాచార్యులు పరుగు నొచ్చి ఆవిణ్ణి లాక్కెళ్లిపోయారు.

"నీకేమైనా మతిపోయిందేవిటే?" కోప్ప డ్డారు.

"నాక్కాదండీ మతిపోయింది మీకే. లేక పోతే వద్దు వద్దు అని చెవినిల్లు కట్టుకుని పోరినా విన్నారా? ఆ శనివెధవని కొంపమీ దకి తెచ్చిపెట్టారు! పాముకి పాలుపోసి పెంచినా పెంచినవాణ్ణే కాటేస్తుందని రుజు వుచేశాడు వాడు"

"ఇప్పుడదంతా తవ్వుకోవడంవల్ల ఏమీ ప్రయోజనం లేదే. వాడసలే బరితెగించిన వాడు. తిరగబడితే ఏం జేస్తావు చెప్పు? వూరందరికీ చెబితే మన ప్రతిష్ఠా పిల్ల బతుకూ ఏమవుతాయో ఆలోచించు..."

ఆమె మరి మాట్లాడలేదు. ఏడుస్తూనే వుంది.

"నీ వరస చూస్తోంటే ఆఖరికి వూరంతా నువ్వే టముకు వేసేట్టున్నావ్!"

"నేను నోరెత్తనుగాని బాబోయ్ ఆ పీడ వదిలించెయ్యండి. వాడిని మాన్పించె య్యండి మీ కాళ్ళకి వేనవేల నమస్కారాలు గాని!"

కృష్ణమాచార్యులు గారు మాట్లాడలేదు.

మొదట సూర్యాన్ని పనిలోంచి తీసెయ్యా లని ఆయనా ఆవేశపడ్డారు. తర్వాత మంచి చెడులు తర్కించేక అది తొందరపాటు చర్య అవుతుందనుకున్నారు. అతణ్ణి వుసిగొల్పిన ట్టవుతుందనుకున్నారు. అంచేత అలివేలి పెళ్లి తతంగం పూర్తయ్యేవరకూ సంయ

మనం పాటించడం మంచిదనుకున్నారు.

అంతేగాక ఇంకో నెలాపదిహేను రోజుల్లో రొయ్యల పంట చేతికొస్తుంది. అంతవరకూ సూర్యం పనిలోవుంటే ఈసారి కూడా మంచి లాభాల్ని కళ్లజూడొచ్చు అతణ్ణి తీసేస్తే వేరొకరు రావొచ్చు రాకపోవచ్చు ఎవర్నీ రానివ్వకపోతే లక్షల పెట్టుబడికి కాళ్ళొస్తాయి. పైగా దొంగతనంగా రొయ్య కాజెయ్యొచ్చు చెరువులో విషంలాటిది కల పొచ్చు కక్షలూ కార్పణ్యాలూ అసూయలూ ఆవేశాలూ మనిషిచేత ఏమైనా చేయిస్తాయి కదా!

అందుకనే సూర్యం జోలికి పోకుండా అతడికేమీ తెలీకుండా గుట్టుచప్పుడు కాకుండా బావమరిది ఇంట్లో అలివేలికి పెళ్లి చేసెయ్యాలని నిశ్చయించుకున్నారు. బావ మరిదీ ఇతర బంధువులూ సూచించిన సంబంధాల గురించి వాకబుచేసి ఏదోకటి నిశ్చయం చేసి కబురంపమని చెప్పి మరీ వచ్చారాయన.

"పెళ్ళిగడియ వచ్చేవరకూ నిరీక్షించడం తప్ప మరేమీ చెయ్యలేం" అని నిట్టూర్చారు కృష్ణమాచార్యులు.



చెరువు దగ్గరికెళ్ళాడు. యాంత్రికంగా ఫీడ్‌వేసి గట్టుమీద చతికిలబడ్డాడు సూర్యం.

అతడి మనస్సంతా అల్లకల్లోలంగా వుంది.

పుష్పవల్లి మాటలతడి చెవుల్లో ప్రతిధ్వ నిస్తూ చిత్రవధ చేస్తున్నాయ్!

ఆవిడ తననో ద్రోహిని చేసి మాట్లాట్టం శపించడం భరించరానిదిగా వుంది. ఆవిడెందుకలా హఠాత్తుగా మారిపోయిందో బోధపళ్ళేదు. పోనీ అలివేలితో తన ప్రేమ వ్యవహారం తెలిసిందేమో అనుకోడానికి ఆస్కారం కన్పించట్లేదు. కృష్ణమాచార్యులు ఎప్పట్లానే ప్రవర్తిస్తున్నారుకదా!

కారణమేమిటో తెలుసుకుంటే తప్ప మనస్సు మనస్సులో వుండదనుకున్నాడు. అలివేలు కన్పించినా బావుండేదనుకున్నాడు మరక్కడ వుండలేక వూళ్ళోకొచ్చేశాడు.

మాస్టారింటివైపు అడుగులేశాడు.

గోపాలం ఎదురయ్యాడు. "రేయ్ సూర్యం. ఇదిన్నావుట్రా" అని పలకరిం చాడు.

"ఏదండీ? "

"పెద్ద మొనగాణ్ణి- నావి పులిమీసాలు అంటూ ఎగిరిపడే పెద్ద మునసబు చతికిల బడ్డాడు తెలుసా? "

"ఏం జరిగింది? "

"ఇంకా మెల్లగా అడుగుతావేంటి. కరిచే స్తాను. పొడిచేస్తాను. తినేస్తాను. అని డంబాలు పలికి కొడుకుని వద్దని చెప్పి స్వయంగా తనే రంగంలోకి దూకాడుగా. తను దూకింది నిలువులోతు గోతిలోకని తెలిసి చక్కావచ్చేశాడు"

"నాకేం అర్థం కావట్లేదు. కాస్త వివరంగా చెబితే..."

"మీరంతా పోరంబోకుని ఆక్రమించుకు న్నారుకదా. అక్కడినించి మిమ్మల్నెవరూ కదల్చనివిధంగా స్టే తెచ్చుకున్నారుకదా. దాన్ని రద్దు చేయిస్తానని ముసలాయన హైదరాబాదెళ్ళాడు. ఆ సంగతి నీకూ తెలు సుగా. అక్కడి మంత్రులూ అధికార్లూ తెలు సనీ ఎన్ని ముగ్గులైనా పెట్టెయ్యగలననీ డంబాలు పలికి మరీ వెళ్ళిన సంగతి నీకు తెలీకపోయినా నాకు తెలుసు. ఈయనెంత మొత్తుకున్నా అక్కడెవరూ విన్పించుకోలే దుట. అవతల ఉపెన్నికలు తరుముకొ స్తున్న ఈ దశలో చిన్న సమస్య అయినా పెద్దగా బ్లోఅప్ అవ్వొచ్చని చెప్పి వట్టిచే తుల్తో తిప్పి పంపించేశార్ట. నీ భాషలో చెప్పాలంటే నున్నగా గుండు కొట్టించి పంపించారన్నమాట" పరమానందపడి




పోతూ అన్నాడు.

"చాలా మంచి వార్త చెప్పారు"

"ఇలాటివి ఇంకో రెండు దెబ్బలు తీశా రంటే మునసబు కుదేలైపోతాడు. ఆయన పళ్ళూడబెరికితే అతడి కొడుకేం చెయ్యలేడు. వాడో నుట్టిబొమ్మ. వచ్చే ఎన్నికల్లో మన మంతా కలిసి అవలీలగా వాణ్ణి కుమ్మిపారె య్యొచ్చు"

"అప్పటి సంగతి అప్పుడు చూసుకోవచ్చు లెండి" ఆయన భావం ఆలోచన అర్థం కాగా లోలోన నవ్వుకున్నాడు.

మునసబు అయినా ఈయనైనా తమ కొకటే. ఇద్దరూ ఒకేవర్గానికి చెందిన రెండు బింబాలు. ఈ వ్యవస్థనిలా కొనసాగించి శక్తికొద్దీ దోచుకోవడమే ఇద్దరి లక్ష్యమూనూ!

అయినా బయటపళ్లేదతడు. మునసబుని నిర్వీర్యం చెయ్యడానికి ఈయన్ని తామే ఉప యోగించుకోవడం మంచిదనుకున్నాడు. నువ్వొకందుకు పోస్తుంటే నేనొకందుకు తాగుతున్నానన్నట్టు అతడొకందుకు తమకి సాయపడుతున్నాడు. తాము మరొకందుక తడి సాయాన్ని తీసుకుంటున్నారు.

దీన్నేమంటారు? రాజకీయపుటెత్తులనా? యుద్ధక్రీడలనా?

"అన్నట్టు మా పార్టీ యమ్మెల్యేతో మాట్లా డాను సూర్యం. నీ గురించీ మీ సంఘం గురించీ కూడా చెప్పాను. ఆయన మిమ్మ ల్నెంతగానో అభినందించాడు. పట్టాలిప్పిం చడానికి కృషిచేస్తానని చెప్పి వివరాలు తీసు కున్నాడు. ఆయన్ని త్వరలోనే మనూరికి తీసుకొస్తాను. అలాటి పెద్దవాళ్ళ అవసరం మనకి చాలావుంది. ఈ రోజుల్లో ఏదో పార్టీ అండలేకపోతే మనలేమనుకో. ఏవి టలా వున్నావ్? నీకిష్టంలేదా? "

"అహా. అదేంకాదు...".

"అర్థమైంది. పట్టాలిప్పించలేదు. చెరువు తవ్వకోలేదు కదా ఇప్పుడాయన్ని తీసుకురా వడం ఎందుకంటావ్. సరే. అలాగే కానియ్. మన పనయ్యాకే ఆయన్ని తీసు కొచ్చి పెద్ద ఎత్తున సన్మానం చేద్దాం. సరే నోయ్".

ఇద్దరూ విడిపోయి చెరోదారీ పట్టారు!.

పెద్ద మునసబుగారి దగ్గరుండే గ్రామనౌ కరు తనింటివేపు రావటం చూసికలవరప డ్డారు కృష్ణమాచార్యులు.

"తమర్ని అన్నంతిన్నాక రమ్మని సెప్పమ న్నారు మునసబుగోరు".

"దేనిగురించి? " కంఠం వణకుతోంటే అడిగారు.

"తెల్దండి. పెద్దల్నందర్నీ పిలవమన్నా రండి. ఈరభద్రయ్యగారొచ్చి మునసబు గోర్తో ఏదో సెప్పేరండి. ఆరేమో అందర్నీ పిలవమన్నారండి. మరి నేనొత్తానండి".

షాక్ తగిలినట్లు అదిరిపడ్డారాయన. చాలాసేపటిగ్గాని ఆ షాక్‌నుంచి తేరుకోలేక పోయారు.

'అంటే అలివేలూ సూర్యంల ప్రేమగొడవ గురించి పెద్దల్లో పెడుతున్నాడా వీరభ ద్రయ్య? ఇదివరకాయన కొడుకుని తను వెలెయ్యమన్నాడని ఇప్పుడిలా కక్ష తీర్చుకుం టున్నాడా? అనగా ఆ విషయం వూరంతా టాంటాం అయిపోయిందా? !'.

శక్తి అంతా ఒక్కసారే హరించుకుపోయి నట్టు కూలబడిపోయారు. దుఃఖం పేగులు తెంచుకుని మరీ తెరలు తెరలుగా వస్తోంది.

ఏదో పనిమీద వీధిలో కొచ్చిన పుష్పవల్లి డీలాపడిన భర్తని చూసి ఏదోఘోరం జరిగి వుంటుందనుకుంది. ఏమయ్యిందంటూ గుండెలు బాదుకుంది.

"అంతా అయిపోయిందే. మనపరువూ ప్రతిష్టా గంగలో కలిసిపోయిందే. ఆ విషయం వూరంతా తెలిసిపోయిందే. రేప ట్నుంచి వూళ్ళో తలెత్తుకోవడం ఎలాగే? ఇన్నేళ్ళూ ఒకరికి చెప్పేనుగాని ఒకరిచేత చెప్పించుకోలేదే! అలాటిదివాళ ... ఇంత బతుకూ బతికి ఇంటెనకాల చచ్చినట్టు...!"

ఆయన కంఠం పూడుకుపోయింది.

"ఏమండీ అలా మాట్లాడకండి...ఏమీ కాదు. మనకేమీ కాకుండా ఆ ఏడుకొండల వాడే చూస్తాడండీ. మీరు చేసిన పూజలూ అభిషేకాలూ వూరికే పోవండీ".

"అలాగే అనుకున్నాను. ఎవరికీ తెలీదనే అనుకున్నాను. కాని...కాని..."

"ఎవరు చేశారంటారు ఈ ఘోరం? ఎవరికేం అపకారం చేశామని పనిగట్టుకొని మరీ చెప్పడానికి? !".

గోపాలాచార్యులు గుర్తొచ్చాడు.

మూడోమనిషికి తెలీదన్నాడు. ఎవ్వరికీ చెప్పనన్నాడు. ఇప్పుడందరికీ తెలిసిపోయిందంటే తప్పకుండా అతడిపనే. అతడ్ని వూరికే వదలకూడదు. ఈ గొడవ సద్దుమణిగేక తనేమిటో తెలియజెప్పాలి. ఏదో వంకన పూజారి పనినుంచి తొలగింపజెయ్యాలి.

అలా పరిపరి విధాల ఆలోచిస్తూ ఆయనా, విలపిస్తూ ఆవిడా ఎంతసేపుండిపోయారో వారికే తెలీదు.

గ్రామనౌకరు వచ్చేసరికి వులిక్కిపడ్డారిద్దరూ.

"అంతా వచ్చేరండి. తవరి కోసమే సూత్తన్నారండి".

"వస్తున్నా నడు..."

భోంచేసి వెళ్ళమని భార్య అన్నా వినకుండా పెద్దమునసబుగారింటికెళ్ళారు కృష్ణమాచార్యులు.

అప్పటికే పెద్దలంతా వచ్చేశారు. పరంధామయ్య ఒక్కడూ మాత్రం రాలేదు. ఈ మధ్య పెద్దల సమావేశాలకి రాకుండా దూరంగా వుంటోన్న గోపాలంకూడా వచ్చాడు. అందుకే చాలా ఇబ్బందిగా ఇరకాటంగా వుంది మునసబుగారికి.

అతడు తన కొడుక్కి ప్రత్యక్షంగానూ తనకి పరోక్షంగానూ ప్రత్యర్థిగా రూపుదిద్దుకొంటున్నాడు. అతడు మాలల వెనక్కి చేరడంతో విరోధం మరింత ఎక్కువయ్యింది. తను హైదరాబాదు వెళ్ళి కూడా ఏమీ సాధించలేకపోయాడని వూరంతా కోడై కూస్తూ తనని మరింత నవ్వులపాలు చెయ్యడంతో ఇద్దరిమధ్యా పూడ్చలేనంత అగాధం ఏర్పడిపోయింది. ఇహ జరగబోయేది బలాబలాల పరీక్ష. అందుకే చాలా జాగ్రత్తగా వ్యవహరించాలనుకున్నారాయన.

సూర్యం ఏకు మేకయ్యాడు. దళితుల్నంతా కూడగట్టాడు. వూళ్ళోవాళ్ళ ఓట్ల శాతం అత్యధికం. అంచేత అతడుండగా తన పక్షం మళ్ళీ అధికారంలోకి రాలేదు. వూరిమీద తనపట్టూ వుండదు. ఏంజేయటమా అనుకొంటోంటే వీరభద్రయ్య వచ్చి ప్రేమ వృత్తాంతం చెప్పేడు. దీన్నాసరా చేసుకుని పెద్దల్ని గోకి సూర్యాన్ని వూరి నుంచి వెలివేస్తూ తీర్పు ఇస్తే ఇహతనకి తిరుగుండదని పథకం వేశారు.

కాని సైంధవుళ్ళా అడ్డుపడడానికే వచ్చినట్టున్నాడు గోపాలం.

పచ్చి వెలక్కాయ గొంతుకడ్డంపడ్డట్టుగా వుంది మునసబుగారి పరిస్థితి.

తననుకున్నట్టు తీర్పు ఇస్తే గోపాలం వ్యతిరేకిస్తాడు. తద్వారా వాళ్ళకి దగ్గరైపోతాడు!.

అలా జరక్కూడదంటే తను వెనక్కి తగ్గకతప్పదు.

అతడ్నేదో చేసెయ్యాలనే తన దూకుడికి కళ్ళెం వెయ్యాలి. తనచేతులకి ఎలాంటి మట్టీ అంటకుండా ఇప్పుడు బయటపడిపోవాలి. సూర్యంమీద తన ప్రతాపం మరోసారి మరోరకంగా చూపించుకోవాలి! తప్పదు!!

తనకి తెలీకుండానే నిట్టూర్పువిడిచారు మునసబుగారు.

"తగువు ఏవిటి మునసబుమావా" గోపాలం అడిగాడు.

ఎన్నడూ లేంది కొంచెంగా కలవరపడ్డారాయన.




"విషయానికొస్తున్నా. మన కృష్ణమాచార్యులి కూతురూ ఎర్రెంకడి కొడుకూ ప్రేమించుకున్నార్ట. వర్ణాంతర ప్రేమన్నమాట. లేచిపోయి పెళ్ళిచేసుకుందామనికూడా అనుకున్నట్టు గోపాలాచార్యులు విన్నాట్ట. ఆ విషయమై వీరభద్రయ్య పెద్దల్ని సమావేశపరచమంటే అందర్నీ పిలిచాను".

"అసలిందులో మనం చర్చించాల్సిందీ తీర్పివ్వాల్సిందీ ఏముంది? ఒక తగువూ లేదు ఒక సమస్యా లేదుకదా!" గోపాలం అన్నాడు.

కృష్ణమాచార్యులికి కాస్త వూరటగా అన్పించింది.

"అదేవిటి గోపాలం అలా అంటావేమిటి. మా అబ్బాయి ఎవర్నో పెళ్ళి చేసుకొచ్చినపుడు నువ్వు రాలేదుకాని ఈ ఆచార్లెన్ని గంతులేశాడనీ! వెలెయ్యాలన్నాడు. శ్రాద్ధం పెట్టాలన్నాడు. అదన్నాడు ఇదన్నాడు! ఇప్పుడు వాళ్ళమ్మాయియూ ఆ మాలోడూ అదే పని చేస్తున్నారు గనుక ఏం తీర్పు చెబుతారో చెప్పమనండి" తన కొడుకుని దూరం చేశాడన్న కక్షతో వుద్రేకపడ్డారు వీరభద్రయ్య.

"వాళ్ళు పెళ్ళి చేసుకోలేదుకదా వీరభద్రయ్యా" మునసబుగారన్నారు.

"పెళ్ళాడకపోతే మాత్రం రాసుకుతిరగలేదా? మనకు తెలీదుకాని ఇంకెన్ని చేశారో"

"విన్నారా మునసబుగారూ ఆ ముదనష్టపు మాటలు" కృష్ణమాచార్యులు ఫిర్యాదు చేశారు దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ.

"నువ్వుండు ఆచార్లూ. ఇంతకీ నువ్వేమంటావు వీరభద్రయ్యా? "

"అదేదో పెద్దలు- మీరే చెప్పండి. ఇదివరకు మాలవాళ్ళు గేటుదాటి లోపలికొచ్చారని ఆవుపేడ నీళ్ళతో శుద్ధిచేశాడుగా ఈ పెద్దమనిషి ఇప్పుడేమంటారో ఏంచేస్తాడో ఆయన్నే అడగండి".

కృష్ణమాచార్యులి మొఖంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

"నాదో ప్రశ్న ఆచార్లుగారూ! ఒకవేళ వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్న సంగతి యదార్ధమైతే వారి పెళ్ళికి మీరొప్పుకుంటారా? " గోపాలం ప్రశ్నించాడు.

అంతా తుళ్ళిపడి చూశారతడివంక.

"చూశారా చూశారా. సద్బ్రాహ్మణుడ్ని పట్టుకొని ఎలా కూస్తున్నారో విన్నారా మునసబుగారూ? ఈ వూళ్ళో పుట్టిపెరిగినవాడ్ని. నా సంగతి మీకు తెలీదూ? నేనెన్నడైనా ఆచారసాంప్రదాయాల్ని దాటానా? శాస్త్రవిరుద్ధంగా నడిచానా? ధర్మాన్ని అతిక్రమించానా? చెప్పండి మునసబుగారూ" ఆవేశపడ్డారు కృష్ణమాచార్యులు.

"మీరలా ఆవేశపడితే ఎలా చెప్పండి. మీ అభిప్రాయం ఏమిటో మీ మనస్సులో ఏముందో తెలుసుకోకుండా మేమెలా ఒక నిర్ణయానికి రాగలం చెప్పండి? ఏవంటావు మునసబుమావా- నేనడిగింది సబబా కాదా? " గోపాలం అడిగాడు.

"అవునవును. అభిప్రాయాలు క్షుణ్ణంగా తెలుసుకోకపోతే ఎలా? ఆఖర్న మేమొకటంటే నువ్వింకోటనుకోవచ్చు. అంచేత మిమ్మల్నలా ప్రశ్నించాడు తప్ప మిమ్మల్ని వేలెత్తి చూపాలని కాదు అవమానించాలని కాదు".

"అయితే ఇదికూడా చెప్పండి. మీ అమ్మాయి మీరు తెచ్చే సంబంధం చేసుకుంటుందా? " గోపాలం అడిగాడు.

"ఆ. చచ్చినట్టు!".

"మరింక గొడవేమిటీ. మీ పెళ్ళికి మేం ఒప్పుకోమని ఇద్దరికీ చెప్పేయండి. వేరే సంబంధం చూసి మీ అమ్మాయికి పెళ్ళి చేసెయ్యండీ".

గోపాలం మాటలకి కృష్ణమాచార్యులకి చాలా సంతోషం కలిగింది. మనస్సు కుదుటపడింది. కృతజ్ఞతగా చూశాడతడివంక. లైటువెలుగులో ఆ భావాన్ని చదివిన మునసబుగారు కంగారుపడ్డారు.

గొడవచెయ్యలేదు సరికదా మందలించడ

మైనా చేయకపోయేసరికి వీరభద్రయ్యకి చాలా అసంతృప్తి కలిగించింది.

"ఏమో. నాకీ తంతు నచ్చలేదండి. వర్ణ సంకరానికి పాల్పడినా ధర్మాచారాన్ని అతిక్ర మించినా ఏమీ అనకపోవడం బాగోలే దండి. అసలలాటి ఆలోచనలే పుట్టకూడదు. పుడితే సమాజం భ్రష్టమైపోతుంది!" అన్నాడు అక్కసుగా.

"వీరభద్రయ్య చెప్పిందీ నిజమే. అలాటి దుష్టఆలోచన వచ్చిందంటే పతనం మొదల య్యిందన్నమాటే. ఇక ప్రేమించడాలూ కడ జాతి వాడితో పూసుకుతిరగడాలూ మలిన మనస్సుకి చిహ్నాలు" రామ్మూర్తినాయుడ న్నారు.

మునసబుగారి అభిప్రాయం తెలీకపోవ డంతో తటపటాయిస్తూనే అన్నాడు నారా యణ "కట్టుబాటు తప్పాలని చూసిన ఆ అమ్మాయిని ప్రధమతప్పిదంగా మందలించి వదిలెయ్యొచ్చు కాని సూర్యాన్ని వదలకూ డదు. అతడు దేవాంతకుడు. పెద్దలమీదకి దండెత్తినవాడు. చిన్నతప్పుకి చెట్టుకి కట్టేసి అవమానించినవాడు. మందబలంతో విర్ర వీగే అలాటివాడ్ని వూరికే వదిలేస్తే రెచ్చిపో తాడు. ఏమైనా చెయ్యడానికి సాహసిస్తాడు. ఏకంగా బ్రాహ్మలపిల్లకి గేలం వేశాడంటే వాడి దుష్టఆలోచనేమిటో తెలీటంలేదూ? ".

"నేనొప్పుకోను. పెద్దకులంవాళ్ళు చేసినా అలగాజనం చేసినా తప్పుతప్పే. తప్పుచేసిన వార్ని దండించడం ఒప్పే అవుతుంది తప్ప తప్పుకాదు. అందుకని సూర్యాన్ని శిక్షిస్తా నంటే ఎలా? మనస్సులోని కసిని ఇలా తీర్చుకోవాలని చూస్తే ఎలాగ? " గోపాలం తీవ్రస్వరంతో అన్నాడు.

నారాయణ నీళ్ళు నమిలాడు.

"కోపతాపాలకిది సమయంకాదురా గోపాలం. నారాయణ అన్నదీ సబబే. సూర్యం ఎలాటివాడో ఎలా ప్రవర్తిస్తున్నాడో వివరించాడంతే. ఇంటిగడపకూడా దాటెర గని ఆ పిల్లని వల్లో వేసుకున్నాడంటే వాణ్ణి తక్కువగా అంచనా వేస్తే ఎలాగ? వాడిమీద చర్య తీసుకోవాలి. లేకపోతే వాడి మందబలానికి భయపడ్డామనుకోరూ వూరి జనం? అంచేత అన్నీ ఆలోచించిన మీదట నేను చెప్పేదేమిటంటే కృష్ణమాచార్యులు ఆ సూర్యాన్ని వెంటనే పనిలోనుండి తొలగించె య్యాలి. ఇంకెవ్వరూ అతగాడ్ని పాలేరుగా పెట్టుకోకూడదు. పనిలోనికి రానివ్వకూ డదు" మునసబుగారన్నారు.

"ఇది అన్యాయమైన తీర్పు. పక్షపాతంతో చేసింది. దీన్ని నేను అంగీకరించను".

"అదికాదురా గోపాలం...".

"నేనింకేమీ వినను. జరిగిందానిలో ఇద్ద రిదీ సమానమైన పాత్ర అయినప్పుడు ఒకర్నే అంత తీవ్రంగా శిక్షించడం అన్యాయం. అక్రమం!".

గోపాలం మాటలకి బిత్తరపోయారంతా. అతడు పైపంచె భుజాన వేసుకుని విసు రుగా లేచేసరికి కంగారు పడిపోయారు మునసబుగారు.

"మరేం చేద్దామంటావురా గోపాలం".

"ఏమీ జరగలేదు కనుక ఎవర్నీ శిక్షిం చొద్దు".

"మీరేమంటారు? " మిగతా పెద్దలవంక చూశారు. అంతా తలోరకంగా ఫీలవుతు న్నారు. గోపాలం నోటికి జడుస్తున్నారు.

"అయితే ఒకపని చేద్దాం. పనిలో వుంచు కోవడమూ మానిపించెయ్యడమూ అన్నది కృష్ణమాచార్యులకే వదిలేద్దాం" అంటూ లేచారు మునసబుగారు.

గోపాలం విజయగర్వంతో వెళ్ళిపో యాడు. కృష్ణమాచార్యులు తేలికపడ్డ మన సుతో నిష్క్రమించారు.

మునసబుగారు కొంచెం డీలా పడ్డారు. అవకాశం చిక్కినట్టే చిక్కి చేజారిపోయిందే అని బాధపడుతున్నాడు నారాయణ. ఇహ పెద్దల్లోనూ ఐకమత్యం వుండదు కాబోలను కుంటున్నారు రామ్మూర్తినాయుడు.





లేచి తుండుగుడ్డ దులిపి విసురుగా అక్కడ్నుంచెళ్లిపోయారు వీరభద్రయ్య.

అది పెద్దల సభలాగాక మయసభలా అన్పిస్తోందాయనకి.

"వున్నవాడికో న్యాయం లేనివాడికో న్యాయం! వీళ్లని నమ్మడమంత బుద్ధి తక్కువ పనింకోటిలేదు. కుక్కతోక పట్టుకుని గోదారి ఈదినట్టయింది తన పని. వీళ్ల మాటల్ని నమ్మి కొడుకుని దూరం చేసుకున్నాడు. ఇంటిది మంచంపట్టింది బెంగతో. ఇంకా వీళ్లనీ, వాళ్ల సొల్లు కబుర్లూ పట్టుకు వేలాడితే ఇంకా నాశనమైపోతాను. కులం గిలం అని వూరేగటం వెర్రితనం. అబ్బాయినీ కోడల్నీ రమ్మని వుత్తరం రాసేస్తాను. ఇద్దర్నీ గోదార్లో స్నానం చేయించి గుళ్లో అభిషేకం చేయిస్తాను. అన్ని పాపాలూ పోతాయి. అంతా హాయిగా కలిసుండొచ్చు! ఒక నిశ్చయానికొచ్చారాయన.

★ ★ ★

ప్రభుత్వం నిర్మిస్తోన్న ఇళ్ల లబ్ధిదారుల్లో కొందరొచ్చి సూర్యాన్ని కలిశారు.

నిర్మాణం బావోటంలేదనీ నాసిరకం సరుకులు వాడుతున్నారనీ ఇదేమని అడిగితే కోప్పడుతున్నారనీ చెప్పేరు.

"వాళ్లనేమీ తిననివ్వటం లేదని వాళ్లకి గుర్రుగా వుంది. రేపొచ్చి మాట్లాడతాన్లే. పక్కాగా నిర్మించేట్లు చూసే బాధ్యత నాది" అని చెప్పేడు.

మల్లిగాడొచ్చి పోరంబోకు స్తలానికి పట్టాలిప్పించడానికి చేస్తోన్న కృషి వివరించాడు. రికార్డులూ తబ్సీళ్లూ పంపమని యమ్మార్వోకి ఆదేశాలొచ్చాయన్నాడు. త్వరలో చెరువు తవ్వితే వచ్చే సీజన్లో రొయ్యపిల్ల వెయ్యొచ్చని అంతా వుత్సాహ పడుతున్నారన్నాడు.

"మన ప్రయత్నాలు ముమ్మరంచేసి చూద్దాం. పని జరిగితే మంచిదే. లేకపోతే ఉత్తర్వులు కోసం ఎదురు చూడకుండా చెరువు తవ్వేద్దాం"

సూర్యం మాటల్ని మిగతావాళ్లు బలపరిచారు.

సరిగ్గా అప్పుడు హడావిడిగా వచ్చాడు గ్రామ నౌకరు బుల్లెయ్య.

"నీ గురించి పెద్దలు మీటింగెట్టేర్రా" అన్నాడు వస్తూనే.

"ఎన్ని మీటింగులైనా పెట్టుకోనీ. సూర్యాన్నేం చెయ్యలేరు. ఒక్క వెంట్రుక కూడా పీకలేరు" జాన్ అన్నాడు.

"సెప్పేది ఇనకుండా సైయ్యంటూ కాలు దువ్వుతారేంట్రా. ఈడు ఆచార్లుగోరమ్మాయిని పేమించాట్ట. పెళ్లాడదావని సూత్తన్నాట్ట. అంతా ఈడిమీద ఒంటికాలిమీద లేసినారు. సమయానికి గోపాలంగోరు అడ్డుపడకపోయుంటే ఏదోటి సేసేవోరు"

అంతా ఆశ్చర్యంగా అపనమ్మకంగా చూశారు. ఇదంతా నిజమేనా అన్నట్టు చూశారు. సూర్యం మాట్లాడలేదు. అతడి మౌనం వారికంతా చెప్పింది.

"ఇందులో తప్పేం వుందేంటి. ఆ మద్దెన ఈర భద్రయ్యగోరబ్బాయి మా కులందాన్ని పెళ్లాడలా. అలాగే ఈడు బామ్మర్లమ్మాయిని పెళ్లాడతాడు" మల్లిగాడన్నాడు.

"అవునంతే... అంతా మనుసులే. అంతా సమానమే. మా సూర్యంగాడు ఇలాంటి పనిచేసినందుకు మాసెడ్డ సంబరంగా వుంది" దావీదు వుత్సాహంగా అన్నాడు.

"ఆ పిల్ల వూ అంటేశాన ఎత్తుకొచ్చి మరీ పెళ్లిసేసేత్తాం. అడ్డొచ్చినోడి బుర్రసేత రామకీర్తన పాడిత్తాం" జాన్ మీసం మెలేశాడు.

"ఆగండాగండి. ఇది నా వ్యక్తిగత సమస్య. నన్ను పరిష్కరించుకోనీండి..." దృఢంగా అన్నాడు సూర్యం.

"అది కాదురా"

"ఇంకేం చెప్పొద్దు. నావల్ల ఎవరికీ ఎలాంటి ఇబ్బందీ కలగటంనేను సహిం చను. బుల్లెయ్యా! వాళ్లేమని నిర్ణయించుకు న్నారు"

"పన్లోంచి తీసేడవో ఏదో సెయ్యమ న్నారు. సెప్పేనుగా. గోపాలంగారు అడ్డుప డకపోతే కత శానాదూరం పోయేది. అయినా ఆళ్లతో మనకి ప్రేమలూ పెళ్లిళ్లూ ఏవిట్రా. ఆరు పెద్దోరు. గొప్పోరు. డబ్బు న్నోళ్లు. బలంవున్నోళ్లు. ఆరికెదురు తిరిగితే ఏవైనా సేత్తారు. ఎంతకైనా తెగిత్తారు. మద్దెన నలిగిసచ్చేది మన్లాంటి బక్కోళ్లమే. రామదాసుగోడి అర్ధాంతరపు చావు సంగతి మరిసిపోకండొరేయ్"

"ముసలమ్మ కబుర్లు చెప్పకు. మా సత్తా ఏంటో రుచి చూపించేక కూడా మాకెవడె దురు లేస్తాడు? " జాన్ అన్నాడు.

"ఆళ్ల ఎత్తులు నీకు తెలవ్వారే పిల్లకాకీ. ఆళ్ల సంగతులు సూసిసూసి తలనెరిసిపో యింది. ఆళ్లకి కలిసొత్తే దువ్వుతారు. ఎదు రొత్తే కాటేత్తారు"

"మావేమీ గాజులు తొడిగించుకోలేదు" మల్లిగాడు లేచాడు.

"వూరుకోండెహె. నిన్నగాక మొన్న కళ్లు తెరిసినోళ్లు! నాకు సెబుతారేంట్రా. పెద్దోరి జాతకాలు తెల్సినోడ్ని. నా ముందల గంతు లెయ్యకండి. సూర్యంగాడు మనోళ్లకెన్నో సేత్తన్నాడు. గౌరంగా బతికేట్టుసేత్తన్నాడు. ఇళ్లంటన్నాడు పట్టాలంటన్నాడు. వూరూ వాడా ఆడి మీదెన్నో ఆశలెట్టుకుంది. అలా టోడికి ఏవైనా అయితే అంతా ఏవైపో వాల? ఆడ్ని ఏవన్నా సేసినోళ్లూ నిన్నూ నన్నూ వదుల్తారా. వేటాడరూ? " కోప్ప డ్డాడు బుల్లెయ్య.

అందరి గుండెలూ బరువెక్కాయ్. ఆలోచ నలోపడ్డారు.

"నువ్వెక్కువగా స్పందిస్తూ అధికంగా భయపెడుతున్నావు బుల్లెయ్యా. నాకేం కాదు. నన్ను తాకే సాహసం కూడా ఎవ్వరూ చెయ్యలేరు. ఎంచేతంటే నేను ఒంటరిని కాదని వాళ్లకి తెలుసు. నా బలం ఏమిటో కూడా వాళ్లకి తెలుసు. పైగా ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో మంచిని కాదనగల రేమోగాని మందని కాదన్లేరు"

అంతా విస్మయావస్థనుండి తేరుకోకుం డానే లేచి ఇంటిముఖం పట్టాడు సూర్యం.

అయితే భయపడినంతా జరిగిందన్న మాట. తాము ఒక్క అడుగైనా ముందుకి వెయ్యకుండానే అందరికీ తెలిసి పోయిం దన్న మాట. అగ్రహారంలోని జనం తనని అదోలా చూడటానిక్కారణం ఇదేనన్న మాట. దీన్ని మనస్సులోపెట్టుకునే అలివేలి తల్లి ఆడ పులిలా తనమీద విరుచుకుపడిం దన్నమాట!

ఇప్పుడేవిటి చెయ్యటం?

విషయం పెద్దలదాకా వెళ్లిందిగనుక కృష్ణ మాచార్యులు ఆవేశంతో వూగిపోయి ఏమైనా చెయ్యొచ్చు! అసలీపాటికే అలివేలు మీద ఒత్తిడి తెచ్చివుండొచ్చు! ఆమెది వజ్ర సంకల్పం. దానినెవరూ కదల్చలేరు సడలిం చనూలేరు!

మరేదిదారి? ఈ పద్మవ్యూహంనుంచి తామిద్దరూ క్షేమంగా బయటపడటం ఎలా?

ఆవేదనతో ఆలోచనతో వుడికిపోతూ ఇంటికెళ్లి పడుకున్నాడు. తల్లి సమీపిం చింది. మెలకువగా వున్నట్టు తెలిస్తే ప్రశ్నల్తో ఏడుపుల్తో వేధిస్తుందని నిద్ర నటిం చాడు. అయినా పిల్చింది. పలకలేదు.

"అప్పుడే నిద్రోయావా! ఏంటోరా! నీ మీదెన్ని బెవలు ఎట్టుకున్నాం! అవ్వాలవ్వా! బేమ్మర్లమ్మాయిని పెల్లాడతానంటావుట్రా? ఆళ్లజోలికెళ్తే పాపం సుట్టుకుంటాదిరా కొడకా. ఆళ్ల దగ్గర మాయలూ మహిమలూ

వుంటాయిరా. ఆరికి కోపంవత్తే దేవుడికీ వత్తాదిరా. ఏదో సల్లగా కలోగంజోతాగి బతుకుతున్నాం. మా బతుకుల్లో నిప్పులు పొయ్యకొరే బిడ్డా. ఏదో వూర్ని బాగుజేత్త న్నావని పొంగిపోతావుంటే ఇలా కొంపమీదకి ముప్పు తెత్తావుర్రా. పెద్దోరితో ఇరోదం పాపుతో సెలగాటమెురేయ్. నీకేవన్నా అయితే మావేమైపోవాల్రా కొడకా!" కొడుకు పక్కన కూర్చుని తల నిముర్తూ స్వగతంగా అనుకుంది.

సూర్యం అంతా విన్నాడు. అతడి గుండెలు బరువెక్కాయ్!

★ ★ ★

కృష్ణమాచార్యులు నిద్రపట్టక దొర్లుతున్నారు.

ఆయన మనస్సు తుఫానులో చిక్కుకున్న పడవలావుంది.

కళ్లనుంచి కన్నీళ్లు ధారాపాతంగా కారిపోతున్నాయ్.

ఇలా ఎందుకు జరిగిందో అలాంటి విషపువూబిలో ఎలా చిక్కుకుపోయారో అర్థంకావట్లేదు. వూరందరిచేతా గౌరవాభిమానాలు పొందే తను అవమాన భారంతో తలొంచుకోవాల్సిన పరిస్థితొచ్చింది. అగ్రహారానికి తలమానికంగావుండే తను ముఖం చాటెయ్యాల్సిన దౌర్భాగ్యస్థితి దాపురించింది. ధర్మనిష్ఠాగరిష్ఠులూ వేదపారాయణులూ అంటూ ప్రశంసించబడ్డ తనూ తన వంశస్తులూ సిగ్గుతో కుళ్లిపోయేలా ఎప్పటికీ తొలగని మచ్చలా...!

లేదు లేదు... ఏ మానవాతీత శక్తి ప్రేరణాలేకుండా అలా జరగదు. అగ్నిని చెదలంటలేవు. అంటిందంటే ఏదో శక్తి దైవశక్తి...!

ఆయన గుండెలు గుభిల్లుమన్నాయి.

మునసబుగార్తో కలిసి దేవుడి సొమ్ముని కైంకర్యం చేసేస్తున్నారు. అందుకే దేవుడు ఆగ్రహించి తనింట్లో ముసలం పుట్టించలేదు కదా?

వణికారు. లేచి లెంపలేసుకున్నారు. దేవ దేవా మన్నించు అని ప్రార్థించారు.

గుండెలు కుదుటపడ్డాయి.

పుష్పవల్లి అన్నట్టు ఇంత జరిగేకకూడా సూర్యాన్ని పనిలో వుంచడం మంచిదికాదు. అతడ్ని తీసెయ్యడంవల్ల లక్షల్లో నష్టం రావొచ్చు అయినా కుటుంబ పరువు ప్రతిష్టలముందు అవెక్కువకాదు. కాని మునసబుగారింటినుంచొస్తొంటే వెనకాలే వచ్చిన గోపాలం మరో భయం కల్పించిపోయాడే!

"ఆచార్లుగారూ, తొందరపడొద్దు. సూర్యాన్ని పనిలోంచి తీసేస్తే గొడవచేస్తాడు. రేపట్నుంచి మీ పనిలోకెవ్వరం రామని మొరాయించినా మొరాయిస్తారు. చాకలీ మంగలీ కూడా రాకుండా కట్టడి చేసినా చేస్తారు. ఇప్పుడు వాళ్లంతా సంగంలో సభ్యులైపోయారుకదా! అంతటితో ఆగకుండా మీ అమ్మాయి పెళ్లిలో గొడవ చెయ్యొచ్చు మగపెళ్లి వారికి ఏవేవో కల్పించి చెప్పొచ్చు దానాదీనా పీటలమీది పెళ్లి ఆగిపోతే మీ అమ్మాయి భవిష్యత్తేమవుతుందో ఆలోచించండి" అని ఒకరకంగా హెచ్చరించాడు.

అంతా గజిబిజిగా వున్నా ఒక్క సంగతి మాత్రం స్పష్టమయ్యింది.

అమ్మాయి పెళ్లి నిర్విఘ్నంగా జరిగేవరకూ సూర్యాన్ని ఏ రకంగానూ రెచ్చగొట్టకూడదు!

అదే మంచిది. దానికే కట్టుబడి వుంటాను అనుకున్నారు.

ఆ మర్నాడే బావమరిది ఇంటికెళ్లి సంబంధం ఖాయం చెయ్యడమేగాక ముహూర్తం కూడా పెట్టించెయ్యాలనుకున్నారు. బ్యాంకులో రొయ్యల డబ్బు వుంది గనుక కట్నం కాస్త ఎక్కువ విసిరి అయినా సరే నిశ్చయం చేసెయ్యాలనుకున్నారు.

ఎంతో వూరట కలిగింది. ధైర్యం వచ్చింది.

మర్నాటి ఉదయం సూర్యం రాగానే దగ్గ రకి పిలిచారు.

"కాలం బాగోలేదు. నువ్విహ రాత్రీ పగలూ చెరువు దగ్గరే వుండి రొయ్యల పని చూడు. పశువుల పని చూట్టానికి చిన్న కుర్రాడ్ని కుదిర్చాన్లే" అని చెప్పేరు.

ఏవేవో వూహించుకున్న సూర్యానికి నోట మాట రాలేదు!



పెద్ద మునసబుగారు గంభీరంగా కూర్చు నున్నారు. ఆయన మొహం పాలిపోయి వుంది ఒక్కసారే పదేళ్లు పైబడ్డట్టుగా వున్నారు.

ఆయనకో పక్కన పెద్ద కొడుకు, వీఏఓ కూర్చున్నాడు. రెండోపక్క రెండో కొడుకు సర్పంచ్ చిట్టిబాబు కూర్చున్నాడు.

అనంతయ్య జమానా ముగియడంతోనే ఆ వూరికి తిరుగులేని నాయకుడుగా పెద్ద మునసబుగారు రూపుదిద్దుకున్నారు. గత చాలా ఏళ్లుగా ఆ వూరిమీద ఆ కుటుంబం పెత్తనమే కొనసాగుతూ వస్తోంది.

పెద్ద మునసబుగారు కాస్త వంగేసరికి కొడుకులు అందొచ్చారు. దాంతో నిన్న మొన్నటివరకూ ఆ త్రిమూర్తులకి ఎదురనే దిలేకపోయింది. అధికారబలం, చట్టబలం రెండూ ఆయన రెండు చేతులై ఆయన ధాటీకి ఎదురులేకుండా చేశాయి. ఆయన గీసింది గీత, చెప్పింది వేదం అయ్యింది.

అటువంటిదిప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

పెద్దలు ఒక్కొక్కరూ నిర్వీర్యులవుతు న్నారు.

దళితులు రోజురోజుకీ చైతన్యం పెంచు కని సంఘటితశక్తిగా రూపొందుతున్నారు.

ఆ శక్తిపేరు ఆ స్ఫూర్తి పేరు సూర్యం!

"లాభంలేదురా. ఆ సూర్యంగాడు సామా న్యుడుకాదు. మన అధికార ప్రపంచాన్ని కబళించడానికే పుట్టినట్టున్నాడు. వాడు వేస్తోన్న ప్రతి అడుగూ మన గుండెల మీద సమ్మెటపోటవుతోందిరా" నిస్పృహగా అన్నారు మునసబుగారు.

"నాకీ సంగతి ముందే తెలుసు. గోటితో గిల్లెయ్యకపోతే గొడ్డలి వుపయోగించాల్సొ స్తుందని ఎప్పుడో గ్రహించాను. అందుకనే పొరుగూర్నించి ఇద్దరు రౌడీల్ని పిలిచాను. చీకట్లో ఒంటరిగా వున్నాడు. బుర్రబద్దలు గొట్టి కాలువలో తోసెయ్యండ్రా అని పుర మాయించాను. వెధవలు! ఎదురు దెబ్బలు తిని పారిపోయొచ్చారు. లేకపోతే వాడి పీడ ఎప్పుడో విరగడయ్యేది" నిట్టూర్చాడు చిట్టి బాబు.

"ఆ సూర్యం దేవాంతకుడు నాన్నా! ఆ పోరంబోకు స్థలాన్ని వాళ్లకి పంచి పట్టాలి వ్వడానికి ప్రభుత్వం అంగీకరించిందంటే వాడెలాటి ముగ్గులు పెట్టాడో మీరే ఆలో చించండి. అసలు ఏ పార్టీ ప్రభుత్వమైనా సరే హరిజనుల్నేమీ అనలేదు. వాళ్ల ఓట్ల కోసం వారిని ఆకర్షించడానికెన్నెన్నో జిమ్మి క్కులు చేస్తూనే వుంటుంది. మీరూ నేనూ ఆ భూమికోసం ఎంతో ప్రయత్నించాం. ఎన్నో పైరవీలు చేయించాం. అయినా





మనకి పనవ్వలేదు. వాళ్లు ఆక్రమించేసరికి చిటికెలో పనైపోయింది. చెరువుతవ్వి రొయ్యలు పెంచడానికి అప్పుకోసం అప్పుడే కాగితాలు కూడా తయారుచేస్తున్నారు. ఇక సూర్యాన్ని పట్టశక్యంకాదు" వీఏఓ అన్నాడు.

"ఏమైనాసరే వాడి అడ్డు తొలగించాల్సిందే నాన్నా! నిన్నగాక మొన్న చంద్రి గొడవని ఎంత రాజకీయం చేశాడో చూశావుగా. బుల్లి విషయాన్ని రాద్ధాంతం చేశాడు. కూలోళ్లం దరిచేతా సమ్మె చేయించాడు. సురేష్ అంతటి వాడిచేత క్షమాపణ చెప్పించాడు.

ఇక వూరికి వాడే లీడరు. ఈసారి పంచాయితీ ఎన్నికల్లో సర్పంచి పదవివాడిదే. ఇక మనల్ని చూసి ముసిల్దికూడా లేవదు. ఇహ ఆస్తులమ్ముకుని ఏ పట్నమో పోవాల్సిందే" సర్పంచ్ అన్నాడు నిరాశగా.

"ఆ సంగతి నేనూ గ్రహించాన్రా. అధికారం మన ఇంటిపేరు. అది లేకుండా బతకటం నాకు చేతకాదు. నేను బతికున్నంత కాలం పెత్తనం మరొకరి చేతుల్లోకి మారటం సహించలేను. అటు సూర్యుడిటు పొడిచినా సరే వూరిమీద నా గుత్తాధిపత్యం చెక్కుచెదరడానికి వీల్లేదు. ఇన్నాళ్లూ అన్నీ తెలిసి అన్నీ గ్రహించి కూడా సంయమనం పాటించాను. ఎందుకోతెలుసా?" మునసబుగారు ప్రశ్నించారు.

ఇద్దరూ తండ్రివంక ఎందుకన్నట్టు చూశారు.

"సూర్యంలో నలుగుర్నీ ఆకర్షించే గుణం ఆకట్టుకునే గుణం వుంది. అతడ్ని మంచి చేసుకుని మనవైపు తిప్పుకుంటే మనకిక ఎదురనేది వుండదు. వాడ్ని మనడమ్మీగా సర్పంచిగా కూర్చోబెట్టి వాడి సపోర్టుతో మన చిట్టిబాబుని యమ్మెల్యే చెయ్యొచ్చనుకున్నాను. దళితుల సపోర్టు లభిస్తే యమ్మెల్యే పదవేకాదు యంపీ పదవికూడా చేతికందితీరుతుంది. కాని వాడు నాదారిలోకి వచ్చే రకంకాదని ఒకటికన్నా ఎక్కువసార్లే ఋజువైపోయింది. ఇక ఆ ఆశ కూడా పోయింది. వాడిమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించక తప్పదు. నామరూపాల్లేకుండా చెయ్యకా తప్పదు"

"ఏం చేద్దామంటారు?" పెద్ద కొడుకు అడిగాడు.

"సరైన యంత్రాంగం కావాలిరా! నా తదనంతరం కూడా మన కుటుంబ పాలన కొనసాగాలి. అందుకోసం సరైన పన్నాగం పన్నాలి. అవసరమైతే రక్తాన్ని పారించడానికి క్కూడా వెనకాడను"

"మీ తెలివి తేటలు అమోఘం నాన్నా! మీరో మంత్రం వేస్తే దానికి తిరుగుండదు" వుబ్బేశాడు చిన్న కొడుకు చిట్టిబాబు.

అతడికి త్వరగా యమ్మెల్యే అయిపోవాలనీ ఆ పిమ్మట కులపు కోటాలో మంత్రి పదవి సంపాదించేసుకోవచ్చనీ ఆశగా వుంది. ఆస్తుల్నీ ఐశ్వర్యాన్నీ ఇబ్బడి ముబ్బడిగా పెంచేసుకోవచ్చనీ పెద్దలతో కాంట్రాక్టర్లతో అధికార్లతో సంబంధ బాంధవ్యాలు పెంచుకుని రాష్ట్ర నాయకుడిగా ఎదిగిపోవాలని ఆరాటంగా వుంది.

"సూర్యంగాడ్ని మన దారినుంచి తప్పిస్తే చాలు వూళ్లో మనల్ని ఎదిరించేంత దమ్ములెవరికీ వుండవు. గోపాలం సున్నలాటోడు. సూర్యం పక్కన లేకపోతే అతడో పెద్ద జీరో!"

"అన్నయ్య చెప్పిందీ పాయింటేగాని సూర్యం విషయంలో తాత్సారం ఏమాత్రం పనికిరాదు. చూస్తోంటే ఒక పథకం ప్రకారం పెద్దలందర్నీ ఒక్కొక్కరిగా పడేస్తూ వస్తున్నట్టుగా వుంది"

చిట్టిబాబువంక సాలోచనగా చూశారు మునసబుగారు.

"అవున్నాన్నా. పరంధామయ్యని మాలపల్లెలో చెట్టుకు కట్టేసి తల పొగరణిచేశాడు. వెంకటరెడ్డి ఇంటి మీదకి దండెత్తి వెళ్లి

కుక్కిన పేనుని చేసేశాడు. కృష్ణమాచార్యులి కూతుర్నిలోబరుచుకుని అట్నించి నరుక్కొచ్చాడు. శివస్వామి మీద సవాలు విసిరి హరీమనేట్టు చేశాడు. ఆ రకంగా నారాయణని దెబ్బతీసేశాడు. గోపాలాన్ని తన పక్కకి తిప్పేసుకున్నాడు. అతడిద్వారా అగ్ర కులాల్లోని కొందరి సపోర్టూ కొట్టేశాడు. పెద్దగాకపోయినా మాజీ గ్రామపెద్ద కొడుకైన సురేష్ చేత మాలదాని కాళ్లు పట్టించేశాడు. ఇక పెద్దల్లో మిగిలింది రామ్మూర్తినాయుడూ..."

"నేనూను!" వాక్యం పూరించారు మునసబుగారు.

వులిక్కిపడ్డారు కొడుకులిద్దరూ. కించిత్తు భయంగా చూశారుకూడా.

నవ్వేరు మునసబుగారు.

"ఇందరి తలలొంచినవాడు నామీద బాణం ఎక్కుపెట్టకుండా ఎందుకుంటాడ్రా! ఒక్కొక్కర్ని కూల్చేక ఆఖర్న నా మీదకి జైత్రయాత్రకి వద్దామని పథకం వేస్తూండివుంటాడు. పిచ్చోడు. నా తడాఖా తెలీదు పాపం"

ఆయన్లో కొత్త వ్యక్తి కన్పిస్తోంటే మ్రాన్పడి చూస్తుండిపోయారు కొడుకులిద్దరూ.

"నా చేతికి మట్టి అంటకూడదనే ఇన్నాళ్లూ ఆగాను. అసలు మొన్న ఆ ప్రేమ గొడవలో గోపాలం అడ్డురాకపోయి వుంటే ఆ పెద్దల సమావేశంలోనే సూర్యాన్ని చావుదెబ్బ తీసేద్దును"

"దొంగదెబ్బ తీయాలి తప్ప ఎదురుపడి దెబ్బ తీయలేం నాన్నా"

కొడుకువంక చూసి నవ్వేరు.

"వర్ణాంతర వివాహాన్ని మించినది లేదురా! తెలివిగామనం వుపయోగించుకోవాలిగాని. అగ్రకులాల వారెవ్వరూ అలాటి వివాహాన్ని సమర్థించరు. నిమ్న కులాల వారు కూడా మనస్ఫూర్తిగా సమర్థించరు. దేవుడు, మతం, కట్టుబాటు, సాంప్రదాయం వారిని భయపెడతాయి. అంచేత సూర్యాన్ని మెచ్చుకునేవారు సైతం అతడో బ్రాహ్మలమ్మాయిని పెళ్లాట్టాన్ని ఆమోదించరు. ప్రోత్సహించరు. పైపెచ్చు నిరుత్సాహపరుస్తారు. విమర్శిస్తారు. తిట్టిపోస్తారు. ఆ బలహీనతని మనం కేష్ చేస్కోవాలి"

"వాడా అమ్మాయిని లేవదీసుకుపోతున్నప్పుడు తరిమికొట్టొచ్చు! ఎవరూ అడ్డురారు!" అరిచినట్టుగా అన్నాడు సర్పంచ్.

"భేష్... బాగా గ్రహించావ్. ఇదివరకు రామదాసు నిలాగే దెబ్బతీశాడు అనంతయ్య. సజీవదహనంచేసి కేసులేకుండా తప్పించుకున్నాడు"

కానీ నాన్నా! కృష్ణమాచార్యులు కూతురి పెళ్లి చెయ్యడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. ఈసరికి కుదిర్చేశాడేమో కూడా" వీఏఓ అన్నాడు.

"కుదర్చనీరా! వేడి పెరుగుతుంది. పెళ్లిరోజు దగ్గర పడితే మరీ మంచిది. అప్పుడే కదా కథ క్లైమాక్స్‌కి చేరేది" నవ్వేరాయన.

"కానీ ఆ సూర్యం ఆ అమ్మాయిని లేవదీసుకుపోతాడనేమిటి? "

"ఆ వేడీ ఆ రక్తం ఆ వయస్సూ తిన్నగా వుండనివ్వవు. ఏదో సాహసం చెయ్యమని పురిగొల్పి తీరతాయి. మనం చేయాల్సిందల్లా వాళ్లిద్దరి మధ్యా కాస్త రాయబారమూ కాసిన్ని సమిధలూ ఏర్పాటుచేస్తే చాలు. ఆపై కార్యక్రమం మనం చూసుకోవచ్చు"

"ఆ పని నేను చేస్తాను" చిటికె వేశాడు చిట్టిబాబు.

★ ★ ★

పిచ్చెత్తినట్టుగా వుంది సూర్యానికి.

ఒకటి కాదు రెండు కాదు నాలుగు రోజులయ్యింది అలివేల్ని చూసి.





ఆమె ఎలావుందో తెలీదు. ఎక్కడుందో తెలీదు.

ఏదో పని కల్పించుకుని వెళ్లాడు. రాత్రుళ్లు ఇంటిచుట్టూ తిరిగాడు. తెల్లవారు ఝామునెళ్లి పెరట్లో కూర్చున్నాడు. అయినా ఆమె ఆచూకీ తెలీలేదు. ఆమె గురించి కనీస సమాచారం అందించేవారే కరువయ్యారు.

అనుక్షణం ఆమెకోసం తపిస్తూ పిచ్చివాడై పోతున్నాడు. ఆమె లేనిదే బతకలేనంత ప్రేమలో కూరుకుపోయాడు.

కానామె దర్శనమే కావట్లేదు. కనీసం ఆమె జాడకూడా తెలీడంలేదు.

వారింట్లో ఏదో మార్పు ఏదో హడావిడి కన్పిస్తోంది. పెళ్లి పనులు చేస్తున్నట్టు అనుమానంగా వుంది.

అదే నిజమైతే అలివేలు పరాయిదైపోతే తను బతకగలడా? లేదు లేదు!

మరెలా? మరేం చెయ్యటం? మరేది దారి?

అంతా అయోమయంగా వుంది. గందరగోళంగా వుంది. పిచ్చిపిచ్చిగా వుంది.

అటువంటి స్థితిలో సూర్యం వుండగా చాకలి మంగి పిలిచిందతడ్ని. చాటుకి తీసుకెళ్లి రహస్యంగా మాట్లాడింది.

కృష్ణమాచార్యులి ఇంటినుంచి వస్తున్నానంది. పెళ్లి ఏర్పాట్లు జోరుగా జరుగుతున్నాయనీ నాలుగు రోజుల్లో పెళ్లి అనీ చెప్పింది. అలివేలుకి ఆ పెళ్లి ఇష్టం లేదనీ శోకదేవతలా వుందనీ చెప్పింది. అశోకవనంలోని సీతమ్మోర్లా కూర్చుని నువ్వొస్తావు రక్షించి తీసుకెళ్తావని కన్నీటితో చెప్పిందని చెప్పింది. అతడు రక్షించలేకపోతే పెళ్లిపీటలమీదకి తన శవం వెళ్తుందని ప్రతిజ్ఞ చేసిందని చెప్పింది. ఆ రాత్రి పశువులశాలలోకి రమ్మనీ అర్ధరాత్రి వేళ తనెలాహోలా వచ్చి కలుసుకుంటాననీ పట్నం పారిపోవచ్చనీ అలివేలు చెప్పమందని చెప్పింది. తప్పక చెబుతానని చేతిలో ఒట్టేసి వచ్చేనంది.

ఆ ఆడకూతురికి అన్యాయం చెయ్యొద్దంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

ఆమె మాటలు అమృతపు సోనల్లా అన్పించాయి. ఆమె మేలు మర్చిపోలేనన్నాడు. ఆ రాత్రికే వెళ్తాననీ ఆమెని తీసుకుని ఊరొదిలి వెళ్ళిపోతానన్నాడు. గుండె గుడిలో దేవతలా ప్రతిష్ఠించుకుంటానన్నాడు.

మంగి కళ్ళల్లోకి నీళ్ళొచ్చేశాయి.

"మా కోసం కన్నీరు పెట్టొద్దు. నువ్వు హనుమంతుడికన్నా మిన్నగా సాయపడ్డావు. నీ రుణం తీర్చుకోలేం. నీలాంటి ఎందరో ఆశీస్సులతో సుఖంగా క్షేమంగా జీవిస్తాం" అన్నాడు.

ఆమెకి దుఃఖం పొంగివచ్చింది. సర్పంచ్ చిట్టిబాబు పెట్టిన ఆశకి ప్రలోభపడి ప్రేమికులకి అన్యాయం చేస్తున్నానా అని విలవిల్లాడింది!

★ ★ ★

అర్ధరాత్రి.

ఇంట్లోని వాళ్ళంతా నిద్రపోతున్నారు. కృష్ణమాచార్యులు మాత్రం నిద్రపోవటం లేదు. రగుల్తోన్న రాక్షసి బొగ్గులావున్నారు. నిజంగా ఆయన గుండెలు నిప్పులమీద పెట్టినట్టు దహించుకుపోతున్నాయి.

అలివేలికి పెళ్ళికుదిర్చారు. ముహూర్తం పెట్టారు. వచ్చేవారమే బావమరిది దగ్గర పెళ్ళి. ఇంకో రెండ్రోజుల్లో భార్యాబిడ్డల్ని తీసుకుని అక్కడికెళ్ళడానికి ఏర్పాట్లు చేసుకున్నారు.

ఇంతలో పిడుగులాంటి వార్త చెవినేశారు పెద్దమునసబుగారు.

"ఈ రాత్రే సూర్యమూ నీ కూతురూ

కలిసి లేచిపోవాలని పథకం వేశారని నమ్మ కంగా తెలిసింది. కావాల్సిన వాడివి గనుక నీమేలు కోరి చెబుతున్నాను. ఇది నీకు పరీక్ష సమయం. నీ బ్రాహ్మణ్యాన్ని నిలుపు కుంటావో జంధ్యాన్ని తెంచేసుకుంటావో నువ్వే తేల్చుకో" అన్నారాయన.

ఉక్రోషపడిపోయారు.

"అదే జరిగితే ఆ దౌర్భాగ్యుడ్ని నా చేతుల్తో తీసుకెళ్ళి నరకంలో పడేసి మరిగే నూనెలో వేపేలా చేస్తాను"

"నువ్వా మాటమీదే నిలబడు. నీకు అండగా మేమంతా వుంటాం"

దృఢచిత్తంతో తలూపి వచ్చేశారు.

అలివేలుని గది దాటనీకుండా కట్టడిచే శాడు. అయినా ఎలాపోలా వాళ్ళు సైగలు చేసుకున్నారంటే పారిపోడానికి పథకం వేశారంటే ఏమనుకోవాలి? ఇంత పెద్దకుట్ర పన్నిన ఆ సూర్యంగాడు నిజంగా గుండెలు తీసిన బంటే. ఎంతకైనా తెగించగల సమ ర్థుడే. ఇవాళేదోటి తేల్చి పారెయ్యాల్సిందే.

బయట కుక్క మొరిగిన శబ్దం వినిపిం చింది.

అదిగో వచ్చేసివుంటాడు!

చటుక్కున లేచారు కృష్ణమాచార్యులు. శబ్దం కాకుండా తలుపు తీసి పెరట్లోకెళ్ళారు. బడితె అందుకుని వుగ్గబెట్టి చూశారు. ఎవరూ కన్పించలేదు.

పెరడు అంతా వెదికారు. ఎవరూ లేరు. దుప్పటి ముసుగేసుకుని పెరటి తలుపు కూడా తీసి చూశారు. ఎవరూ లేరు. ఏ గోడపక్కనైనా నక్కి వున్నాడేమోనని చూశారు. వూహూ- లేడు. చెరువురేవులో మెట్లదగ్గరున్నాడేమోనని చూశారు. అక్కడా లేడు. వీధివైపు వెళ్ళారు. అక్కడాలేడు. అట్నించి తిరిగి పశువుల కొట్టంలోకెళ్ళారు.

లోపలంతా రొచ్చువాసన. పాలేరు కుర్రాడు సరిగ్గా శుభ్రం చెయ్యటంలేదని విసుక్కున్నారు.

చుట్టూ చూశారు. పశువుల మాటున దాక్కున్నాడేమోనని చూశారు. లేడు. ఇంకా రాలేదేమో అనుకొంటోంటే గడ్డిమేటు పక్కన గొంతుక్కూర్చుని కన్పించిందో ఆకారం.

తమింటి పెరటి గుమ్మంవైపే చూస్తూ కూర్చుంది.

తను వీధిలోకెళ్ళినప్పుడు వచ్చాడేమో! చుట్టూ తిరిగి రావడంతో తనని గమనించే అవకాశం వుండివుండదు!

అసలు ఆ ఆకారం సూర్యమేనా?

చప్పుడు చెయ్యకుండా వెనుకనుంచి సమీ పించాడు.

అతడివీపు భాగం స్పష్టంగా కన్పించింది.

కృష్ణమాచార్యులి రక్తం సలసల మరి గింది. కోపం ఆవేశం వుప్పెనలా పొంగి వచ్చాయి.

బడితెతో బలాన్నంతా వుపయోగించి తలమీద బలంగా కొట్టారు!

కొబ్బరికాయలా పగిలింది సూర్యం తల!

రక్తం చిమ్మింది!

"అ...మ్మ...మ్...!" ముందుకి కూలబడి పోయాడు.

గాఢనిశ్శబ్దం అలుముకుంది కొన్ని క్షణాల పాటు.

కసి తీరిందని సంతోషించారు. అరక్షణ కాలమే. ఆ పిమ్మట ఆవేశం చప్పగా చల్లా రిపోయింది. కాళ్ళు వణికాయి. చేతిలోని బడితె జారిపోయింది.

అతడ్ని కుదిపి చూశారు. చలనం లేదు.

స్పృహ తప్పిందో, చనిపోయాడో అర్థంకా లేదు.

బద్దలైన తలనుంచి రక్తం స్రవిస్తూనే వుంది.

వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చి ఆయన్ని నిలువెల్లా ఆక్రమించి కుదిపేసింది.




ఒళ్ళంతా ముచ్చెమటల్తో తడిసిపో యింది. కళ్ళు బైర్లుగమ్మి తూలి పడబోయి నిగ్రహించుకున్నారు.

బడిలెనీ, తన చేతుల్నీ, సూర్యం తలనీ మార్చిమార్చి చూశారు. బావురుమని ఏడ్చారు.

ఎవరో తరుముతున్నట్టు, యమపాశం తెస్తున్నట్టు వింత భ్రమకి లోనయ్యారు.

మరి నిలవలేక మునసబుగారింటివైపు పరుగెత్తారు కృష్ణమాచార్యులు!

★ ★ ★

తలుపు తట్టగానే గబుక్కున తలుపుతీ శారు పెద్దమునసబుగారు.

హత్యచేసి వచ్చినవాళ్ళా వణికిపోతున్న కృష్ణమాచార్యుల్ని చూసేసరికి చాలా సంతోషం వచ్చింది. నిజానికి తండ్రీ కొడుకులు ముగ్గురూ ఆయన రాకకోసం, ఆయన తెచ్చే వార్తకోసం ఎదురుచూస్తూ టీవీ పెట్టుకుని కూర్చున్నారు!

"ఏమిటిలా వచ్చావు? అరె! అలా వున్నావేమిటి! ఏం జరిగింది ఆచార్లూ" ఏమీ ఎరగనట్టు ఆందోళన ప్రదర్శించారు. ఆయన కొడుకులు కూడా వచ్చి ఆత్రంగా చూశారు.

"చాలా ఘోరం జరిగిపోయింది మునసబుగారూ" ఏడ్చేశారు.

"ఏం జరిగిందో చెప్పవయ్యా మగడా" సస్పెన్స్ భరించలేక విసుక్కున్నారు.

"సూర్యం తల బద్దలుగొట్టేశాను!"

ముగ్గురి మొఖాల్లోనూ ఆనందరేకలు గుప్పుమని వెలిగి మాయమయ్యాయి.

"వాడు నిజంగా సూర్యమేనా లేక పొరబాటున మరెవర్నైనా..." చిన్నపాటి అనుమానం తలెత్తగా అడిగారు.

"సూర్యమే"

"చచ్చేడు కదా?"

"చనిపోయాడో స్పృహ తప్పిందోగాని చనిపోయినట్టే పడివున్నాడు..."

సర్‌మని కోపం వచ్చింది మునసబుగారికి. "నువ్వెక్కడి వాడివయ్యా. ఒకటికి రెండు దెబ్బలేసి చంపిపారెయ్యొద్దూ. శత్రు శేషం వుండకూడదని తెలీదూ?"

ఆయన కోపానికి నిలువు గుడ్లేసుకుని చూస్తూండిపోయారు కృష్ణమాచార్యులు. వెంటనే సర్దుకున్నారు మునసబుగారు.

"నీకు తెలుసుకదా ఆచార్లూ- సూర్యం దేవాంతకుడు. కొనగోటి ప్రాణం వుంచితే చాలు త్రివిక్రముడైపోతాడు. తన వాళ్ళని వెంటేసుకొచ్చి నిన్నూ నీవాళ్ళనీ నీ ఇంటిలోనే సజీవంగా తగలబెట్టేస్తాడు. అందుకనే అలా అడిగాను"

"మరిప్పుడేవిటి చెయ్యడం?" మరింత బెంబేలు పడుతూ అడిగారు.

"అభయహస్తం పట్టి నేను కూర్చుని వుండగా నీకు భయమెందుకు? ధైర్యం తెచ్చుకో. మిగతా కార్యక్రమం నేను నడుపుతానుగా. ఒరేయ్. ఆచార్లుకి మంచినీళ్ళు తెచ్చివ్వండి"

"ఇప్పుడు నాకేం వద్దు. ముందాపీడ తొలగే మార్గం చూడండి చాలు" మంచుగడ్డమీద కూర్చున్నట్టు వణికిపోతూ అన్నారు.

"నామీద భారం వేసి కూర్చోమన్నాగా. కూర్చోండి. నేను చెప్పినట్టు వినండి చాలు" కాస్త పరుషంగానే అన్నారు.

నోరు మూసుకోక తప్పింది కాదాయనకి.

మునసబుగారు గబగబా ఆలోచించారు.

తన శత్రువు చావుబ్రతుకుల్లో వున్నాడు. త్వరత్వరగా ఏదోటి చేసి వాడ్ని మాయం చెయ్యాలి. చనిపోయివుంటే శవాన్ని మాయ చేసి ఎక్కడికో పారిపోయినట్టు నమ్మింపజెయ్యాలి. అధికారం పూర్తిగా తన హస్తగతమవుతుంది గనుక అదేమీ కష్టంకాబోదు.

అలాగని కీడెంచక తప్పదు. ఎటు తిరిగి

ఏమొచ్చినా తన చేతులకి మట్టి అంటకూడదు. తన కొడుకులు ఇరుక్కోకూడదు. అంచేతీఘటనలో వాళ్ళని పాల్గోనివ్వకూడదు. తను కూడా దూరంగా వుంటే మంచిదేగాని తను ముందు లేకపోతే మిగతా వాళ్ళెవరూ నిలబడరు. ఒకవేళ అతగాడింకా బతికేవుంటే తన అధికారానికి నూకలు చెల్లటం ఖాయం. అంచేత తనుండాలి. తను తేలిగ్గా తప్పించుకోడానికి వీలుగా మరికొందర్ని కలుపుకోవాలి.

ఎవరైతే బాగుంటుంది?

నారాయణ గుర్తొచ్చాడు. తండ్రి శివస్వామి చావుకి కారకుడు సూర్యమే అని నమ్ముతూ అతడిమీద కారాలూ మిరియాలూ నూరుతున్నాడు. అలాగే అవమాన భారంతో దహించుకుపోతూ ప్రతీకారేచ్ఛతో వూగిపోతున్న పరంధామయ్యా కళ్ళముందు మెదిలారు. వెంకటరెడ్డి కూడా మనస్సులో కదిలాడుగాని అతడు లాభం లేదు. వట్టి పిరికిగొడ్డు అనుకున్నారు. సురేష్ ధైర్యస్థుడేగాని ఇప్పుడు కలిసొచ్చినా రేపు బ్లాక్‌మెయిల్ చెయ్యగల సమర్థుడు!

గాఢంగా నిశ్వసించి నారాయణనీ పరంధామయ్యనీ వున్నపళాన తీసుకురమ్మని కొడుకుల్ని తరిమారు.

"వాళ్ళెందుకండీ. ఇంకా అల్లరైపోతాను. నా ప్రాణాలకి ప్రమాదం తెచ్చిపెట్టొచ్చు" దుఃఖం పొంగివస్తోంటే అన్నారు కృష్ణమాచార్యులు.

"నీకు రక్షణ కల్పించడానికే వాళ్ళని పిలుస్తున్నాను. వాళ్ళందరికీ కూడా సూర్యం శత్రువే కదా!"

మరి మాట్లాడలేదాయన.

పరంధామయ్యా, నారాయణా వచ్చారు. అపరాత్రివేళ పిలిచారంటే ఏదో పెద్ద ప్రమాదమే వచ్చివుంటుందనుకుని హడావిడిగా వచ్చారు.

అంతా వివరించి చెప్పి "ఆనమాలు కూడా దొరకని విధంగా శవాన్ని కాల్చిపారెయ్యాలి" అన్నారు పెద్దమునసబుగారు.

తనని వూళ్ళో తలెత్తుకోకుండా చేసిన సూర్యం చనిపోయాడని విని సంబరపడ్డారు పరంధామయ్య. 'ఇన్నాళ్ళకి మా నాన్న ఆత్మకి శాంతి లభించింది' అని ఆనందించాడు నారాయణ.

"పదండి"

మునసబుగారి వెంట కదిలారు కృష్ణమాచార్యులూ, నారాయణా, పరంధామయ్యా.

కృష్ణమాచార్యులి పశువుల కొట్టం దగ్గరికెళ్లారు. ఒంటిమీద స్పృహలేకుండా పడివున్నాడు సూర్యం. రక్తం గడ్డకట్టగా ఈగలు ముసుర్తున్నాయి.

ఒంగి నాడి చూశారు మునసబుగారు. బలహీనంగా కొట్టుకొంటోంది.

భయతరంగాలాయన్ని కుదిపేశాయొక్కసారే. ఆ సంగతి బయటపెడితే వాళ్ళంతా పారిపోతారు. పారిపోకపోయినా సజీవదహనానికి అంగీకరించకపోవచ్చు పైగా శవదహనంకన్నా సజీవదహనానికి అత్యధిక శిక్ష పడుతుంది!

అలాగని వదిలేస్తే అతడు బతుకుతాడు. తన పెత్తనం తల్లకిందులవుతుంది.

"చచ్చిపోయాడు" అంటూ సూర్యాన్ని భుజానవేసుకున్నారు.

అంత ముసలాడికి అతడ్నవలీలగా ఎత్తేంత బలం ఎలా వచ్చిందోనని విస్తుబోయారంతా. అది కసివల్ల కక్షవల్ల వచ్చిందని గ్రహించలేకపోయారు.

"ఆచార్లూ- పేడతీసుకుని రక్తం పడ్డంత మేరా వెయ్. నారాయణా- దారిలో రక్తపు చుక్కలు పడకుండా పైపంచె తలకి చుట్టు. పరంధామయ్యా, ఎండు కట్టెలందుకో..." గబగబా పనులు పురమాయించేశారు.

పేడ అని అసహ్యించుకోకుండా ఇంత





పేడ తెచ్చి వేశారు కృష్ణమాచార్యులు. నారాయణ సూర్యం తలకి తుండుచుట్టి గడ్డి మోపు తలకెత్తుకున్నాడు. పరంధామయ్య అక్కడున్న ఎండుకట్టెల్ని కట్టలుగా కట్టి ఒకటి ఆచార్లుకిచ్చాడు.

అంతలో ఆయనకి రెండో ఆలోచనొచ్చింది.

తన శత్రువు చచ్చాడు. తన కసితీరింది. ఇక అనవసరంగా దహనక్రియకి చేయూతనివ్వడం ఎందుకు? రేపేదైనా అయితే పోలీసుల ముందు దోషిగా నిలబట్టం ఎందుకు?

"నేన్రాను" అన్నాడు కట్టెలమోపు కింద పడేస్తూ పరంధామయ్య.

ఆయన భావం గ్రహించారు మునసబుగారు. "నువ్వేదో అనుకుంటున్నావు కాబోలు. వీడి శవాన్ని ఏవూరవతలో పారేసి పోయామనుకో పోలీసులు అనుమానించేదీ అరెస్టు చేసేదీ నిన్నే"

"నన్నా? నేనేం చేశాను?"

"చేశావా లేదా అన్నది అప్రస్తుతం. చెయ్యడానిక్కారణం నీకే ఎక్కువుంది. నిన్న గాక మొన్న అతడు నిన్ను కట్టేసి కొట్టి ఘోరంగా అవమానించిన దానికి ప్రతీకారంగా అతడ్ని చంపి వుంటావని అంతా విశ్వసిస్తారు. మాలపల్లి అంతా వచ్చి సాక్ష్యం చెబుతుంది. నువ్వెంత మొత్తుకున్నా ఆచార్లుని అనుమానించరు. బాపనాయనకి ఇంత ధైర్యం ఎక్కడిదిలే అనుకుంటారు. ఏమంటావ్?"

అడకత్తెరలో ఇరుక్కున్నట్టు ఫీలయ్యారు.

"నాకు మంత్రులూ, పోలీసు అధికారులూ, జడ్జీలూ ప్లీడర్లూ బాగా తెలుసు. మనకెవరికీ మాట కూడా రాకుండా నేను ముగ్గులు పెడతానుగా. ఆచార్లు తన కూతురికి వేరే అతన్తో పెళ్ళి చేస్తున్నారని తెలిసి విరక్తితో సూర్యం ఎక్కడికో పారిపోయుంటాడని ప్రచారం చేద్దాం. ఏ ఆత్మహత్యో చేసుకునుండొచ్చని బాధపడుతూ కన్నీళ్ళు కారుద్దాం. ఇంకేమీ ఆలోచించకుండా పదండి. ఇహ మనకీ మన పెద్దరికానికీ సవాలు విసిరేవారే వుండరు!"

పెద్దమునసబుగారి మాటలకి మంత్రింపబడినట్లుగా మారుమాట్లాడకుండా అనుసరించారంతా.

ఆ దృశ్యం పెరటిగుమ్మంలోంచి చూసి కళ్ళు తిరిగి పడిపోయింది పుష్పవల్లి. భర్త మంచంమీద లేడేమిటా అని లేచి వచ్చిచూడగా తలుపులు తీసి వున్నాయి. పెరట్లో కొచ్చేసరికి ఆ ఘోరం కంటబడింది.

ఆమె వెనుకే వచ్చింది అలివేలు. క్షణాల్లో పరిస్థితిని ఆకళింపుచేసుకుంది.

ఆమె కళ్ళు నిప్పులు కక్కుతోంటే కొంగు బిగించింది.

★ ★ ★

అగ్రహారం దాటి తిన్నగా కిష్టయ్య మాస్టారింటికెళ్ళింది అలివేలు. తలుపులు దబదబ బాదేసరికి హడావిడిగా లేచొచ్చారు మాస్టారు.

"ఎవరూ" అంటూ ఆయన వెనుకే లేచొచ్చింది కాంతం.

"ఎవరమ్మాయ్..."

"నేను మాస్టారూ. కృష్ణమాచార్యులుగారమ్మాయి అలివేలుని..."

"ఇంత అర్ధరాత్రివేళ వచ్చావు ఏం పనమ్మా..."

"చాలా ఘోరం జరిగిపోయింది మాస్టారూ. మా నాన్నగారూ వాళ్ళూ సూర్యాన్ని..." ఆపైన చెప్పలేక ఏడ్చేసింది.

"సూర్యాన్నేం చేశారమ్మా. త్వరగా చెప్పు తల్లీ"

"భుజాన్నేసుకుని ఎక్కడికో తీసుకుపోయారు. కాళ్ళూ చేతులూ కట్టేసి నట్టున్నారు"

"అయ్యో! అయ్యో! నా బిడ్డనేం జేస్తారో ఏమో. త్వరగా వెళ్ళండి. పదిమందినీ పిలవండీ. నలుగురికీ మేలు చెయ్యడమే తెలిసిన బిడ్డని అభిమన్యుడ్నిచేసి చుట్టుముట్టేశారంట. వాళ్ళ బతుకులు సెడ. త్వరగా వెళ్ళండీ..." గుండెలు బాదుకుంటూ శోకాలు తీసింది మాస్టారి భార్య.

ఆమెనోదార్చి, "నేనందర్నీ పోగుజేసుకెళ్తానుగాని నువ్వు మాలపల్లెలోకెళ్ళి చెప్పమ్మా" అని అలివేలుని పంపేరు మాస్టారు.

అర్ధరాత్రి అపరాత్రి అని పట్టించుకోకుండా పరుగుపెట్టింది అలివేలు. దుఃఖం పొంగివస్తోంది. అవతల సూర్యాన్నేం జేస్తున్నారోనన్న ఆందోళన చుట్టుముట్టి గుండెల్ని పిండేస్తోంది.

కొత్తదారి. అలవాటు లేని పరుగు. అయినా పరుగుపెడుతోంది.

పట్నంలో సెకండ్‌షో సినిమా చూసి టీవీయస్ మీదొస్తూ ఆమెని చూసి ఆగాడు గోపాలం.

"నువ్వు కృష్ణమాచార్యులగారమ్మాయివి కదూ? ఇంత రాత్రివేళ ఎక్కడికి పరుగెడుతున్నావ్? "

"సూర్యానికి అపకారం తలపెట్టారు..."

"ఎవరు? "

"అంతానూ..."

"అంటే ఎవరెవరమ్మా. మీనాన్నగారా? "

"మా నాన్నగారూ మునసబుగారూ ఇంకా ఎవరెవరో వున్నారు"





"ఏం చేశారు? సరిగ్గా చెప్పమ్మా. ఆ బద్మాష్‌ల పనిపడతాను"

"మీరు మోటారుసైకిలుమీద వెళ్ళి సూర్యాన్ని రక్షించండి. మా ఇంటివెనకనున్న తోటల్లోంచి కాలువవైపెళ్ళారు. త్వరగా వెళ్ళండి" ప్రాధేయపడింది.

"సూర్యాన్ని రక్షించే బాధ్యత నాది. కాని ముందేం జరిగిందో పూర్తిగా చెప్పు"

"మా నాన్నగారూ మునసబుగారూ వాళ్ళూ కలిసి సూర్యాన్ని బంధించి భుజానేసుకుని ఎక్కడికో తీసుకుపోయారు"

"చంపేరా? చావుదెబ్బ తీశారా? "

"అహ. కొట్టినట్టున్నారు. ఎక్కడికో హడావిడిగా తీసుకెళ్ళిపోయారు. మీరెళ్ళండి. రక్షించండి"

"వాళ్ళు సామాన్యులు కాదు. వాళ్ళ వెనక దుండగులూ రౌడీలూ వుండివుండొచ్చు. అందర్నీ తీసుకుని క్షణాల్లో వెళ్తాను. నువ్వెక్కడికెళ్తున్నావ్"

"మాలపల్లెకి..."

"అవునవును. అది ముఖ్యం. నేనుకూడా అందర్నీ ఆయుధాలు ధరించి రమ్మన్నానని నామాటగా చెప్పు. ఇలాటి అన్యాయాల్ని మనూళ్ళో మళ్ళీ జరక్కుండా చర్యతీసుకోవాలి. వెళ్ళమ్మా"

ఆమె పరుగెట్టింది.

కాని గోపాలం కదల్లేదు. సంబరంగా నవ్వుకున్నాడు.

మునసబు రంగంలో వున్నాడూ అంటే సూర్యాన్నేదో చేసేసి వుంటాడు. ఇంతవరకూ చెయ్యకపోయినా ఇంకాస్సేపట్లో చేసేస్తాడు. ఆ రకంగా సూర్యం అధ్యాయం ముగిసిపోద్ది. ఆ హత్యా నేరంమీద మునసబూ మిగతావాళ్ళూ జైలుకెళ్ళిపోతారు. ఇక వూళ్ళో తనకి తిరుగుండదు. రేపటి గ్రామనాయకుడు తనే. ముమ్మాటికీ తనే!

పరమానందపడిపోయాడు. వెంటనే

వెళ్ళి రక్షిస్తే మునసబు అడ్డు తొలగొచ్చు గాని సూర్యం హీరో అయ్యి కూర్చుంటాడు. అతగాడి అడ్డు తొలిగితేగాని తన దారి శుభ్రంగా వుండదు!

కాసేపూరుకుని అప్పుడు అరచి గగ్గోలు సృష్టించాలనుకున్నాడు గోపాలం! ఎలాగైనా ఈ సంఘటనని ఆసరా చేసుకుని అందలం ఎక్కెయ్యాలనుకున్నాడు.

సూర్యం చెప్పిన సంగతుల్ని బట్టి తెలుసుకుని మాలపల్లెలోకెళ్ళింది అలివేలు.

పల్లె మధ్యలో నిలబడి "సూర్యం! సూర్యం! సూర్యం!" అంటూ బిగ్గరగా కంఠనాళాలు తెగేలా అరిచింది.

అదో తారకమంత్రంలా పనిచేసింది.

ఆ రెండు అక్షరాల పదం చెవిన బడటం ఆలస్యం అంతా గుడిసెల్లోంచి వురికివచ్చారు. ఆడా మగా పిల్లా పీచూ తోసుకొచ్చారు.

ఆమె ఎవరో తెలీలేదు. అర్ధరాత్రి మాలపల్లెకెందుకొచ్చిందో సూర్యనామజపం ఎందుకు చేస్తోందో బోధపళ్ళేదు.

భగభగమండుతోన్న ఆమె కదలి వచ్చిన కనకదుర్గలా అన్పించింది.

నిప్పులు కక్కుతోన్న ఆమె ఆగ్రహం ఎవరిమీదో ఎందు నిమిత్తమో తెలీలేదు.

"నువ్వెవరిని తల్లీ..." ఆమె రౌద్రాకారం చూసి వణకుతూ అడిగింది సూర్యం తల్లి చుక్కమ్మ.

"అలివేలుమంగని! నా గురించి కాదు ముందు సూర్యం గురించి ఆలోచించండి. అతన్ని ఆదుకోండి. పదండి. పదండి..."

"నాబిడ్డకేమయ్యింది? " తల్లి మనస్సు ఆక్రోశించింది.

"దుర్మార్గులు సూర్యాన్ని పొట్టనబెట్టుకోవాలని చూస్తున్నారు. కొట్టి కట్టి ఎక్కడికో తీసుకుపోయారు. సజీవదహనం చెయ్యడానిక్కాబోలు మోసుకుపోయారు. పదండి వెళ్దాం. ఆ కలికాండని ఆపుదాం పదండి... పదండి..."

"రేయ్... రంగ్రోయ్ రంగ్రోయ్..." అరుస్తూ యువకులూ కుర్రాళ్ళూ నాలుగు మూలలకీ పరుగెత్తారు. హెచ్చరిక గంట మోగించారు.

కుర్రాళ్ళు డప్పులందుకున్నారు.

వూరు అదిరిపడేలా డప్పునాదం ప్రతిధ్వనించి అందర్నీ భయపెట్టింది. మత్తు వదిలించింది, కదలించింది.

ఆడా మగా అంతా ఒక్కటయ్యారు. ఆగ్రహోదగ్రులై చేతికి దొరికిన ఆయుధాన్ని చేబట్టారు.

అంతా కొంగు బిగించారు.

మాలపల్లె కదిలింది. మాదిగగూడెం కదిలింది. ఎరుకల, యానాది, కుమ్మరి, కమ్మరి వాడలన్నీ కదిలాయి. చిన్న సన్నకారు రైతులూ కూలీలూ కదిలారు. మంచీ, మనసూవున్న ప్రతి ఒక్కరూ కదిలారు. పల్లెల్లోని కొన్ని మేడలవాళ్ళు తప్ప మొత్తం వూరువూరంతా కదిలింది.

కాగడాలు చేతబూని భగభగమండుతూ చీకటి చీల్చే సూర్యుళ్లై ఒక్కుమ్మడిగా కదిలారు. చైతన్య ప్రవాహంలా, జనసముద్రంలా కదిలారు!

★ ★ ★

ఏదో కసికొద్దీ పంతంకొద్దీ సూర్యాన్ని భుజానవేసుకుని మోస్తున్నారు తప్ప చాలా ఇబ్బందిగా ఆయాసంగా వుంది మునసబు గారికి.

పైగా సూర్యానికి మెలకువరాకుండానే గమ్యం చేరాలి. దహనం చెయ్యాలి. అన్న ఆత్రుత ముందుకి తోస్తోంది. అతడేమాత్రం కదిలినా అతడు బతికున్నాడన్న నిజం ఏ కొంచెం తెలిసినా మిగతావాళ్ళు తలో

దిక్కుకీ పరుగులు తీయడం ఖాయమని ఆయనకి బాగా తెలుసు. అందుకే పట్టుదలగా ఒగురుస్తూనే నడుస్తున్నారు.

తోటలకడ్డంబడి దాటారు. కాలువగట్టే పోతోంటే "ఇలా ఎక్కడికి? " అసహనంగా అడిగాడు నారాయణ.

"శ్మశానానికి"

"ఎ... ఎందుకు? " కృష్ణమాచార్యులు కంగారుపడ్డారు.

"తగలెయ్యడానికి"

"అటున్నది హిందువుల శ్మశానం కదా..." మళ్ళీ ఆయనే అనుమానం వెలిబుచ్చారు.

"బతికున్నోడికి కులమూ మతమూగాని చచ్చినోడికేంటి? శవం ఎవరిదైనా శవమే... రాచపీనుగైనా సరే కంపు కొట్టక మానదు. కాల్చినా పూడ్చినా కడకి కలిసేది పంచభూతాల్లోనే. నీ ప్రతిభని ఇలాటికాడ ప్రదర్శించకు. శవానికి కులమతాల బొట్లు పెట్టొద్దు" కసురుకున్నట్టుగా అన్నారు మునసబుగారు.

"ఆ పనేదో ఇక్కడే చేసేయ్యొచ్చుగా" అన్నారు పరంధామయ్య గొణుగుతున్నట్టుగా.

"చెయ్యొచ్చు కానిదేవైనా భోగిమంటా ఎక్కడబడితే అక్కడ వేసెయ్యడానికీ? చావుమంట. పైగా అర్థాంతరపు చావుమంట. రహస్యం ఎవడికీ తెలీకుండా గుట్టు చప్పుడు కాకుండా ముగించెయ్యాలీ కార్యక్రమం. అందుకే శ్మశానానికి! అక్కడెన్నో శవాలు కాల్తూంటాయి. ఎన్నో శవాల బూడిద కలసి వుంటుంది. దాంతో బాటే ఇదీనూ. నరమానవుడికే కాదు మూడో కంటివాడిక్కూడా అనుమానం రాదు. కాస్త వేగంగా అడుగులెయ్యండి. తెల్లారకుండానే చితిమంటలు చల్లారిపోవాలి..."

మునసబుగారు వేగం పెంచారు. మిగతావాళ్ళు దేవుడా అనుకుంటూ అనుసరించారు.

పరంధామయ్య ఎండుకట్టెల కట్టనీ నారాయణ గడ్డిమోపునీ మోస్తోంటే కృష్ణమాచార్యులు చేతులూపుకుంటూ నడుస్తున్నారు. ఆ సంగతి మునసబుగారు గమనించి కయ్ మన్నారు.

"ఆ చేతులూపించుకోవడం ఏమిటి ఆచార్లు. పుల్లలో ఎండిన ఆకులో ఏవోటి పోగుజేసుకురా"

తలాడించక తప్పలేదాయనికి.

అలివేలు తనసెలాంటి 'గతి'కి లాక్కొచ్చింది! చూసిచూసి ఒక మాలవాడ్ని ప్రేమించింది! కులానికి భ్రష్ఠు పట్టించడానికే పుట్టినట్టుంది. ఒకవేళేదో ప్రేమా దోమా అంటూ అరిచిందే అనుకో ఎలావోలా నచ్చజెప్పి దార్లో పెట్టుకుంటాడు. వీరభద్రయ్య తిన్నగా వుండకుండా రచ్చబండదగ్గరికి లాగాడు. దాంతో పౌరుషాలకి పోక తప్పిందికాదు. అప్పుడైనా అలివేలుని బామ్మర్ది ఇంటికి తీసుకెళ్ళి ఆ మూడుముళ్ళూ వేయించేసి వుంటే సరిపోను. వీలైనసంబంధం చూసి చేద్దామనుకొంటోంటే ఈలోగానే లేచిపోవాలనుకోవడం ఆ సంగతి మునసబు పనిగట్టుకొని చెప్పడం తను ఆవేశపడి తల బ్రద్దలు కొట్టడం గబగబా జరిగిపోయాయి!

తను కాస్త విచక్షణ ప్రదర్శించివుంటే ఆవేశాన్ని కాస్తంత అదుపుచేసుకునివుంటే ఇంత ఘోరం జరిగేదికాదు. ఇలాటి 'కర్మకాండ'లో పాల్గోవలసీ వచ్చేదికాదు. వున్నతకులంలో జన్మించి ఆఖరికిలా....!

పరిపరివిధాల తనలో తాను వాపోసాగాడు కృష్ణమాచార్యులు.

పరంధామయ్య పరిస్థితీ అందుకు భిన్నంగాలేదు.

సూర్యం ఒకప్పుడు తనేదో తుంటరిచర్యకి దిగితే పట్టుకుని చెట్టుకు కట్టేసి తీవ్రంగా





అవమానించిన మాటనిజమే. అందుకతగా డిలా దుర్మరణం పాలవడమూ బాగానే వుంది కాని మధ్యలో తను ఇరుక్కోవడం మాత్రం బొత్తిగా బావుండలేదు. మునసబు పిలిచినా తను రాకుండా వుండివుంటే సరి పోయేది. వీళ్ళే ఈ కార్యం ముగించేసే వారు. తనకి శత్రుశేషమూ వుండేదికాదు. ఇప్పుడిది ఏ మలుపుతిరుగుతుందో ఏమో. ఏమైనా గొడవైతే? పోలీసు కేసైతే? - అని కంపించిపోతున్నారాయన.

నారాయణలో తను అనవసరంగా తల దూర్చానన్న భావం అంతకంతకీ బలపడసా గింది.

సూర్యం తన ప్రధమశత్రువనడంలో ఎలాంటి సందేహంలేదు. తన తండ్రి అకాల మృత్యువాత పడటానిక్కారకుడు ముమ్మా టికీ అతడే. అందుకతడి కెలాటి శిక్ష విధిం చినా తప్పులేదు. పాపం అంటదు. ఊళ్ళో తమకుటుంబపు పరువు తీయడమేగాక తన వడ్డీవ్యాపారానికి పెద్ద ఆటంకంగా తయార య్యాడు. తాము అప్రదిష్ట పాలవడం వల్లే కదా సురేష్ అప్పు ఇస్తానంటే రొయ్యల రైతులంతా అటుపరుగెడుతున్నారు? లేక పోతే కోరినంత వడ్డీ ఇచ్చేవాళ్ళుకదా. తన వ్యాపారం డౌన్ అవడానికతడే కారణం. అతడి చావు తనకి శుభస్కరం.

అలాగని ఇలాశవాన్ని మాయంచెయ్య డంలో తనోపాత్ర పోషించాల్సి రావడం ఏం బాగుండలేదు. మునసబు గుంటనక్క. కావాలనే తామందర్నీ ఇరికిస్తున్నాడు. రేపు తను తప్పుకొని తమని ఇరికించినాఇరికించ గల సమర్థుడు. అలాగని ఎదిరించి వెళ్ళిపో యినా ముప్పే.

ముందుగొయ్యి వెనుక నుయ్యిలా వుంది తన పరిస్థితి. ఇప్పుడేవిటి చెయ్యడం? - అని మధనపడసాగాడు నారాయణ.

శ్మశానంలో ప్రవేశించారంతా.

ఓ ప్రక్కగా ముళ్ళపొదల మధ్యలో గడ్డి వేయించి దానిమీద సూర్యాన్ని పడుకోబె ట్టారు మునసబుగారు. అతడి మీదా ప్రక్కల్నా పుల్లలు పేర్పించారు. కిరసనా యిలు లేదు గనుక త్వరగా మండటాని గ్గాను ఎండుపుల్లల్నీ ఆకుల్నీ తెమ్మన్నారు. అక్కడక్కడా పడివున్న పిడకల్ని ఏరి పత్ర మ్మన్నారు.

మసక వెన్నెల్లో మునసబుగారు ఆజ్ఞ వేస్తోంటే మిగతావాళ్ళు చకచకా యాంత్రి కంగా చేసేస్తున్నారు.

అందర్లోనూ ఏదో తెలీని గుబులు, దుఃఖం పొంగిరాసాగాయి. శ్మశాన వైరాగ్యం ఆవరించసాగింది.

"ఉన్నత కులంలో మచ్చలేని వంశంలో పుట్టాడు. అలాటితనకి మాలవాడి శవానికి స్వయంగా దహన కర్మ చేయాల్సిన కర్మ పట్టింది! కర్మంటే ఇదే కాబోలు!

ఇది ఇంతటితో ముగిసిపోతే బాగానే వుణ్ణు! పోలీసులదాకా పోయి తనను హంత కుడంటూ బోనెక్కిస్తే- కటకటాల వెనుక బ్రతుకంతా చిప్పకూడు తింటూ మ్రగ్గిపో వాలి!

కులం మతం అంటూ వూరేగి విద్వేషం పెంచుకుని హత్య చేసేంతగా దిగజారి పోయాడు. ఒక బ్రాహ్మణుడు నడవాల్సిన దారేనా ఇది? ఇంకెక్కడి బ్రాహ్మణ్యంలే. జైల్లో అంతా చిప్పకూడే!

అన్నట్టు ఈ శ్మశానంలోనూ అంతేకదూ. ఇక్కడ కులమేమిటి మతమేమిటి ధనికుడే మిటి, పేదేమిటి. అంతా సమానమే. అంతా మట్టిలో మట్టిగా కలిసిపోవాల్సిందే. మరి మట్టి బొమ్మల్లాంటి మనుషుల మధ్య కుల వర్గ వివక్షా విద్వేషాలు ఎందుకో!" అని మధన పడుతున్నారు కృష్ణమాచార్యులు.

"ఎరక్కపోయి వచ్చి ఈ గొడవలో ఇరు క్కుపోయాను. ఈ మునసబుని నమ్మ రాదు. ఎత్తు జిత్తుల్లో అందెవేసిన చేయి.



మమ్మల్నిందులోకి లాగడం వెనుక ఏదో వ్యూహంవుండేవుంటుంది! హాయిగా తండ్రి ఇచ్చి పోయిన ఆస్తిపాస్తులు చూసుకోక పదవులూ పెద్దరికాలూ అంటూ మునసబు చుట్టూ తిరిగినందుకు బాగానే ఇరికిస్తున్నాడు. ఏదైనా జరిగితే తను తప్పుకుపోయి మమ్మల్ని బలిపశువుల్ని చేస్తాడేమో కర్మ! అసలటుతండ్రీ బ్రతికిలేడు. ఇటు సూర్యమూ చచ్చేడు. ఇంక కక్షలకీ కార్పణ్యాలకీ చోటేలేదు కదా. బుద్ధిగడ్డి తిని పిలవగానే తోకాడించుకుంటూ వచ్చి ఎంత తప్పు చేశానూ'' అని ఆవేదన పడ్డాడు నారాయణ.

"గ్రహచారం అంటే ఇదే కాబోలు! లేకపోతే ఎప్పుడో జరిగిన ఘటనని మునసబు ఎత్తి చూపి బెదిరిస్తే భయపడి వచ్చాడు. కొంచెం బుర్రపెట్టి ఆలోచించి వుంటే బాగుండిపోయేది. అవాళ మాలపల్లెలో తననంత ఘోరంగా అవమానించినప్పుడు ఈ మునసబువచ్చి ఆదుకున్నాడా? లేదే. కనీసం ఆ తర్వాతైనా వాళ్ళని మందలించాడా? లేదే. అలాటి వాడ్ని నమ్మివచ్చాడే. వెళ్ళిపోతానంటే బెదిరిస్తున్నాడు. సూర్యాన్ని తనే చంపేడని మునసబుచెప్పినంతమాత్రాన పోలీసులూ కోర్టులూ గుడ్డిగా నమ్మేస్తాయేమిటి? ఏవిటో ఆయన మాటలమాయలోపడి వచ్చేశాడు. తనపిచ్చిగానీ అంతా ఏదోరోజున ఈ శ్మశానానికి రావాల్సిందే. అవమానాలూ, అధికారాలూ హోదాలూ, గర్వాలూ, అన్నీ మరిచి ఈనేలమీద ఒంటిమీద నూలుపోగైనా లేకుండా పడుండాల్సిందే. పంచభూతాల్లో కలవాల్సిందే. ఈ ఆశలూ కక్షలూ అన్నీ క్షణభంగురాలు. అసలీ శరీరాలే అశాశ్వతాలు. వీటికోసం ప్రాకులాట్టం కొట్టుకోవడం కాట్లాడుకోవడం ఎంత చిత్రం! మరెంత దారుణం!" వైరాగ్య బంధనాల మధ్యనలిగిపోతున్నారు పరంధామయ్య.





అసలేరకంగానూ ఏమాత్రమూ బాధపడనిదీ భయపడనిదీ భ్రాంతికి కూడా లోనుకానిదీ పెద్దమునసబుగారే.

జరిగిన దాని గురించి గాని జరుగుతున్న దానిగురించిగాని ఎలాంటి దిగులూ సంకోచాలూ ఏవీ లేవాయనకి.

పైగా అంతా తనాశించినట్టే జరుగుతున్నందుకెంతో సంతోషంగా కూడా వుంది.

సుశిక్షితుడైన డాక్టరు శస్త్రచికిత్స చేస్తున్నట్టుగా అన్నీ తనకనుకూలంగా మార్చుకొని అందరి సహకారమూ అందుకుంటూ చకచకా దహన కార్యక్రమాన్ని వేగిరపరుస్తున్నారు.

ఇంకొద్ది సేపట్లో తన ప్రధానశత్రువు శాశ్వతనిద్రలోకి జారిపోబోతున్నాడు! ఆనవాళ్ళు కూడా మిగలని విధంగా మసికాబోతున్నాడు! ఇక తనకీ తన సంతానానికీ ఎదురులేదు. సవాలు విసిరే వారులేరు. ఎదురునిల్చి మాట్లాడేవారూ వుండరు.

ఇక అంతా తమదే. తమ ఇష్టారాజ్యమే. అతి త్వరలో కొడుకని యమ్మెల్యేని చేసిగాని నిద్రపోడు. ఆ చక్కనిరోజు అతి దగ్గరల్లోనే వుంది.

సూర్యం హత్య చేయబడిన సంగతి బయటికి పొక్కినా ఫర్లేదు. పోలీసుకేసు అయినా తనకొచ్చేనష్టం ఏమీలేదు.

కారణం?

తనకీ సూర్యానికీ ప్రత్యక్ష విరోధం లేనేలేదు! కసీకోపం తగవు ఏమీలేవు! అందుకు వూరంతా సాక్ష్యం చెబుతుంది!.

ఈ ముగ్గురికీ సూర్యాన్ని హత్య చేసేంత కసి వుంది. కక్షవుంది. కోపంవుంది. హత్య చెయ్యదగ్గ కారణమూ వుంది.

అంతెందుకు- నాలుగు తగిలిస్తే ఆచార్లే ఒప్పేసుకుంటాడు తనే చంపేనని. నారాయణా, పరంధామయ్యా శవదహనంలో తోడ్పడ్డారని చెప్పి తను చేతులుదులిపేసుకోవచ్చు

తన మీదకేమీరాకుండా చూట్టానికి క్రింది

లెవెల్లో విఏఓ కొడుకు, సర్పంచి కొడుకూ వున్నారు. పై లెవెల్లో యమ్మెల్యే, మంత్రులూ వున్నారు. తను ఉప్పు తినిపించిన రెవెన్యూ అధికారులూ పోలీసు అధికార్లూ వున్నారు.

అంచేత ఎటుతిరిగి ఏమొచ్చినా తనకేమీ కాదుగాకకాదు!

చితి ఏర్పాట్లు పూర్తయ్యాయి.

నలుగురూ నాలుగువైపులా నిలబడ్డారు. ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

"అగ్గిపుల్ల గియ్యి" నారాయణతో అన్నారు మునసబుగారు.

ఈతడు జేబులోంచి అగ్గిపెట్టె తీశాడు. ఒకసారి గీశాడు. మండలేదు. మళ్ళీ గీయబోతోంటే ఏదో కలకలం వినిపించింది.

అది హోరులా వారిగుండెల్లో ప్రతిధ్వనించేసరికి అదిరిపడి అటు చూశారు.

ఒకటికాదు రెండుకాదు చీకట్ని చీలుస్తూ ఎన్నెన్నో కాగడాలు!

ఒక్కసారిగా వేలాది సూర్యుళ్ళు ఉదయిస్తున్నట్లు మిరుమిట్లు గొల్పుతోన్న వెలుగు!

అంతా జనప్రవాహంలా ఇటే వస్తున్నారు. పొంగివస్తున్నారు. ఆవేశంతో బుసలుకొడుతూ ఆకొన్న పులుల్లా ప్రళయకాలరుద్రుల్లా వస్తున్నారు! వచ్చేస్తున్నారు.

వెన్నులోంచి వణుకు పుట్టుకురాగా, "మాలపల్లె అంతా కదిలొచ్చేస్తోంది" అని వెర్రిగా అరిచారు కృష్ణమాచార్యులు.

గజగజ వణికిపోయారు పరంధామయ్య. మృత్యుదర్శనమైనట్టు కంపించిపోయారు. "వూరువూరంతా కదలివచ్చేస్తోంది. మనల్నింక బ్రతకనివ్వరు" అని అరచి పంచె ఎగధోసి పరుగిచ్చుకున్నారాయన.

నోటితడారిపోతోంటే భయం నిలువెల్లా ఆక్రమిస్తోంటే చేతిలోని అగ్గిపెట్టె విసిరేసి మరోవైపు దూకాడు నారాయణ.

వూహించని పరిణామానికి ఖంగుతిన్నారు మునసబుగారు. "పారిపోతారేంట్రా పిచ్చిసన్నాసుల్లారా. మీ లాంటి పిరికి దద్దమ్మల్ని నమ్ముకోవడం నా బుద్ధిహీనత. ఆచార్లూ- అగ్గిపెట్టె వెదుకు. త్వరగా..." అని తొందరపెట్టారు.

ఏం చెయ్యాలో తోచక భీరువై గుటకలు మ్రింగుతూ పిచ్చిచూపులు చూస్తోంటే- సరిగ్గా అప్పుడు సూర్యం కదిలాడు!

అది చూసిన కృష్ణమాచార్యులు భీకరంగా అరుస్తూ పారిపోయారు.

మునసబుగారొక్కరూ మిగిలిపోయారు. ఈయన ధైర్యం నీరుగారిపోతోంది. అయినా మొండిపట్టుదలతో నారాయణ పారేసిన అగ్గిపెట్టెకోసం పిచ్చిగా వెదికారు. గాలించారు. కాని దొరకలేదు!

జనం వురుకులు పరుగులమీద వస్తున్నారు. అంతకంతకీ సమీపానికొచ్చేస్తున్నారు:

ఆ దృశ్యం చూసిన మునసబుగుండెలు జారిపోయాయి. కాళ్ళు వణికాయి. గుండె లయ తప్పుతోంది. మరేమీ ఆలోచించకుండా ప్రాణభీతితో గుండెలరచేత బట్టుకొని పలాయనం చిత్తగించారు!

చీకట్ని చీలుస్తూ కాగడాలు కదిలి వచ్చేస్తున్నాయి!

చైతన్య శిఖరాల్లా జనం కదలి వస్తున్నారు!

పరుగుతో ప్రవాహంలా దూకి వస్తున్నారు!

ఉప్పెనలా వువ్వెత్తున లేచి వస్తున్నారు!

ప్రభంజనంలా వచ్చేస్తున్నారు!

తూర్పున విచ్చుకుంటున్న వెలుగురేకలు క్రమక్రమంగా సూర్యం మీదికి ప్రసరిస్తున్నాయి.



# సాహసాలనేక రకాలు

"స్కై డ్రైవింగ్"
నిపుణులైన వీరిద్దరూ
విమానంలోంచి
13 వేల అడుగుల
ఎత్తునుంచి దూకి,
భూమిని చేరేలోగా
ఆ పత్రికారాజాన్ని
పఠించేశారు.
ఎందుకయ్యా అంటే...
గిన్నిస్‌బుక్‌లో పేర్లు
పడటం కోసం...
అని వేరే చెప్పాలా!



# చతుర కతలు

## డాలీ

ఎయిర్‌ఫోర్స్ విమానం నంబర్‌వన్ ఇందిరా గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంలో దిగింది. బిచ్చమెత్తడానికి యూరోపియన్ దేశాలకి వెళ్ళి తిరిగి వచ్చిన భారత ప్రధాన మంత్రి, ఆయన సతీమణి విమానం దిగారు. అధికారులంతా అప్రమత్తంగా తమ విధుల్ని నిర్వహిస్తున్నారు.

పెట్ కేరియర్‌ని లైవ్‌స్టాక్ వుంచే విభాగంలోంచి బయటకి తీసాడు బేగ్జ్ హేండ్లర్. ఆ బోనులోని కుక్క మరణించి వుండటం చూసి అతను షాకయ్యాడు. ప్రధానమంత్రి శ్రీమతికి కుక్కలంటే ఎంతిష్టమో భారత ప్రజలందరికీ విదితమే. కుక్కపిల్ల చేతిలో లేకుండా ఆవిడని ఎవరూ చూడలేదు.




అతను వెంటనే ఓ ఎస్.పి. రేంక్ అధికారిని పిలుచుకు వచ్చాడు. అది ఆవిడగారి పెట్ డాగ్ డాలీగా గుర్తించాక ఎస్.పి.కి ముచ్చెమటలు పోశాయి. తన పెంపుడు కుక్క మరణించిందని తెలిస్తే ఆవిడ చేసే గోల ఎలాంటిదో ఊహించుకున్నాక అతనిలో వణుకు కూడా మొదలైంది. ఎందుకంటే ఆ కుక్క సంరక్షణ కోసం అతను ప్రత్యేకంగా వాళ్ళవెంట వెళ్ళాడు. క్షణాల్లో వైర్‌లెస్ మెసేజ్ ఢిల్లీలోని అన్ని పోలీస్‌స్టేషన్స్‌కి వెళ్ళింది. పావుగంటలో అచ్చం డాలీలా కనిపించే ఓ కుక్కని పట్టుకోగలిగారు పోలీసులు. మరో అరగంటలో దాన్ని అక్కడికి ఆఘమేఘాలమీద చేర్చారు.

ఈలోగా ప్రధానమంత్రి విలేకరుల సమావేశం ముగిసింది. వాళ్ళు బయలుదేరడానికి సిద్ధమయ్యారు. ఎస్.పి. పెట్ కేరియర్‌ని కారులోకి ఎక్కిస్తుండగా ప్రధానమంత్రి భార్య దానిదగ్గరకి వచ్చింది.

ఎస్.పి. మర్యాదగా చెప్పాడు.

"చాలా అందమైన డాగ్ మీది'' దాని వంక చూసి ఆవిడ చిన్నగా కేకపెట్టింది.

"సమ్‌థింగ్ రాంగ్ మేడమ్?" అడిగాడు

ఎస్.పి.

"ఇది నా డాలీ కాదు'' అరిచిందావిడ.

"మీ చంకలో వున్న డాలీ ఫొటోని ఎన్నో సార్లు చూశాను. మీ డాలీనే మేడం ఇది. మొహంమీద ఆ తెల్లటి మచ్చచూడండి''

"ఇది నాకుక్కకాదు. అది ఫ్రేంక్ ఫర్ట్‌లో చలికి గడ్డకట్టుకుని మరణించింది. దాన్ని సకల మర్యాదలతో ఇక్కడ పాతిపెట్టాలని తీసుకువచ్చాను. అదేమైంది? అయ్యో, అయ్యో, నా డాలీ..." భోరుమంది ఆవిడ.

-కావ్య

---

# పైసంత బుద్ధి

"బాబూ! ధర్మం చెయ్యండి, ధర్మం చేసి పుణ్యం కట్టుకోండి బాబూ!" అంటూ దూరంగా ముష్టెత్తుకుంటున్న కుంటాడ్ని చూసే సరికి, పీనాసి పినాకపాణికి వాడిని ఏడిపించి వినోదించాలనిపించింది.

ఒకే ఒక క్షణం ఆ పైసా నాణెంకేసి నిర్లిప్తంగా చూసిన కుంటివాడి ముఖం మరు క్షణం బ్రహ్మానందభరితమైంది. "బాబులు ధర్మరాజులు, బాబుకు తెలిసే వుంటది! తెలిసే నాకింతటి యిలువైన నాణాన్ని పెసాదించారు. ధరలు పెరిగిపోడంతో, ఒక పైసా అయిదు పైసల నాణాలన్నీ కనుమరుగైపోనాయి. పాత నాణాల్ని పోగుచేసుకునే పిచ్చి




"ఏయ్ కుంటోడా! ఇలారా" అన్నాడు పినాకపాణి. అతి కష్టంమీద కుంటుకుంటూ పినాకపాణి దగ్గర కొచ్చాడు అతను.

చాలాకాలంగా తన జేబులో వుండిపోయిన ఒక పైస నాణాన్ని తీసి బిచ్చగాడి బొచ్చెలో టంగ్‌మనేలా పడేసి కుంటివాడి ముఖకవళికల్ని పరిశీలించసాగాడు పినాకపాణి.

మారాజులిప్పుడు ఓ నాణాన్ని యాభై, వందా రూపాయలకి కొనుక్కుపోతన్నారు. ధర్మప్రభువులు, మిమ్మల్నా దేవుడు సల్లంగ సూస్తాడు' అని గొణుగుకున్నాడు కుంటివాడు.

పినాకపాణి ఆ మాటలు వింటూనే గతుక్కుమన్నాడు. అవును... పాతపోస్టల్ స్టాంపుల్నీ, నాణాల్నీ పోగుచేసే హాబీలున్న వాళ్ళు ఎంతడబ్బైనా ఖర్చుపెట్టి పాత వాటిని కొనుక్కుంటారు. ఇప్పుడు ఈ ఒకపైసా నాణాన్ని కుంటివాడి బొచ్చెలో అనవస

రంగా పడేశాననుకున్నాడు పినాకపాణి. వెంటనే 'ఏయ్, ఆగు ఆ నాణాన్నిలా ఇచ్చెయ్యి! ఇంకోటిస్తా' అని గట్టిగా అరిచాడు పినాకపాణి.

"వొద్దుబాబూ! తమరలాగనకండి. దానమిచ్చింది తిరిగి తీసుకోకూడదు బాబూ!" ప్రాధేయపడ్డాడు కుంటివాడు.

"శాల్! దానమిచ్చింది తిరిగి పుచ్చుకోవచ్చో పుచ్చుకోకూడదో నాకు తెల్సులేవోయ్! ఇదిగో ఈ పదిరూపాయలు తీసుకుని ఆ పైసా నాణాన్నిలా ఇచ్చేయ్!" అన్నాడు పినాకపాణి.

"బాబూ! ఇదన్నాయం బాబూ!" కుంటివాడు ముఖం బాధగాపెట్టాడు.

పినాకపాణి క్షణం ఆలోచించి ముష్టివాడి బొచ్చెలోంచి తన ఒక పైసా నాణాన్ని లాగేసుకుని, అందులో పదిరూపాయల నోటుపడేశాడు.

"అదృష్టవంతుడివి! పోవోయ్'' అన్నాడు ఆనందంగా.

ముష్టివాడక్కడ్నించి దీనంగా కదిలిపోయాడు.

ఇది జరిగిన రెండునిముషాలకి బిచ్చగాళ్ళందరూ పినాకపాణి చుట్టూ మూగారు.

"బాబూ! నా దగ్గర ఒక పైసనాణాలు నాలుగున్నాయి. నాకు నలభై ఇప్పించండి!" అని ఒకడూ.

"బాబూ! నా దగ్గర పది నాణాలున్నాయి, నా కొంద యిప్పించండి!" అని మరొకడూ. ఇలా బిచ్చగాళ్ళందరూ పినాకపాణి వెంట తగిలారు.

"అవునూ! ఇలా ఒక పైసనాణాల్ని వంద లిచ్చి కొనుక్కుంటున్న వాళ్ళెవరూ?" అంటూ పినాకపాణి వాళ్ళలో ఒకడిని పక్కకు పిలిచి రహస్యంగా వాకబుచేశాడు.

"నాకేటి తెల్సు?! తమరు ఒకపైస నాణాన్ని పదిరూపాయలకి కొనుక్కుంటున్నారని ఆ కుంటోడు సెప్పినాడు'' అన్నాడతను.

ఆ మాటతో పినాకపాణికున్న పైసంత బుద్ధి రూపాయికాసంత కెదిగి అతను బిగిసిపోయాడు.

-రాంరతి

---

## అనంత మాయ

"అసలు వరకట్నాలిచ్చేవాళ్ళని ముందు కఠినంగా శిక్షించాలోయ్! ఇంద పుచ్చుకో, పుచ్చుకో అంటూ వాళ్ళే అన్నీ నేర్పుతున్నారు. వాళ్ళని కంట్రోల్ చేస్తే సమస్య సగం తీరేపోతుంది'' ఉపన్యసిస్తున్నారు అనంతంగారు. ఆయన వాక్ప్రవాహానికి ఆనకట్టవేస్తూ అన్నాడు ఉమాపతి. "ఊరకే ఉపన్యాసాలు దంచటంకాదు. మా అమ్మాయి లిద్దర్నీ మీ అబ్బాయి లిద్దరికీ కట్నం లేకుండా చేసుకో అప్పుడు నిన్ను ఆకాశానికెత్తుతాను''

"మా పెద్దబ్బాయి డాక్టరు, రెండో అబ్బాయి లెక్చరరు. వాళ్ళకు తగిన అర్హత లున్న వాళ్ళయితే నయాపైసా కట్నం లేకుండా చేసుకుంటాను'' అన్నాడు అనంతం.

"మా పెద్దమ్మాయి ఎం.బి.ఏ, చిన్నమ్మాయి ఎం.ఫిల్ చేస్తున్నది. ఇవి తగిన అర్హతలో కావో నువ్వే ఆలోచించుకో' అన్నాడు ఉమాపతి.

"మీ అమ్మాయిలు అపరంజి బొమ్మలు, చదువుల సరస్వతులు. ఇంక కావాల్సిందేముందీ? కట్నం వద్దుగానీ లాంఛనాలు కావాలి అని చెప్పి, ఇల్లు, కారు, యాభై సవరల బంగారం నగలు ఇవ్వమని కట్నానికి నాలుగురెట్లు వసూలు చేయడం నాకు నచ్చదు. పెళ్ళిళ్ళు కూడా ఆడంబరంగా అట్టహాసంగా చేసి డబ్బు, సమయం వృధా చేయడం నాకు అసలే ఇష్టం ఉండదు''

వింటున్న ఉమాపతికి నోట మాట రా లేదు

"మన రెండు కుటుంబాల వాళ్లం కలసి వెళ్ళి దేవాలయంలో పెళ్ళిళ్ళు జరిపిద్దాం. మన సంతోషాన్ని నలుగురికి పంచుకోటానికి ఆరోజు సాయంత్రం అందరికి టీపార్టీ ఇద్దాం సరేనా?"

కోలుకుని "వాళ్ళిప్పుడెక్కడున్నారు?"




అనడిగాడు ఉమాపతి.

"మా పెద్దబ్బాయి పల్లెటూరి ప్రైమరీ హెల్త్ సెంటర్ నుండి పట్నంలోని టీచింగ్ హాస్పిటల్‌కు మారుదామనుకుంటున్నాడు. టీచింగ్ హాస్పిటల్స్ అయితే పెద్దపెద్ద పట్నాల్లో ఉంటాయి. ఇటు సర్వీసులో, అటు ప్రైవేట్ ప్రాక్టీసులో రెండు చేతులతో సంపాదించుకోవచ్చు''తేల్చాడు అనంతం.

లొట్టలు వేశాడు ఉమాపతి.

"నువ్వు ఓ నాలుగు లక్షలు ఖర్చుపెట్టావంటే వాడిని కోరుకున్నచోట వేయించుకోవచ్చు'' సలహా ఇచ్చాడు అనంతం.

"నువ్వు ఇంకో నాలుగు లక్షలు ఖర్చుపెట్టావంటే ఆ రెండోవాడిని కూడా యూనివర్సిటీలో వేయించవచ్చు. అక్కడైతే రీసెర్చి స్కాలర్స్‌మీదా, స్టూడెంట్స్‌కు మార్కులు వేసీ రెండుచేతులా సంపాదించవచ్చు'' తేల్చాడు అనంతం.

"అల్లుళ్ళు ఎంత సంపాదిస్తే అమ్మాయిలు అంతగా సుఖపడతారు. నువ్వు ఓ ఎనిమిది లక్షలు ఖర్చుపెట్టావంటే మీ అమ్మాయిలిద్దరు మహారాణుల్లా వెలిగిపోతుంటారు. మాకు కట్నం దమ్మిడీ అక్కర్లేదు సుమీ''

వింటున్న ఉమాపతికి కళ్ళు బైర్లుకమ్మినట్లయి, కూర్చున్నచోటే వెనక్కు వాలిపోయాడు.

"కొంపదీసి ఈ అర్భకుడికి హార్టుఎటాక్ గానీ వచ్చి గుండె ఆగిపోలేదు కదా'' అని అనుకుని చల్లగా అక్కణ్ణుంచి జారుకున్నాడు అనంతం.

-బి.అనూరాధా ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ !!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**Pickles**
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసిద్ధ

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.